ఏప్రిల్ 2017
రూ.15/-

# చతుర

GSR



ఫ్రీదా పింటో
సౌందర్య రహస్యం ..122

వారేవ్వా!

# రంగులు మార్చే పూలు!



ఊసరవెల్లి రంగులు మారుస్తుందనే విషయం మనందరికీ తెలిసిందే. అయితే షిబాజకురా పూలు కూడా అలాగే రంగులు మారుస్తాయి! తెలుపు నుంచి లేత గులాబీ, ముదురు గులాబీ, వంగపూ వర్ణం వరకు తొమ్మిది రంగుల్లోకి ఈ పూలు మారుతూ మురిపిస్తాయి! ఏప్రిల్, మే నెలల్లోనే ఇవి వికసిస్తాయి. టోక్యోకు దగ్గరలోని చిచిబు నగరంలో, ఫ్యూజి అగ్నిపర్వత పాదాల వద్ద హిత్సూజియామా పార్కులో ఉందీ వనం.

# మనసున ఉన్నదీ...

★ మార్చినెల 'చతుర'లోని డా. జి. సురేష్‌బాబు థ్రిల్లర్ నవల 'వినాశాయ చ దుష్కృతాం' ఆద్యంతం చదివించింది. భగవద్గీత శ్లోకంతో మొదలై అద్భుతంగా సాగింది. మంచి సంభాషణలతో అలరించింది. నవలలో సినిమా వాతావరణం మమ్మల్ని ఆనందింపజేసింది. 'ప్రేమకోసం చంపకు' పెద్దకథ బాగుంది. 'నవలావలోకనం'లో శ్రీధర విరచితమైన 'రాగవిపంచి' నవల సమీక్ష బాగుంది. 'చతుర ప్ర.జ.' శీర్షిక ఆసక్తిగా, ఆధ్యాత్మికంగా ఉంది. 'కొత్తగాలి' కవితలు మెరుపుల్లా తళుకు లీనుతున్నాయి. 'భామనే.. సత్యభామనే..!' శీర్షికలో అనుష్క వివరాలు బాగున్నాయి.

– *ముక్కెర రమేష్‌చంద్ర,*
*గుర్రంపేట, జయశంకర్ భూపాలపల్లి జిల్లా*

★ మార్చి నెల 'చతుర' అనుపమ, తాప్సీల చిత్రాలతో చూడ ముచ్చటగా ఉంది. ఎంతగొప్పవారైనా, గొప్ప పదవులున్నా, గొప్ప సంపదలున్నా సంఘవిద్రోహ చర్యలకు పూనుకుని అడ్డంగా దోచుకుంటారని, అందుకు అడ్డం పడ్డ వారిని అమానుషంగా హత్యలు చేస్తారని సమాజంలోని వ్యక్తుల, సంస్థల కుళ్లుతో కడిగి పారేసిన నవల 'వినాశాయ చ దుష్కృతాం'. దేవుడు కాకున్నా రాక్షసుడుగా మారకుండా మనిషిగా బతికితే చాలు. సంపాదనలో కొంతన్నా సమాజ శ్రేయస్సుకు అందించాలి. అపుడే మనిషి జీవితానికి అర్థం పరమార్థం. 'ప్రేమకోసం చంపకు' కథ అర్థవంతంగా ఉంది. 'రాగవిపంచి' ఐదు దశాబ్దాల కాలం నాటి మన సమాజానికి ప్రతిరూపం.

– *ధప్పూరి శ్రీధరాచార్యులు,*
*సీతారాంబాగ్, హైదరాబాద్*

★ అనుపమ పరమేశ్వరన్ ముఖచిత్రంతో 'చతుర' మమ్మల్ని ఆనందానుభూతుల్లో ముంచెత్తింది. మహిళా పేజీల్లో 'ప్రయోగాల గని.. సొగసుల సిరి!' ద్వారా అనుష్క వివరాలు తెలుసుకుని సంతోషించాం. డా. జి. సురేష్‌బాబు నవల 'వినాశాయ చ దుష్కృతాం' నవరసాలొలికించి మా మదిని ఆకర్షించింది. కథ, ఇతివృత్తం చాలా బాగున్నాయి.

– *కరణం శివానందరావు, కర్నూలు*

★ పురాణాలు, ఇతిహాసాలు, మన సంస్కృతి సంప్రదాయాలు మరిచిపోతున్న ఈ తరంలో మన 'చతుర' డా. రామానుజాచార్యులు గారితో పాఠకుల సందేహాలకు సమాధానాలు ఇప్పించడం హర్షణీయం. ఈ శీర్షిక ఓ అమృతగుళిక లాంటిది! 'కొత్తగాలి' చిట్టికవితలు ఉత్సాహం కలిగిస్తున్నాయి.

– *మధుసూదన, హనుమకొండ*

★ 'వినాశాయ చ దుష్కృతాం' నవల ఆసాంతం ఆసక్తిగా చదివించింది. నేటి సమాజ పరిస్థితులను కళ్లముందుంచింది. పిల్లలను పుట్టించి వారి అవయవాలతో వ్యాపారం చేయడం.. చాలా బాధాకరం! అమెరికా కథ 'ప్రేమకోసం చంపకు' ప్రేమకు కొత్త అర్థం చెప్పింది. శ్రీధర గారి 'రాగవిపంచి'పై సమీక్ష అలరించింది. సమకాలీన అంశాలపై 'కొత్తగాలి' కవితలు ఆకట్టుకుంటున్నాయి.

– *సరిత, కొత్తగూడెం*

★ నవల 'వినాశాయ చ దుష్కృతాం' బాగుంది. డబ్బుకోసం ఎంతటి పాపానికైనా ఒడిగడుతున్న నేటి సమాజ తీరు విస్తు గొల్పుతుంది. భిన్నమైన కథా వస్తువుతో నవల సాగింది. ఉత్కంఠతో పాటు హాస్యమూ పండడం విశేషం! అమెరికా కథ 'ప్రేమకోసం చంపకు' నవలావలోకనం ఆకట్టుకున్నాయి. అనుష్క వివరాలు ఆసక్తిగా ఉన్నాయి.

– *వినోద్, విజయవాడ*

★ డా.జి. సురేష్‌బాబు థ్రిల్లర్ నవల ఆద్యంతం ఉత్కంఠగా సాగింది. పెద్దకథ 'ప్రేమకోసం చంపకు' చక్కని సందేశాన్నిచ్చింది. నవలావలోకనంలో శ్రీధర గారి నవల 'రాగవిపంచి'పై సమీక్ష ఆసక్తికరం. చమత్'కారం' బాగుంది. 'కొత్తగాలి' కవితలు అలరించాయి.

– *రజిత, హైదరాబాద్*

సంపుటి -40,
సంచిక - 3
471వ సంచిక,
పేజీలు : 132,
ఏప్రిల్ 2017

# చతుర



**లో**టస్ టెంపుల్ ముందు దిగిన ఫొటోకు 'రెండు కలువలతో భేషుగ్గా వున్నావ్' అనేది మిత్రుడి మెసేజ్.

అదే చిత్రరాజానికి 'తెల్ల కలువ పక్కన నల్ల బావ సూపర్' అంటూ ఆమె చెల్లెలి సందేశం.

'అంత నల్లగా వున్నానా? హైదరాబాద్ వెళ్ళాక నీ చెల్లి పని పడతానుండు' అన్నాడతను ఉక్రోషంగా.

ప్రతి పదంలో సంతోష సరాగాలను ఏర్చికూర్చిన **డాక్టర్ టి. సంపత్ కుమార్** ప్రేమ ప్రబంధం **కదలికలు** చతుర ఏప్రిల్ కానుక! పేజీ... *06*



★ ముఖచిత్రం : మాస్టర్ కార్తికేయ
★ రెండో కవరు : వారెవ్వా!
★ చివరికవరు : బేబీ కావ్యగీతిక
★ పుస్తకాలంకరణ : రాజు యాట

e-mail: vipula.chatura@eenadu.net / vipula.chatura@gmail.com
Toll Free No: 18004258888 (Hyd)

ప్రపంచమంతా నరరూప రాక్షసుడిగా చెప్పుకునే వ్యక్తి తన జాతి స్వేచ్ఛ కోసం అహోరాత్రం శ్రమించిన వైనాన్ని చూపిన **తెన్నేటి సూరి** నవల **చంఘిజ్‌ఖాన్‌**పై సమీక్ష! పేజీ.. *116*

'రాత్రికి ఇంట్లో పార్టీ. సాయంత్రం మీకు భోజనం త్వరగా పెట్టమని వంటమనిషితో చెప్పాను. మీ గదిలోనే తినండి' ఏ సంబోధనా లేకుండా అత్తగారితో అంది అంతర. మారు మాట్లాడకుండా అలాగే చేసింది అత్తగారు. అయినా ఆ రాత్రి పెద్ద దుమారమే రేగింది.. అసలా పార్టీ దేనికి? ఆ అత్తగారి పరిస్థితేంటి? హృద్యంగా సాగే **అదితి సర్కార్** బెంగాలీ కథ **మలి పొద్దులో..!** పేజీ.. *101*

'ఇది కలో నిజమో తెలీడంలేదు..
నన్నోసారి గిల్లు' అన్నాడతను.
దొరికిందే సందని గాఠ్ఠిగా గిల్లిందా సుందరాంగి.
కెవ్వుమని అరిచి 'నాటీ గాళ్..
ఇంత గట్టిగా గిల్లుతావా?' అన్నాడతను.
'అయ్యయ్యో, నొప్పేసిందా? రక్తమొచ్చిందా?
బ్యాండెయిడ్ వేయనా' అంటూ కొంటెప్రశ్నలేసి
కోణంగి చేష్టలతో కవ్విస్తూ నవ్వించిందామె.
అప్పుడతనెలా బదులు తీర్చుకున్నాడు?
కొత్తగా పెళ్ళయిన
అల్లరి అమ్మాయి - ఆకతాయి అబ్బాయిల
సరస సల్లాపాలతో ఆసక్తికరంగా సాగిన
ఆ నవదంపతుల హనీమూన్ యాత్ర
చివరికి ఏ మలుపు తిరిగింది?
ఏ జీవిత సత్యం చెప్పింది?
వినూత్న కథాంశంతో చిత్రవిచిత్ర గతులలో
పాఠకుల్ని నడిపించే ఉద్విగ్న నవల
**కదలికలు**
చతుర ఏప్రిల్ కానుక!



అనగా అనగా ఒక రాజు, ఒక రాణి కథ కాదు ఇది!

వినగా వినగా వింటూనే ఉండాలని పించే సమకాలీన కథ!

విపత్తుల ఛాయల్లో హాయిగా నిద్రించే మనందరి కథ!

ప్రతీ పనీ ఏదోరూపంలో కదలికలతోనే ముడిపడి ఉన్న కథ!

★ ★ ★

ఒక తెలుగు జంట. పెళ్లయి కొన్ని గంటలైంది. అబ్బాయిది తెలంగాణ. అమ్మాయిది ఆంధ్రప్రదేశ్. మొహాల్లో తేజస్సు. తాజా శోభ. పెళ్లి ఈ రోజుల్లో ఉన్నత మధ్యతరగతికి చెందినవారు చేసే లెవల్లో జరిగింది. పన్నెండు వందల ప్లేట్లు ఆర్డర్ ఇస్తే, పదిహేను వందలమంది భోంచేశారు. ముగ్గురు రాజకీయ నాయకులు, నలుగురు టీవీ కళాకారులు, అరడజను మంది సీనియర్ ప్రభుత్వాధికారులు పెళ్లికి హాజరయ్యారు. జంట ముచ్చటగా ఉందని మెచ్చుకున్నారు. మ్యారేజ్ హాల్లో హడావుడి కదలికలు..!

ఏప్రిల్ పదో తేదీ.. 2015

అన్నీ సవ్యంగా జరిగాయని సంతోషపడ్డారు. 'పెళ్లయిపోయింది' అని పలుమార్లు అనుకొని రెండు కుటుంబాలవారు హాయిగా ఊపిరి పీల్చుకున్నారు. బంధువులు, ఆప్తమిత్రులు కుర్చీలని చిన్నచిన్న వలయాకారాలుగా జరుపుకొని బృందాలుగా ముచ్చట్లు పెడుతున్నారు. టాపిక్కులకి కొదువ లేదు. రియల్ ఎస్టేట్ నుండి రియాల్టీ షోల వరకు, వరకట్నాల నుండి వారఫలాల వరకు, వాస్తుల నుండి ఆస్తుల వరకు, కార్ల నుండి కాంట్రాక్టుల వరకు.. టాపిక్కులలో లింగ వివక్ష స్పష్టంగా కనబడుతోంది. చీరల నుండి చైనా సామగ్రి వరకు, ఆభరణాల డిజైన్ల నుండి అపార్టుమెంటులో అలంకరణ వరకు, అత్తమామల నుండి ఓల్డేజ్ హోమ్స్ వరకు చర్చాంశాలన్నింటిని జోడిస్తే ఓ మినీ డైరెక్టరీ నిమిషాల్లో తయారవుతుంది.

అందరూ ఒకరిని మరొకరు చివరిసారిగా కలుసుకుని సెలవు తీసుకుంటున్నారు. కార్లవైపు కదులుతున్నారు. వధూవరుల అమెరికా అక్కలు, బావలు, అన్నలు, వదినలు- అందరూ కలిపి హనీమూన్ ప్యాకేజిని సృజనాత్మక రీతిలో గిఫ్ట్‌గా రూపొందించారు.

"కిరణ్!" పిలిచారు. అబ్బాయి పేరు 'సాయికిరణ్'!

"ప్రభా!" వేరే గొంతులు పలికాయి. అమ్మాయి పేరు 'సాయిప్రభ'!

"మా అందరి తరపున మీకు స్పెషల్ హనీమూన్ గిఫ్ట్! ఏర్ టిక్కెట్ల ప్రింట్లు, హోటల్ రిజర్వేషన్‌లు, కాంటాక్ట్ నెంబర్లు ఇంకా ఇతర వివరాలన్నింటినీ ఒక అందమైన ఫోల్డర్లో చక్కగా అమర్చి ఇచ్చేవారి అందరి చేతులు తగిలేట్టుగా పట్టుకొని, అప్పుడే పెళ్లయిన నాలుగు గరం గరం చేతుల్లో భద్రంగా పెట్టారు. ఖర్చులకని కరెన్సీ కట్టలున్న మరో కవర్ని కూడా ప్రేమగా ప్రభ చేతిలో ఉంచారు.

మొహం నిండా నవ్వులతో కెమెరాల్లో చిక్కిపోయారందరూ!

ఎవరికి తోచిన రీతిలో వారు కొత్త దంపతులతో సెల్ఫీలోనూ!

హనీమూన్ యాత్రని రొమాంటిగ్గా మేళవించారు. మూడు రోజులు దిల్లీలో, ఒక రోజు ఆగ్రా, మూడు రోజులు ఖజురహోలో చివరగా క్లైమేక్సు కోసమనో, లేక అంతర్జాతీయ రంగు పులమడానికో కాఠ్మండూ (నేపాల్)లో నాలుగు రోజులు. తాజా దంపతుల లాంటి పాలల్లో చకచకా కరిగిపోయే పంచదారలా కమ్మని ప్రదేశాలు. 'హనీమూన్' నిర్వచనం కొత్త నగిషీలని చెక్కుకుని వస్తుందేమో?

హనీమూన్ అయ్యాక అందరూ కలసి షిర్డీ ప్రయాణం. రెండు కుటుంబాల

వారూ మొక్కు తీర్చుకోడానికి వెళతారు.

ఏప్రిల్ నెల. దిల్లీ ఎప్పటిలా వేడిగా లేదు. ఈసారి వేసవి ఆలస్యంగా వస్తుందని వాతావరణశాఖ జోస్యం. చలికాలపు నడవడికపై ఎండాకాలపు ప్రవర్తన ఆధారపడి ఉంటుంది. దిల్లీ ప్రజలైతే ఎండాకాలం ఎంత ఆలస్యమైతే అంత మంచిదని సంబరపడుతున్నారు.

పెద్దలు నిర్ణయించిన పెళ్లి, లావాదేవీలు, ఇచ్చిపుచ్చుకోడాలు అన్నీ బాగానే జరిగాయి. రెండు కుటుంబాల బ్యాలెన్సు షీట్లు బలంగా ఆరోగ్యంగా ఉన్నాయి. ఢోకాల్లేని జీవితాలు! 'అందమె ఆనందం! ఆనందమె జీవిత మకరందం!'లా సాగుతున్న కుటుంబాలవి!

కిరణ్ బీటెక్కు! ఎంత సంపాదించినా నెల జీతంతోనే జీవితం. ఐదంకెలు.. కొన్నేళ్ల తరువాత ఆరంకెలు! అంకెల సంఖ్య పెరగాలంటే బిజినెస్సే గమ్యం అన్న ఆలోచన బాగా లోతుగా పాతుకుపోయింది. ర్యాంకు తక్కువ రావడంతో సివిల్ ఇంజనీరింగ్ చేసి పేరున్న కన్‌స్ట్రక్షన్ కంపెనీలో ఉద్యోగం అనడం కంటే.. పనితీరులని, వ్యాపార మెలకువలని బాగా జీర్ణించుకోడానికి చేరాడు. 'కొడితే పులినే కొట్టాలిరా' అన్నట్టు గొప్ప పేరున్న కంపెనీలో అరంగేట్రం చేశాడు. వీలైనంత త్వరలో వ్యాపార కళని బాగా అలవర్చుకుని, నైపుణ్యాన్ని సంపాదించి తానూ ఒక కంపెనీ పెట్టాలని ఆశయం.

ప్రభ సీఏ అని తెలిసినపుడు కిరణ్ సంతోషంతో గెంతేశాడు.. తనకు వ్యాపారంలో చాలా కలిసొస్తుందని! ఇంటి మనిషి చేతిలో ఫైనాన్స్ బాధ్యతలు ఉంటే కంపెనీకి ఎంతో బలం! ఇద్దరి కలయిక భలే! భలే!! అనుకున్నాడు. నిర్మాణరంగంపై అర్జునుడిలా ఫోకస్ చేసి విజయాలను అందుకున్నవారిలో 'యంగ్ బిజినెస్ మేన్'గా పేరు సంపాదించాలన్నది కిరణ్ ఆశయం. ప్రభ తన జీవిత భాగస్వామి కాబోతోందని తెలిసి భారతదేశ వ్యాపార చరిత్రలో ఒక కొత్త అధ్యాయం తెరవాలన్న కోరిక కూడా అప్పుడప్పుడూ ఆలోచనల్లోకి వచ్చేది.

ప్రభ అన్నయ్య, బాబాయిల కూతుర్లంతా దేశ సరిహద్దుల్ని దాటి అమెరికాలో స్థిరపడిపోయిన తెలుగువారి సంఖ్యను పెంచారు. వాళ్ల రాకపోకలతో అక్కడి జీవన విధానం, ముచ్చట్లు, ముద్దుమురిపాలు, ఆప్యాయతలు చూసి, విని తన ఆశలకి రెక్కలు వచ్చేవి. అబ్బాయి బీటెక్ అనగానే ప్రభకి అమెరికాకి సగం దూరం ప్రయాణం చేసినట్లు ఒళ్లంతా పులకరించింది. తన సీఏని కూడా జోడించి ఇద్దరూ పోటీపడి బాగా సంపాదించుకోవచ్చని ఊహల మేఘాల్లో తేలిపోయింది.

కిరణ్ లక్ష్యం తెలిసి ఆమె కూడా అదే బెటరని, తన ఊహలకు స్వస్తి పలికింది.

తెలుగువారిలో బాగా పాకిపోయిన అమెరికా వైరస్ వీరిద్దరికీ అంటుకోనందుకు పెద్దలూ సంతోషించారు.

హైదరాబాద్‌లోనే ఉండడం ఎంత మంచి ఆలోచన అన్నారు.. హర్షించారు! ఈ రోజుల్లో పిల్లలు కళ్లముందు ఉండడం అదృష్టం అని ఆనందపడ్డారు. ఇండియాలో కూడా ఇప్పుడు బాగా సంపాదిస్తున్నారని సమాధానపడ్డారు. ఇద్దరి పేర్లలో 'సాయి' ఉండడం.. వాళ్లు దంపతులు కావడం అంతా షిర్డీసాయి మహిమే అన్నారు. వారిద్దరూ ఒకరి కోసం ఒకరు పుట్టారని సాయి ఆరాధకులు కిరణ్-ప్రభలని ఒక ఫ్రేమ్‌లో మరింత దగ్గరగా బంధించారు. ముందు.. వెనుక.. ఆలోచనలకి సంకెళ్లు పడ్డాయి.

★ ★ ★

దిల్లీలోని ఎయిర్‌పోర్ట్ టర్మినల్-3లో జెట్ ఫ్లైట్ దిగారు. ఒక కొత్త లోకంలోకి ఇద్దరి పాదాలు మెదటిసారిగా ముద్రలు

వేశాయి. భారతదేశం గర్వపడే ఎయిర్ పోర్ట్! అంతర్జాతీయ ప్రయాణికులు సైతం ఆశ్చర్యపోతూ మెచ్చుకునే ఆధునిక నిర్మాణం! అడుగడుగునా ఆకర్షించే అమరికలు, కళా సౌందర్యాలు, సువిశాల ప్రాంగణాలు, ప్రయాణికులకు సౌకర్యాలు, సజావుగా సాగే పద్ధతులు! పరిసరాలను గమనించుకుంటూ లగేజి బెల్టు దగ్గరకు చేరుకున్నారు. కదిలే పట్టాలపై కదలకుండా వస్తున్న లగేజి టక్కున అందుకుని ట్రాలీని తోసుకుంటూ ఇద్దరూ బయటకు నడిచారు.

మధ్యలో జి.ఎం.ఆర్. అక్షరాలు కనిపించాయి. ట్రాలీతో యాంత్రికంగా ముందుకు కదులుతున్న కిరణ్ తన దృష్టిని అయస్కాంతంలా లాక్కున్న మూడక్షరాల నుండి మరల్చుకోలేకపోతున్నాడు. ఆ పేరు ఎక్కడ కనబడ్డా కిరణ్ ఎంతో ప్రేరణ, చైతన్యం పొందుతాడు. తానూ ఒకరోజు ఆ స్థాయికి చేరుకోవాలనుకున్న జీవితాశయాన్ని మనసులో స్మరించుకుంటాడు. హైదరాబాద్ ఎయిర్‌పోర్టులో ప్రభతో అదే విషయం ప్రస్తావించాడు. అక్కడ కూడా అవే మూడక్షరాలను ముచ్చటపడుతూ చూసి తన మనసులో ఉన్న మాటని మొదటిసారిగా ప్రభతో పంచుకున్నాడు. ఈ ఆశయాన్ని సాధించడంలో ఆమె సహకారాన్ని కోరాడు. ప్రభ ప్రశంసాపూర్వకంగా చూసింది. చేతిని పట్టుకుని అంగీకారపూర్వకంగా నొక్కింది. బలహీనంగా ఉన్న ఒకటి సంఖ్య పక్కన మరో ఒకటి చేరింది. రెండు ఒకట్లు పక్కపక్కనే- పదకొండు. ఇద్దరూ సంతోషంతో నవ్వుకున్నారు. జీవిత గమ్యానికి అంకురార్పణ హైదరాబాద్ ఎయిర్‌పోర్టులో జరిగింది. సాక్షులు ఇంగ్లీషులో ఉన్న ఆ మూడక్షరాలు!

క్షణమాగి వరుసలో పట్టుకుని ఉన్న ప్లకార్డ్‌ల వైపు దృష్టిని సారించాడో? లేదో? సాయికిరణ్ పేరు స్పష్టంగా కనిపించింది.

హోటల్ గ్రౌండ్ స్టాఫ్ ప్రాథమిక మర్యాదలు చేసి కార్లో కూర్చోబెట్టి కిరణ్-ప్రభలను ఢిల్లీ ఎయిర్‌పోర్ట్ నుండి ప్రయాణం చేయించారు.

దక్షిణ భారతదేశంలోని పట్టణాలు బెంగళూరు, చెన్నై, వైజాగ్ తిరిగారు కానీ ఢిల్లీ రావడం ఇద్దరికీ ఇదే మొదటిసారి. స్టూడెంట్స్‌గా కూడా ఎప్పుడూ ఇంద్రప్రస్థకి రాలేదు వారు!

★ ★ ★

కొత్తలోకం! రోజుకి వెయ్యికిపైగా కొత్త కార్లని తన రోడ్డుపై చేర్చుకుని తనపైనే తిప్పుకొనే ఢిల్లీ. విశాలమైన రోడ్లపై హోటల్ కారు చక్కని క్రమశిక్షణతో, నాజుగ్గా దూసుకుపోతోంది. మరొకవైపు 'ఏర్ ఎక్స్‌ప్రెస్' మెట్రోరైలు ప్రయాణికులని దర్జాగా మోసుకుపోతోంది. 'ధౌలకువా' వచ్చేసరికల్లా రెండు లెవెల్స్‌లో నిర్మించిన మెట్రోరైల్ వంతెనలని చూసి అబ్బురపడిపోతున్నారు. రైల్‌పట్టాల ఫ్లై ఓవర్లు ఒకదానికొకటి లంబంగా పోతాయి. అదే మామూలు ప్రజలకి వింత! ఇంజనీర్లకి సవాలుగా నిలిచిన ఈ ప్రాజెక్టుని చక్కగా చేసి చూపి, మెట్రోరైల్ కార్పొరేషన్ తన మకుటంలో మరో వజ్రాన్ని చేర్చుకుంది.

విఐపీల కదలికలతో ట్రాఫిక్ కాస్సేపు స్తంభించిపోయింది. పోలీసులు రోడ్డుకి అడ్డంగా పట్టుకున్న లావు తాడు నేలపై విశ్రాంతి తీసుకుంటోంది. పోలీసులు పొజిషన్ తీసుకున్నారు. వాకీటాకీలు నోటి ముందుకు చేరాయి. హుకుం సంభాషణల ఉరుకులు.. పరుగులు. పెదిమల కదలికలు రకరకాల వాహనాలని నడిపిస్తాయి.. పరిగెత్తిస్తాయి. పకడ్బందీలోనూ పెడతాయి. హనుమంతుని తోకని తలపించేలా లావుతాడు సుమారుగా మూడ

డుగులు భూమిపైనుండి బుసకొడుతూ లేచింది. వాహనాల టైర్లన్నీ నేలను ముద్దా డుతున్నాయి- లిప్‌లాక్ ముద్రల్లో! మూడు లక్షల మారుతీ కారు, ముప్ఫైలక్షల పైనే ఉన్న బి.ఎం.డబ్ల్యూ. పక్కపక్కనే ఆగాయి. 'ఎర్‌పోర్ట్ ఎక్స్‌ప్రెస్ మెట్రోరైలు మాత్రం తనకేం పట్టనట్టుగా కార్లని ఎద్దేవా చేస్తూ దూసుకుపోతోంది.

కారు ఇంపీరియల్ హోటల్ పోర్టికోలో వయ్యారంగా ఆగింది.

కిరణ్-ప్రభలు అద్భుత లోకంలోకి అడు గులు వేశారు. ఎటుచూసినా రాజసమే! త మకింత విలువైన 'గిఫ్ట్' నిచ్చిన అందరినీ ఇద్దరూ మనసులో తలచుకున్నారు. నాలుగు రోజులు ఈ భవనంలో రాజు-రాణీలు. మూడు రాత్రులు రతీ-మన్మ థులు. ఒకరోజు ప్రేమాభ్యాసానికి ఆగ్రా. అక్కడే ఓనమాలు దిద్దాలి. మిగతా రోజులు లోకల్ సైట్ సీయింగ్, షాపింగ్. రెండు అధ్యాయాలయ్యాక, మూ డో అధ్యాయానికి ఖజురహో. ఆ తరువాత కాఠ్‌మండూ. నాలుగు అధ్యాయాలతో నాలుగు కాలాలపాటు జీవించే పునాదు లని వేసుకుని తిరిగి - ఛలో హైద్రాబాద్!

దిల్లీ... దిల్ వాలోంకా అని సగర్వంగా చెప్పుకుంటారు. కోటీ డెబ్భై లక్షల జనా భాతో మినీ ఇండియాకి ఆదర్శ ప్రతీక. అన్ని రాష్ట్రాల ప్రజలు, రకరకాల బతుకు తెరువులకి పరుగెత్తుకుంటూ వస్తుంటారు. ఇరుకు గదుల్లో, అసౌకర్యాలని పంచు కుంటూ సివిల్ పరీక్షల కోసం అష్టకష్టాలు పడి విజయాలని చేజిక్కించుకుంటూ, కీలక పదవులని కైవసం చేసుకుంటూ దేశాన్ని ముందుకు తీసుకుపోయే అధికా రుల పుట్టిల్లు. మరోవైపు నిరక్షరాస్యులైన వారు కండల్ని కరిగించుకుంటూ పేదరా

ష్టాల నుండి వలస టోపీలతో వచ్చి కాలి దార్ల పట్టీలపై బతికేవారికి ఎండా-నీడల నిచ్చే దిల్లీ.. నిజంగానే దిల్ వాలోంకా హై దిల్లీ!

అంగరక్షకుల తుపాకుల బుల్లెట్లకి ప్రధానమంత్రి కుప్పకూలింది దిల్లీలోనే!

'నిర్భయ' కేసుతో దేశాన్ని కుదిపి అందరిలో భయాన్ని నింపింది కూడా దిల్లీయే!

★ ★ ★

"ఏరా? హోటల్‌కి చేరుకున్నారా?" ఆతురతతో ఆడగొంతు.

"ఐదు నిమిషాలయ్యిందక్కా రూంలోకి అడుగుపెట్టి"

"హోటల్ వాళ్ళు ఏర్ పోర్ట్‌లో రిసీవ్ చేసుకున్నారు కదా? ఇబ్బందేమీ కాలేదు కదా?" మగ గొంతు.

"చాలా థాంక్స్ బావగారు! అన్నీ సవ్యంగా జరిగాయి. నో ప్రాబ్లమ్! హోటల్ సూపర్‌గా ఉంది బావగారు"

ఆ వైపు హైద్రాబాద్‌లో అందరూ కిరణ్ మాటల్ని స్పీకర్లో వింటున్నారు.

"మా ఆఫీసు నాకెప్పుడూ ఇంపీరియల్ హోటల్లోనే బుక్ చేస్తుంది. ఎక్సలెంట్ హోటల్! దిల్లీలో గొప్ప పేరున్న హోటలది. అందుకే ప్రత్యేకంగా దీన్ని మీ కోసం సెలక్ట్ చేశాం. ఫుడ్ కూడా బాగుంటుంది. జన్‌పత్, కన్నాట్ ప్లేస్‌లకి దగ్గర. సాయంత్రం హాయిగా తిరగొచ్చు. సెంట్రల్ పార్క్‌కి వెళ్ళడం మరవొద్దు. దిల్లీ సాయంత్రపు అందాలని చూడవచ్చు"

"ప్రభకి ఓసారి ఫోనివ్వరా" ఆడగొంతు ఆప్యాయతతో!

కిరణ్ ఫోన్ అందించి వాష్ రూమ్ వైపు పరుగెత్తాడు. గదిలోకి ప్రవేశించగానే వెళ్లాలనుకున్నాడు. ఫోన్ ప్రభ చేతిలో పెట్టి 'హమ్మయ్య!' అనుకున్నాడు.

"ప్రయాణం ఎలా జరిగిందే?"

"ఫ్లైట్ కరెక్ట్ టైమ్‌కి చేరింది. దిల్లీలో దిగాక హోటల్‌కి పోతున్నపుడు సీఎం కాన్వాయ్ కదలికలు ఉంటే ట్రాఫిక్‌ని ఆపారు. హోటల్ సూపర్‌గా ఉందక్కా! ఫ్లైట్లో లంచ్ ఇచ్చారు. ఫ్రెష్ అయ్యాక బయటపడతాం"

"ఈ రోజు ఏం వెళతారే! హాయిగా రూంలోనే ఎంజాయ్ చెయ్యండి" చిలిపి ఉచిత సలహా! హాల్లో కొందరి నవ్వులు వినిపించాయి. ప్రభ సిగ్గుపడింది. చిరునవ్వొకటి గదిలో శ్రీకారం చుట్టింది.

"ప్రభా! భాభా కరక్ సింగ్ రోడ్డులోని ఎంపోరియాలకి వెళ్ళడం మరవకండి. నేను చెప్పినట్టుగా కిరణ్‌తో చీరల్ని కొనిపించు. ఏం చెప్పినా వింటాడే ఇపుడు! టైమ్‌ని కాపిటలైజ్ చేసుకో!" ఎంబిఏ చేసిన మరో ఆడగొంతు.

"కిరణ్! ఏర్‌పోర్ట్ ఎక్స్‌ప్రెస్ మెట్రో ప్రయాణాన్ని మరువకేం!"

"ఫ్రెష్ అవుతున్నాడు" ప్రభ జవాబు.

"మిమ్మల్నిక విసిగించంలే! విషింగ్ ఏ వెరీ హాపీ హనీమూన్!" ఒక్కసారే కోరస్! స్వరాల మూటలో ఆప్యాయతలు, చిలిపితనాలు, పోకిరి శబ్దాలు, అల్లరి కేకలు!

వాష్‌రూమ్ నుండి హాయిగా బయటికి వచ్చాడు కిరణ్. "ఎవరెవరు మాట్లాడారు?" కిరణ్ ఉత్సాహంతో.

వరసగా చెప్పింది. "అందరూ తమ అనుభవాలకొద్దీ ఉచిత సలహాలిచ్చారు"

"అంటే.. ఎలాంటి సలహాలు?"

"ఒకరు సైట్ సీయింగ్ వెళ్లండని, ఇంకొకరు షాపింగ్, ఏర్‌పోర్టు, మెట్రో ప్రయాణమని మరొకరు! ఎక్కడికీ వెళ్లకుండా హాయిగా రూంలోనే ఎంజాయ్ చేయండని ఇంకొకరు" చివరి మాటల్ని చెబుతున్నపుడు ప్రభలో చిలిపితనం.. కళ్లల్లో కొంటె వెలుగులూనూ!

"నీకే సలహా నచ్చింది?" ప్రభని దగ్గరగా హత్తుకొంటూ.

"ముందు నువ్వు చెప్పు!" కళ్లలోకి ఘాటుగా చూస్తూ!

"ఈ సలహాలన్నిటినీ ప్రత్యక్షంగా విన్నావు. నువ్వే చెప్పాలి" పెదిమలపై పెదిమలు చేరాయి. కళ్ళు మూసుకున్నాయి.

"దిల్లీలో తొలి రాత్రి మనకి! ఈ రోజు నువ్వు కోరిన ప్రకారంగానే నువ్వే చెప్పు!"

"బయటికెళితే డబ్బు ఖర్చు. నీతో ఐదు చీరలు కొనిపించాలి. ఇంత ఖరీదైన హోటల్ని 'మాక్జిమైజ్' చేయాలనుకొంటే, మనం ఎటూ వెళ్ళొద్దు!" ప్రభ ప్రతిభని వొలకబోసింది.

"అంటే చివరి ఉచిత సలహా అన్న మాట. ఎవరిచ్చారీ సలహాని? "

"......." పేరు చెప్పింది ప్రభ.

"నేననుకున్నాను.. ఈ సలహా తప్పక అక్కడి నుండే వచ్చి ఉంటుందని!"

బెడ్డుపై ముస్తాబుగా పరిచిన కవర్ని తోసేసి మాట్రెస్ నుండి విడాకులిచ్చారు. కిరణ్-ప్రభలిద్దరూ ఏకమయ్యారు. ఆ రోజు రాత్రి ఇద్దరికీ మధ్యాహ్నం రెండు గంటలకే మొదలయ్యింది! తలుపు ముందర 'డోంట్ డిస్టర్బ్' అక్షరాలు తమ విధిని సంతోషంగా నిర్వహిస్తున్నాయి.

ఇంపీరియల్ హోటల్ దిల్లీలోని ఉన్నతస్థాయి హోటళ్ల వరసలో ఉంటూ మిగతా వాటితో పోటీపడుతోంది. బ్రిటీష్ కాలంలో రూపం పోసుకొని నవీనతని సమీకరించుకుంటూ దిల్లీ సంస్కృతితో మమేకమైపోయింది. ఆతిథ్యంలో అద్భుతమైన పేరుంది. దాన్ని పదిలంగా కాపాడుకుంటూ పోటీ మార్కెట్లో పరిగెడుతూనే ఉంది. ఒకసారి వచ్చి ఉన్నవారు మళ్ళీ మళ్ళీ రావడానికి ఇష్టపడతారు. నలుగురికీ గట్టిగా రికమెండ్ చేస్తారు.

★ ★ ★

మరునాటి ఉదయం. స్విచాఫ్ చేసిన సెల్‌లో జీవం తెచ్చింది ప్రభ. తొమ్మిదిన్నర! అంకెలు ప్రకాశవంతంగా కనబడుతున్నాయి. నాలుగు మిస్డ్ కాల్స్. అందులో ఒకటి దగ్గరి స్నేహితురాలి నుంచి. కిరణ్ ఇంకా నిద్రలోనే ఉన్నాడు!

> **కొత్తగాలి...**
>
> **నాన్నా!**
> **ఈ రోజు నా పుట్టినరోజు**
> **తాతయ్య ఆశీర్వాదానికి**
> **వృద్ధాశ్రమానికి**
> **ఒక్కసారి తీసుకెళ్లవూ!**
>
> – కె.వి. లక్ష్మణరావు,
> మానేపల్లి, తూ.గో. జిల్లా

దినచర్యని స్నేహితురాలితో ఆరంభిద్దామని కనెక్ట్ చేసింది.

"ప్రభా! ఎలా అయ్యిందే దిల్లీలో మొదటిరాత్రి ? " కొంటె నవ్వుతో రజిత.

"ఇంకా లేవలేదే! ఇపుడే మెలకువ వస్తే, సెల్ ఆన్ చేశా. నీ కాల్ చూసి చేస్తున్నా. అయినా పెళ్లికానిదానివి. ఈ వివరాలు నువ్వడగకూడదు, నే చెప్పకూడదు!"

సంభాషణల శబ్దానికి కిరణ్ కదిలాడు. ప్రభ తలని తన ఛాతిపైకి నెమ్మదిగా జరుపుకొని, వేళ్ళతో ఆమె శరీరంపై నాట్యం చేయిస్తున్నాడు.

"అయినా అంత తొందరేంటో! అక్టోబర్లో నీకు అమెరికా మొగుడొస్తాడు. నీకన్నీ అపుడు తెలుస్తాయిగా! తెలియకపోతే ఉచితంగా సలహాలిస్తానులే! నన్ను హనీమూన్ నుండి హైద్రాబాద్ రానీయ్!"

"నీకంటే నేను రెండడుగులు ముందే సుమా! నీది కుదిర్చిన వివాహమైతే, మాది ప్రేమ వివాహం. నీకు తెలుసుగా!" రజిత కొంచెం గర్వంగా.

కిరణ్ చేతివేళ్ళు నాట్యగతిని పెంచాయి. ప్రభలో వింత శబ్దాలు. శరీరంలో చిరుకదలికలు. చరవాణి చెవులు శబ్దాల్ని సున్నితంగా పట్టుకొని రజిత చెవిలోకి వెంటనే చేర్చాయి.

రజిత నవ్వుకుంది.

## కొత్తగాలి...

**అప్పుడు అమెరికా**
**కలల ప్రపంచం**
**ఇప్పుడు అమెరికా**
**కల్లోల ప్రపంచం**

– తటవర్తి రామకృష్ణ,
తాళ్లగడ్డ, హైదరాబాద్

అర్థమైంది గదిలోని వాతావరణం! డిస్కనెక్ట్ చేస్తేనే మంచిదనుకుంది.

"సారీ ప్రభా! నేను బయటికి వెళ్ళాలి. తీరిగ్గా ఉన్నపుడు నువ్వే మళ్ళీ ఫోన్ చెయ్యవే! ఎంజాయ్!"

"తీరిక ఉండదేమోనే! ఈ రోజు లోకల్ సైట్ సీయింగ్ ఉంది. ఎప్పుడు తిరిగొస్తామో తెలియదు. హైద్రాబాద్ వచ్చాకే మనం కలుద్దాం. అపుడు 'అన్ని విషయాలు' వివరంగా చెబుతాను" 'అన్ని విషయాలు' అనే రెండు పదాలని నొక్కి పలికి ఇంటర్వెల్ తరువాతి సినిమాలా ఉత్కంఠని నింపింది.

"హేవ్ ఏ గ్రేట్ డే!"

"సీయూ ఇన్ హైద్రాబాద్" సెల్‌ని నిద్రలోకి పంపి, నిద్రలోనే ఉన్న కిరణ్ సెల్ పైన పెట్టింది.

కిరణ్ ఒకవైపు మాటల్ని కళ్లుమూసుకొని విన్నాడు. నవ్వుకున్నాడు.

"అన్ని విషయాలు - రెండు పదాలని నొక్కి పలికావు. నిజంగానే చెబుతావా? "

"బ్యాడ్ బాయ్! మా మాటల్ని విన్నావా? నిన్నూ.." తుంటరి కోపాన్ని ప్రదర్శిస్తూ ప్రభ.

"నిన్నూ.. అని ఆగావేంటి? మాటల్ని పూరించు.." శరీరాన్ని నిమురుతూ కిరణ్.

"నువ్వే ఫిలప్ చేసుకో!"

"నిజంగానా? నేనేదంటే అవే మాటల్ని చెబుతావా? మాట తప్పావో, నెల తప్పేట్టు చేస్తాను.. కాచుకో!" కొంటెగా, ఛాలెంజిగా, సరసంగా, మోటుగా..!

"అలాంటి ఆశలు పెట్టుకోకు. నిన్ను తండ్రిగా అంత తొందరగా ప్రమోట్ చెయ్యను. ఒకరినొకరం బాగా అర్థం చేసుకుందాం. ఆకాశమంత ప్రేమించుకుందాం. కొన్నేళ్ళవరకు మనం ఒకరికొకరికి హండ్రెడ్ పర్సెంట్ ప్రేమనిచ్చుకుందాం. ఇచ్చి పుచ్చుకునేదాకా మనకి తల్లిదండ్రుల ప్రమోషన్ వద్దు. అప్పుడు మనిద్దరి ప్రేమని కలిపి మన బేబీకి టూ హండ్రెడ్ పర్సెంట్ ఇద్దాం.." కిరణ్ వేళ్ళతో ఆడుకుంటూ ముద్దుముద్దుగా ప్రభ అంది.

మళ్ళీ తనే, పూర్తికాని మాటల పొట్లాన్ని మరింత విప్పింది.

"నీ ప్రేమకి నే పూర్తి స్వార్థపరురాలిగా ఉంటా! అది ప్రతిరోజుకి గుణకారం చేసుకుంటూ పోవాలి. భాగహారం అప్పుడే వద్దు సుమీ" గువ్వలా ఒదిగిపోతూ అంది.

కిరణ్ మరింత దగ్గరిగా హత్తుకున్నాడు.

"ఏంటి? లెక్కల భాషలో మాట్లాడుతున్నావ్..!" కిరణ్.

"గుడ్! చక్కగా అర్థం చేసుకున్నావ్ ఇంజనీర్ గారూ! ఇంతకీ మన ప్రోగ్రాం ఏంటి? ఢిల్లీని చుట్టేసి రావద్దూ? లేలే!"

ప్రభ తటాలున లేవబోతుంటే కిరణ్ దగ్గరికి లాక్కున్నాడు.

"నిన్న నువ్వు చెప్పిన ప్రకారం, డ్రైవర్ ఈపాటికే వచ్చి ఉంటాడు. సెల్ స్విచ్ ఆఫ్ చేసి పెట్టావ్. మీ అక్కయ్యేమో టీచరులా హాజరు తీసుకోవడమే కాదు, ఏవేవి చూశామని గుచ్చి గుచ్చి అడుగుతుంది. సాయంత్రం ఆవిడ నుండి ఫోనొస్తుంది. సో, మై డియర్! లెట్ అజ్ గో!"

"యు ఆర్ రైట్! సెల్‌ని మొదట ఆన్ చేయనీ. మా అక్కయ్య నుండి ఫోన్ రాకుండా చెయ్యనా? " ఇదేమంత పెద్ద పని కాదన్నట్టుగా కిరణ్ సవాలు.

"అదెలా? "

"మనం చూసిన ప్రతి సైట్ నుండి సెల్ఫీలని వెంటనే పంపిద్దాం"

"నువ్వు ఇవన్నీ చేసినా, ఆవిడ ఫోన్ చేస్తుంది. అది నీకే వస్తుంది చూడు!"

"ఛాలెంజీనా? "

"ఐ ఏక్సెప్ట్ ద ఛాలెంజ్. ఓడిన వారు ఏమిచ్చుకోవాలి? "

"ఎవ్వరోడిపోయినా బిగికౌగిలి ఇవ్వాలి"

"...అంతేనా? " అని బెడ్డుపై నుండి రివ్వున ఎగిరింది ప్రభ.

కిరణ్ లేవక తప్పలేదు.

★ ★ ★

పదకొండున్నరకల్లా కార్లో కూచున్నారు. కిరణ్ షర్ట్ పాకెట్లోంచి ఓ కాగితాన్ని తీసి, చూడాల్సిన ప్రదేశాల లిస్ట్ చదివాడు. వచ్చీ రాని హిందీకి, హైద్రాబాదీ ఉర్దూని మిళితం చేసి, డ్రైవర్ వేషాన్ని చూసి యాభై శాతం ఇంగ్లీష్‌లోనూ చెప్పాడు. ఎక్కడ డ్రైవర్ తనని తక్కువ అంచనా వేస్తాడోనని ఈగో!

'ఒరేయ్! పెద్ద లిస్ట్ పెట్టుకొని ప్రదేశాలని హడావుడిగా చూడకురా! ఐదారు సైట్లని సెలక్ట్ చేసుకొని, తీరిగ్గా, ఓపిగ్గా చూసి ఎంజాయ్ చెయ్యండిరా! ఆంధ్రాభవన్ కాంటీన్‌లో భోజనం చేయడం మరువద్దు. ఎంత టైట్ ప్రోగ్రాం ఉన్నా, దిల్లీ మెట్రో వాళ్ళ ఏర్ పోర్ట్ ఎక్స్‌ప్రెస్‌లో ప్రయాణం మస్ట్! పిల్లల్లా అటూ- ఇటూ హాయిగా తిరిగి రండ్రా! అందమైన అనుభవంరా అది..' కిరణ్ దగ్గరి స్నేహితుడు మనసారా ఇచ్చిన సలహా!

ఆర్నెల్ల క్రితం తేనెకంటే తియ్యగా చేసుకున్న తన హనీమూన్ అనుభవాన్ని పంచుకున్నాడు. వాడి మాటలు గుర్తొచ్చి తనలో తాను నవ్వుకొన్నాడు కిరణ్.

ఇద్దరికీ 'కొత్తదిల్లీ' కొత్తే! కారు దూసుకుపోతోంటే ఆసక్తిగా దిల్లీ అందాలని తెంపుకుంటున్నారు. ముందు నుండి, పక్కల నుండి.. రెప్పలని వాల్చకుండా! ఇద్దరూ సాయంత్రం ఈ అందాలని ముచ్చట్ల మాలలా అల్లి మరింత ఆనందించాలిగా!

జంతర్‌మంతర్ చూశాక, ఇండియా గేట్ పరిసరాలకి చేరింది కారు. సెల్లులో బక్కపల్చని సమాచారాలు మొదలయ్యాయి. జంతర్‌మంతర్ బ్యాక్ గ్రౌండ్‌తో అప్పటికే ఆ రోజుటి మొదటి ఫొటో రిలీజ్ అయ్యింది.

చంద్రయాన్ పంపిన చంద్రుని ఫొటోల్ని చూసినప్పటి హడావుడి! చిన్న వాక్యాలైతేనేం! పొడి పదాలైతేనేం!! అందరి ఆప్యాయత, ప్రేమని తెలుపుతున్న ఎస్సెమెస్సులని చూసి మురిసిపోతున్నారు. కడుపు నింపే కామెంటరీ. ముచ్చట పడుతున్నారు. గుడ్ బిగినింగ్ ఫర్ ఏ వండర్ ఫుల్ కపుల్‌ని చూసి నవ్వుకొని, ఇండియా గేటు వైపు కదిలారు. కిరణ్ సీరియస్‌గా ఫోజు పెట్టి తల పైకెత్తి, ఇండియా గేటుపై చెక్కిన పేర్లని, స్పష్టంగా కనబడకున్నా, మెల్లగా చదువుతున్నాడు. ప్రభ కిరణ్ పక్కనచేరి చేతిని పట్టుకుంది. ఇంత శ్రద్ధగా గేటుపై ఏం చూస్తున్నాడబ్బా అనుకొని కుతూహలంగా తానూ తలని పైకెత్తి చూస్తోంది.

కిరణ్ గ్రహించాడు.

"చూడు ప్రభా! కనబడుతోందా? అక్కడ! మా తాతయ్య పేరు..! రా..మ.. లిం..గే..శ్వ..ర్. పిల్లలు నెమ్మదిగా కొత్త పదాలని నేర్చుకుంటూ పలుకుతున్నట్టుగా పేరుని సాగదీస్తూ పలికాడు.

"చూశావా? ఎన్నో సంవత్సరాల నుండి అనుకుంటున్నాను. మా తాతగారి పేరుని తప్పక చూడాలని. దిల్లీ వచ్చినప్పుడు ఈ గేటు దగ్గరికి వచ్చి వెతకాలని! అమ్మయ్య! ఈ రోజుకి నీ సమక్షంలో.. నా చిరకాల కోరిక నెరవేరింది"

మర్మం అర్థం కావడానికి ప్రభకి ఎక్కువ సమయం పట్టలేదు. కిరణ్ పోకిరి

చేష్టలు మెల్లగా ఆమెలో ఇంకుతున్నాయి.

"ఎక్కడ..? ఎక్కడుంది పేరు? " ఉత్సాహాన్ని ప్రదర్శిస్తూ..

"అక్కడ..! అక్కడ చూడు! రామలింగేశ్వర్.. కర్తార్‌సింగ్ అనే పేరు పక్కనే!" ప్రభ చేతిని పట్టుకొని గేటు పై వైపుకి ఎక్కుపెట్టి అటూ ఇటూ తిప్పి, "అక్కడ..! అక్కడ..!" అని చేతిని నిలిపాడు.

"ఎక్కడ..? ఎక్కడ..? నాకేమి కనబడ్డం లేదు..? " నటిస్తూ ప్రభ.

"బాగా చూడు!" కిరణ్.

"ఆ..ఆ..! కనబడుతోంది మీ తాత పేరు! రా..మ..లిం.గే..శ్వ..ర్" కిరణ్ చదివినట్టే చదివింది పేరుని.

"మీది ధైర్యసాహసాల వంశం!" తనలో తానే నవ్వుకుంటూ ప్రభ! కిరణ్ని వదిలి కుడివైపు నాలుగడుగులు వేసి ఇండియా గేటు మరో భుజం వైపు చూపుని సారించి, కళ్లని చిన్నగా చేసుకొని పైనున్న పేర్లని పరీక్షగా చూస్తున్నట్లు తన నటనా చాతుర్యాన్ని రంగరిస్తోంది.

"అక్కడెక్కడో మా తాతగారి పేరు కూడా ఉండాలి!" సీరియస్‌గా చూస్తూ కిరణ్ చెవులకి వినపడేట్టుగా పలికింది.

కిరణ్ చెవుల్లో ఈ మాటలు పడ్డా, విననట్టు నటిస్తూ తనకు మాత్రమే కనిపించే తన తాత పేరు వైపే చూస్తున్నాడు. 'మహా తెలివైన అమ్మాయే! స్మార్ట్ గర్ల్' మనస్సులో మెచ్చుకుంటూ కిరణ్.

"రామలింగేశ్వర్‌గారి మనవడా! ఇలారా!" మధ్య లయలో పిలిచింది.

'ఏదో తమాషా చేసేటట్టుగా ఉంది!' అని సువాసనలని గ్రహించి ప్రభ వైపు అడుగులేశాడు.

"మా తాతగారి పేరుని చూసే దర్శన భాగ్యం నీకు కలిగించడానికి పిలిచాను! అక్కడ.. పైన.. కార్నర్ పక్కనే.. మూడో లైను.. వెంకటస్వామి.. చదువు!"

"వే.. ద.. ప్ర..కా..ష్" మెల్లగా ఓ పేరుని చదువుతున్న నటనతో కిరణ్.

"అది వేదప్రకాష్ కాదు.. బాగా చూడు.. వెంకటస్వామి అని స్పష్టంగా ఉంటేనూ.."

రెండు పోకిరి శరీరాలు అరచేతులతో చరచుకున్నారు. కోహ్లీని మొదటి బంతిలోనే ఔట్ చేసిన బౌలర్ దగ్గరికి పరిగెత్తే తోటి ఆటగాళ్లలా సంబరంగా ఉన్నారు. ఇద్దరూ బాగా నవ్వుకున్నారు.

వివిధ కోణాల్లో ఇండియా గేట్ బాక్‌గ్రౌండ్‌తో మూడు సెల్ఫీలు క్లిక్కుమన్నాయి. మధుర ఘడియలు డిజిటల్ రూపధారణ చేశాయి.

రెండునిమిషాల్లో ఫొటోలు ఆప్స్ బంధంతో చిక్కిన ఆప్త బృందానికి చేరాయి.

ఒకరి నడుంపై మరొకరు చేతుల్ని వేసుకొని గేట్ చుట్టూతా నెమ్మదిగా ప్రదక్షిణ చేసి చూశామనిపించారు. కదలకుండా శిల్పంలా ఉన్న జనాన్ని కన్నార్పకుండా చూశారు. పక్కనే కదులుతున్న జ్వాలని కొన్ని క్షణాలు గమనించారు. ప్రతి సంవత్సరం గణతంత్ర దినం రోజు చూపే ప్రత్యక్ష టీవీ ప్రసారంలో ఇండియాగేట్ ప్రాముఖ్యం ఇద్దరికీ గుర్తుకొచ్చింది.

డ్రైవర్ని పిలిచాడు. మరోచోటికి.. ఢిల్లీ అందాలని వీక్షించడానికి.

'ఒరే కిరణ్! పిల్లలు పుట్టాక వెళ్లినప్పుడు మన నాయకుల సమాధులని చూపుదువు కానీ మీ హనీమూన్‌లో మాత్రం వీటిని చేర్చకురా! అక్షరధామ్‌ని మాత్రం చూడండిరా! నేను రెండు అక్షరధామ్‌లని చూశాను. ఢిల్లీలోని అక్షరధామ్ అహ్మదాబాద్‌లో ఉన్నదానికన్నా ఎంతో బాగుంటుందిరా! మిస్ కాకు' అని నొక్కి చెప్పిన మిత్రుడి మాటలు గుర్తుకొచ్చాయి.

సరిగ్గా అదే సమయానికి అదే మిత్రుని నుండి సంక్షిప్తసమాచారం 'డోంట్ మిస్ అక్షరధామ్. హోప్ యువర్ హనీమూన్ ఈజ్ గోయింగ్ ఆన్ క్లౌడ్ నైన్!!!!!' సమా

చారం చివర్న పాతిన ఐదు ఆశ్చర్యార్థక సంకేతాలని చూసి నవ్వుకున్నాడు.

"థాంక్స్! వి ఆర్ క్లోజ్ టు అక్షరధామ్. హెచ్ఎం ఈజ్ గోయింగ్ గ్రేట్!!!!!!!!!!" మిత్రునికి తాను తక్కువేం కాదని సరదా కోసం ఆశ్చర్యార్థక సంకేతాలని రెండింతలు- పదిని గట్టిగా పాతాడు.

అర్థం చేసుకునేవారికి అందినంతా.. సంకేతాల్లోని అర్థాలు.

కిలోమీటరు దూరం నుండే అక్షరధామ్ కనబడుతూ దగ్గరయినకొద్దీ వామనుడు క్షణక్షణానికి ఎదిగినట్టుగా మహా కట్టడంగా అన్ని కొలతల్లో విస్తరిస్తూ అపురూపంగా.. శిల్పకళా చాతుర్యానికి సాక్షిగా నిలిచింది. ఆమ్ ఆద్మీ నుండి అమెరికా అధ్యక్షుడి వరకు దర్శించిన స్వామి నారాయణ్ భక్తుల ఆలయమది! అతి స్వల్పకాలంలో ఢిల్లీ పర్యాటకులు దర్శించే లిస్టులో స్థానాన్ని సంపాదించింది. మెట్రో ట్రైన్ సౌకర్యంతో చూసేవారిని తన ముంగిట్లోనే దించుకొని ప్రతిరోజూ వచ్చే దర్శకుల సంఖ్యని కంగారు జంతువు గంతుల్లా పెంచుకుంటూ పోతూనే ఉంది.

టెర్రరిజం ఆధునిక జీవితంలో అంతర్భాగమైంది. ఎపుడేమవుతుందో తెలియదు. ఆధునిక సాంకేతిక విజ్ఞానం తోడై టెర్రరిజంలో కూడా ఎన్నో కొత్తపోకడలు. వినూత్న రీతిలో విషాదాలు. క్షణాల్లో వందల మృతదేహాలు. కొన్ని అంతుచిక్కుతాయి. కొన్ని నామరూపాలు లేకుండా కాలంలో కలిసిపోతాయి. ఒక్క ఫోన్‌కాల్ బెదిరింపు. సెక్యూరిటీ వ్యవస్థని హై అలర్ట్‌తో అప్రమత్త కక్ష్యలోకి దించుతుంది. అసూయ కలిగించే ఈ అక్షరధామ్‌కి అలాంటి బెదింపులు వస్తుంటాయి.

పకడ్బందీ సెక్యూరిటీ తతంగం పూర్తిచేసుకొని అక్షరధామ్ ప్రాంగణంలోనికి ప్రవేశించారు. ఇద్దరి మొహాల్లో చిన్నపిల్లల ఉత్సాహం. కిరణ్ సివిల్ ఇంజినీరింగ్ నేపథ్యంతో నిర్మాణ సొగసులని గమనిస్తూ

> **కొత్తగాలి...**
>
> **గగనంలో ఘనవిజయం**
> **ఇస్రో దిగ్విజయం!**
> **విశ్వయవనికపై మహాద్భుతం**
> **సర్వశ్రేష్ఠం మహాభారతం!!**
>
> *- అంబటి వెంకట శివారెడ్డి,*
> *యర్రగుంట్ల, కడప జిల్లా*

ప్రభకి వివరిస్తున్నాడు. శిల్పకళా నైపుణ్యం, సున్నితమైన పనితనం, సూక్ష్మ వివరాల పట్ల శ్రద్ధ అన్నీ ఇద్దరినీ ముగ్ధుల్ని చేశాయి. కొత్తలోకంలో నాలుగు పాదాలు అడుగులు వేస్తున్నాయి. పెళ్ళిలో కలిసి వేసిన అడుగుల కంటే మెల్లగా పడుతున్నాయి. మ్యూజియంలోకి ప్రవేశిస్తూనే ఒక అద్భుతమైన శిల్పకళాఖండం శ్రీకారాన్ని చుట్టేస్తోంది. మసక వెలుతురుని అరువు తెచ్చుకొని మీద చల్లుకొని ఎంతో అందంగా కనబడుతోంది. ఇద్దరి దృష్టిని అయస్కాంతంలా ఒక్కసారే శిల్పం తన వైపు లాక్కుంది.

శిల్పంలోని మనిషి మొహం అందంగా, ప్రసన్నంగా ఉంది. చూసినకొద్దీ చూడాలన్న ఆకర్షణ శిల్పమంతా సంకీర్ణమై ఉంది. స్పష్టంగా కనబడే చేతులు. కుడి చేతిలో సుత్తి, ఎడమ చేతిలో ఉలి. మనిషి తల ఓ వైపు కొంచెం ఒరిగి తన చేతులతో తానే చెక్కుకుంటూ కింద శరీర భాగాల వైపు పురోగమిస్తున్న గొప్ప సందేశాన్ని ప్రపంచానికి అందిస్తోంది. జీవంలేని శిల నుండి జీవం ఉట్టిపడే మనిషి కేవలం మూడు ముఖ్య అంగాలతో 'నిన్ను నీవే మలచుకో! అది నీ చేతుల్లోనే ఉంది!' అన్నట్టు అక్షరాల్లో ఎలాంటి వివరణ ఇవ్వకున్నా మనసుల్లోకి దూసుకుపోయి స్థిరప

డిపోతోంది.. శిల్పమూ.. సందేశమూనూ!!

కిరణ్-ప్రభలు ఆ శిల్పం ముందు ఎంత సేపు నిల్చున్నారో!

"జీవితంలో ఎదిగి, ఆశయం వైపు అడుగులేస్తూ, పైకి రావాలనుకునే ప్రతి మనిషికి ఇదొక గొప్ప ప్రేరణ కదా కిరణ్! చూసినవారు తమదైన రీతిలో అర్థం చేసుకొని, ప్రేరితులై, తప్పక సందేశాన్ని నింపుకొని, ఇక్కడి నుండి కదులుతారు కదూ? " ప్రభ తబ్బిబ్బౌతూ!

కిరణ్ తదేకంగా చూస్తూనే ఉన్నాడు. ఇంకా మనస్సు నిండనట్టుంది. అప్పటికే చాలా సమయాన్ని గడిపారు. తన స్నేహితుడు మరీ అంతగా అక్షరధామ్‌ని చూడమని ఎందుకు చెప్పాడో అర్థమయ్యింది. అతనికి మనస్సులోనే కృతజ్ఞతలు తెలుపుకొని, రాత్రికి తప్పక మెయిల్ పంపాలి అని నిర్ణయించుకున్నాడు.

ఇద్దరి మనస్సుల్లో ఆ శిల్పం స్థాపితమయ్యింది. హనీమూన్ జంటగా వెంటనే అన్వయించుకున్నారు. ఇద్దరు ఒక్కటై తమ సంసార శిల్పాన్ని ఒక్కొక్కరు ఒక చేయిగా మారి ఎలా చెక్కుకోవాలో అన్న మూలసూత్రానికి విస్తరించుకున్నారు.

మ్యూజియం చూసి బయటకొచ్చేసరికి ఆకలి. ప్రాంగణంలోని కాంటీన్‌వైపు నాలుగు పాదాలు వడివడిగా అడుగులేశాయి.

ఎర్రరాతి కట్టడం వీడ్కోలు తీసుకొని కారు పాలరాతి కట్టడంవైపు పరుగు తీసింది. బహాయ్ బోధనలనుసరించే వారి ప్రార్థనామందిరం. వాడుక భాషలో అందరూ 'లోటస్ టెంపుల్' అని ముద్దుగా పిలుస్తారు. చేతుల్ని పెనవేసుకొని విశాలమైన ప్రాంగణంలోకి ప్రవేశించి ముందుకు సాగిపోతున్న కిరణ్-ప్రభ ఒక్కసారే ముందరి దృశ్యాన్ని చూసి కట్టేసినట్టుగా ఆగిపోయారు. ఏదో చమత్కారం! తెరతీయగానే కనబడ్డ వింత. 'తెల్లకలువ' అనే కంటే 'మహా తెల్లకలువ' అంటే సరిపోతుంది.

అలసిన కళ్ళకి అలరారే కలువ. సొలసిన కళ్ళకి పన్నీరుని చిలికే శ్వేతరెమ్మలు. ఆసక్తిగా చూసే కళ్ళకి పారిజాత పుష్పం!

నిశ్శబ్దం మాటల్ని పక్కకి తోసేసింది. ఇద్దరూ మౌనంగా నడుస్తున్నారు. రెండు జతల కళ్ళు పాలరాతి రెక్కలపైనే చూపు కేంద్రీకరించి ముందుకు జరుగుతున్నాయి.

కోట్లాది కళ్లజతలకి కోరుకున్నంతసేపు దర్శనమిచ్చే మందిరం. విగ్రహాలు లేని విచిత్ర మందిరం. మనసుల్లో నెలకొన్న దేవతలని నిశ్శబ్దాన్ని నిశ్శబ్దంగా ఉంచే వాతావరణంలో ఎంతసేపైనా కొలుచుకునే వసతులని కల్పించిన యాజమాన్యం!

అడుగులు ముందుకు పడుతున్నాయి. దగ్గరయ్యేకొద్దీ, కలువమొగ్గ కళ్ల దృశ్యం నుండి 'ఔట్ ఆఫ్ రేంజ్'. దర్శకులంతా నేలపై రాలిన పుప్పొడి రేణువుల్లా! కిరణ్ నిర్మాణశాస్త్రంతో తిలకిస్తూనే ఉన్నాడు. కొన్ని నిముషాలు ప్రభ ఉందన్న విషయమే మరచాడు. ప్రభ కూడా మంత్రముగ్ధురాలై తొమ్మిది రెక్కల్ని, పరిసరాలని పరీక్షిస్తూ అక్కడున్న వాలెంటీర్లతో మాట్లాడుతోంది. క్యూలో నిల్చొని వాలెంటీర్ల సూచనలని వింటూ కలువమొగ్గ కుహరంలోకి టూరిస్టులు అడుగుపెట్టారు. సూచనల ప్రకారంగా ఇష్టమైన బెంచీలపై కూచొని తోచిన రీతిలో ప్రార్థనలని నిశ్శబ్దంగా చేసుకోవాలి. ఎలాంటి తొక్కిసలాటలూ లేవు. తోపుడులు లేనేలేవు. 'నడవండి, నడవండి..' అంటూనే దేవుడి ముందే గుప్తంగా డబ్బులు తీసుకొని ఒక నిమిషం దర్శన సమయాన్ని కొనుక్కునే అపచారం లేదు. అర్చనల ఆచారం అసలే లేదు. అక్కడి నిశ్శబ్దాన్ని పరిశీలిస్తే, మానవ జాతియేనా? అన్న కించిత్ అనుమానమూ వస్తుంది. అంతటి నిశ్శబ్దాన్ని మనమే ఆచరిస్తాం! అదే క్రమశిక్షణని నిత్యజీవనానికి విస్తరించుకొని మన జీవితాలని ఎందుకు ఆనందమయం చేసుకోలే

కపోతున్నాం? ఎలాంటి విగ్రహం లేదు. తీర్థప్రసాదాలు, హారతులు కానరావు. లైను బ్రేకులు, వీఐపీ దర్శనాలు ఉండవు. కంచుగంటల నుండి జనించే చప్పుళ్ళు అక్కడి వాతావరణానికి శత్రువులు. అందరూ తమ కులదేవతలని, ఇష్టదేవతల్ని, పవిత్ర గ్రంథాలని మనోమందిరాల్లోకి తెచ్చుకొని ప్రార్థించుకుంటున్నారు.

గంభీర కుహరంలో ఒక చిన్న విశ్వమే కనబడుతోంది. స్వదేశీవిదేశీ పర్యాటకులు, ఎన్నో మతాల నుండి వచ్చినవారు, నమ్మకస్తులు, నాస్తికులునూ..

కిరణ్ మెల్లగా కళ్ళు తెరిచాడు. ప్రశాంతంగా ఉంది. తెలియకుండానే ఒక కొత్త లోకంలోకి వెళ్ళి వచ్చినట్లుగా ఉంది. మొహంలో కొత్త తేజస్సు, శక్తి ఎన్నోరెట్లు పెరిగినట్టుగా శరీరంలో ఒక భావన. ప్రభ వైపు చూశాడు. ఇంకా కళ్ళు మూసుకునే ఉంది. డిస్టర్బ్ చేయలేదు. కుహరంలో అటూ, ఇటూ పరికించాడు.

పరమానందంగా ఉంది. అద్భుతమైన అనుభవం. దీన్ని పదిలపరచుకోవాలి! ఎన్నో ఆలోచనలు!

ప్రభ ట్రాన్స్‌లోంచి బయటకొచ్చింది. తెరచిన తన కళ్ళల్లో ఎంతో ప్రకాశాన్ని చూశాడు కిరణ్. రెండు కళ్ళని దగ్గరగా గమనించాడు. ప్రభ మొహం అత్యంత ప్రసన్నంగా కనబడింది.

ఇద్దరూ లేచి మెల్లగా అడుగులేస్తూ కుహరంలోంచి బయటపడ్డారు. కలసి చూడడంలో ఉన్న మాధుర్యం ఇద్దరి విడి మొత్తాలకి ఎన్నోరెట్లు అధికం. కొసరు కోసం మొగ్గ చుట్టూతా, పరిసరాలని మరింతగా చూస్తున్నారు.

తొమ్మిది కలువరేకులు. అదే సంఖ్యలో భూమిపై చిన్న జలాశయాలు. తామర పత్రాలని స్మరింపజేస్తున్నాయి. మరోసారి లెక్కించింది ప్రభ. సంతోషం కిరణ్‌తో పంచుకుంది. ఇద్దరి మనసుల్లో తెలుగు రాష్ట్రాల్లో 'తొమ్మిది' సంఖ్యకున్న క్రేజీ,

## తొలినవల చతురలో ఇలా!



**డా. టి. సంపత్ కుమార్**

పుట్టింది నిర్మల్ జిల్లా ఖానాపూర్. చదువు, ఉద్యోగాలు దిల్లీలో. పదవీవిరమణ తర్వాత నిర్మల్- దిల్లీల మధ్య జీవనం. తెలుగు, ఇంగ్లీషు పత్రికల్లో 250కి పైగా రచనలొచ్చాయి. ఇది నా తొలినవల. దీన్ని రాయడంలో ప్రోత్సహించిన 'చతుర' సంపాదక వర్గానికి కృతజ్ఞతలు! ఈనాడు గ్రూపు ప్రచురణలన్నిటిలో నా రచనలు రావడం ముదావహం. నా రచనలన్నీ చదివి నిర్మాణాత్మక సలహాలిస్తున్న జీవిత భాగస్వామి మాధవీలతకి కృతజ్ఞతలు.

తెలుగు, హిందీల్లో పాటలు రాస్తున్నాను. ఇప్పటివరకూ నాలుగు పుస్తకాలొచ్చాయి. 'లియోసా' కథా సంకలనానికి జ్యేష్ఠ సాహితీ పురస్కారం లభించింది. కొన్ని కథలు ఇతర భాషల్లోకి అనువాదమయ్యాయి. యథార్థ సంఘటనలకు చిట్టిపొట్టి కథారూపాలుగా ప్రస్తుతం 'సిక్స్‌టీ- నాట్ ఔట్' శీర్షికతో ఇంగ్లీషులో రాస్తున్నాను. కథలకు కళారూపం ఎలా తేవాలో నేర్చుకుంటూనే ప్రస్తుతం సంఘసేవలో నిమగ్నమయ్యాను.

**చిరునామా :**
**డా. టి. సంపత్ కుమార్**
ఫ్లాట్ డి-202, శివం అపార్ట్‌మెంట్స్
(విక్రమ్‌నగర్ హౌజింగ్ సొసైటీ)
ప్లాట్-14, సెక్టార్-12, ద్వారకా,
న్యూదిల్లీ - 110 078
tiesskay@gmail.com

అంధ విశ్వాసాలు మెదిలాయి.

"దీని అందాన్ని పూర్తిగా చూడాలంటే ఆకాశం నుండి చూడాలి. అప్పుడు 'ఏరియల్ వ్యూ'లో ఈ కలువ మచ్చలేని తెలుపులో, లెక్కతో అమర్చిన రీతిలో తొమ్మిది జలాశయాలు పత్రల్లా అద్భుతంగా కనబడతాయేమో? " ఉత్సాహంతో ప్రభ.

"కరెక్ట్! ఇప్పుడు మనం సైడ్ వ్యూ మాత్రమే చూస్తున్నాం. పూర్తి అందాన్ని చూడలేం. నా స్నేహితుడికి ఒకసారి రాత్రి వేళ దిల్లీలో ఫ్లైట్ దిగుతున్నప్పుడు కిటికీ లోంచి ఈ కలువ వెండి పువ్వులా మెరిసిపోతూ కనబడిందట! వాడు దాన్ని ఉత్సాహంతో మాతో పంచుకున్నాడు.."

"లక్కీ ఫెలో! మనకూ ఎప్పుడో ఒకసారి ఈ మొగ్గ రాత్రిపూట కనబడకపోదు!" ప్రభ ఆశాభావం.

దూరంలో ఇస్కాన్‌వారి కృష్ణ మందిరం. మరోవైపు మురికి వాడలు. లోపలి నిశ్శబ్దానికి బయట పూర్తిగా వ్యతిరేకం! అంతా శబ్దభరితం. రోడ్డుపై ట్రాఫిక్ రోదన. పైన ఏర్ ట్రాఫిక్ గర్జన. దేశ రాజధాని దిల్లీకి చేరుకుంటున్నామన్న చిరుగర్వంతో ఇంజన్లలో మరింత గర్జన.

ఇప్పుడు నా వంతు అన్నట్టుగా విశాలమైన లాన్స్. కలువని చేరే కాలి మార్గానికి అటూ ఇటూ సొగసుగా విస్తరించిన గడ్డిపరకలు తమవైపు ఆకర్షించుకునే చిన్న ప్రయత్నం. ఒక్కొక్క మెట్టు దిగుతుంటే కలువకి దూరంగా, మన వెనక భాగాన్ని చూపుతూ! పర్యాటకులు లోనికి వెళ్ళేటప్పుడు కలువ ఎంతగా కట్టేస్తుందంటే మార్గానికి రెండువైపులున్న లాన్స్ మన దృశ్య పరిధిలోకి రానేరావు. తిరుగు ప్రయాణంలో కంటిచూపులు పక్కలకి విస్తరించి కళ్ళలోని కెమేరాలు 'వైడ్ యాంగిల్ లెన్స్'లని పనిలోకి దించుతాయి. కలువని వదిలి వస్తున్న దిగులుని గడ్డిపరకల మైదానాలు క్రమపద్ధతిలో ఉన్న పూల ద్వీపాలతో పర్యాటకులని బయటి వరకు సాగనంపుతాయి.

కార్లోకి దూరేముందు చివరిసారిగా 'లోటస్ టెంపుల్' కళ్ళారా చూశారు. ప్రభకి నూతన చైతన్యం. మనసులోని మాటలు బయటికి కిరణ్ కోసం.

"ఈ అనుభవంలో ఒక సమగ్రత ఉంది. సంపూర్ణత ఉంది. అద్భుతమూ ఉంది. అధ్యాత్మిక చింతనా ఉంది"

కిరణ్ విడ్డూరంగా ప్రభవైపు చూశాడు. తాను రెండు మాటల్ని జోడించాడు.

"కళ్ళకి కమ్మని భోజనం..! ఆత్మకి అమితానందం..!"

ఇద్దరూ ఒకరినొకరు ప్రశంసాపూర్వకంగా చూసుకున్నారు.

కొన్ని నిమిషాల క్రితమే పంపిన ఫోటోలని చూసి "యు మేడ్ ఇట్..! రెండు కలువలతో నువ్వు ఎంతో సంతోషంగా కనబడుతున్నావ్! ఎంజాయ్!" ఓ పోకిరి స్నేహితుడి ఎస్సెమ్మెస్.

ముసిముసిగా నవ్వుతూ బుల్లితెరని ప్రభ ముందుంచాడు. ప్రభ చదివింది. నవ్వుకుంది.

తనకి పిన్ని కూతురు నుండి వచ్చిన ఎస్సెమ్మెస్ చూసి ప్రభ కొంచెం గట్టిగానే నవ్వింది. కించిత్ గర్వంతో బుల్లితెరని కిరణ్ ముందుంచింది.

"తెల్లని లోటస్ టెంపుల్ బ్యాక్‌గ్రౌండ్‌తో నల్లని బావ పక్కన నీ ఫోటో సూపర్! అహాహా..! నీ సింగిల్ ఫోటోలో డింపుల్ ఎంత బాగా కనబడుతోందో..! ఎంజాయ్ యువర్ హెచ్.ఎం.!"

"హైద్రాబాద్ వెళ్ళాక మీ చెల్లి పని పడతానని చెప్పు! అంత నల్లగా ఉన్నానా? "

"దాని పెళ్ళి వచ్చే సంవత్సరం. అబ్బాయి న్యూజెర్సీలో ఉంటాడు.. పేరు.."

"ఆ అబ్బాయి నాకు తెలుసు! రెండేళ్ళు సీనియర్ నాకు!"

బీరకాయ పీచు కనెక్షన్లు దొరికాయి.

సంభాషణలని కొనసాగిస్తూ కార్లోంచి మురికివాడలని చూస్తూ ఆ ప్రదేశాన్ని వది లారు. ఒకసారి పాకెట్లోని కాగితం తీసి లిస్ట్ చూసుకున్నాడు.

'ఈ రోజుకి ఇక చాలు! మీరు విశ్రాంతి తీసుకోండి!' అని కారు ఇద్దరిని మోసుకొని ఇంపీరియల్ హోటల్ వైపు మెలికలు తిరుగుతూ పోయింది.




**బి**ల్ క్లింటన్ అమెరికా అధ్యక్షుడిగా భారతదేశం వచ్చినపుడు పార్లమెంట్‌లో ఉపన్యసించి తాజ్‌మహల్ని దర్శించాడు. ఒక ఆసక్తికరమైన విషయం చెప్పాడు. 'ప్రపంచంలో రెండు రకాల మనుషులు న్నారు - ఒక వర్గం తాజ్‌మహల్ని చూసి ప్రేమించేవారు, రెండో వర్గం తాజ్‌మ హల్ని చూడకనే ప్రేమించేవారు. రెండో వర్గానికి చెందిన నేను, ఇక్కడి నుండి ఆగ్రా బయలుదేరుతున్నాను'

భారతదేశాభివృద్ధికి ప్రతీకగా అందరి మనసుల్ని దోచుకుంటున్న యమునా ఎక్స్‌ప్రెస్ రోడ్డుపై కారు హుషారుగా వేగంగా దూసుకుపోతోంది. ప్రేమసాగ రంలో ఈత నేర్చుకుంటున్న ప్రభా-కిరణ్ లకి మరోరోజు! ప్రేమశాస్త్రంలో అక్షరా భ్యాసం తాజ్‌మహల్ ప్రాంగణంలో!

విద్యాభ్యాసానికి బాసర! ప్రేమాభ్యాసా నికి ఆగ్రా! నర్సరీ ఖజురహో! బాసరలో పలకలపై అక్షరాలని దిద్దితే, ఇక్కడ మనో ఫలకాలపై ప్రేమాక్షరాలని సున్నితంగా దిద్దాలి. కనిపించని ఆ రాతలని కమ్మని చూపులతోనే చదువుకోవాలి. తాజ్‌మ హల్ని చూడడం ఇద్దరికీ మొదటిసారి. ఢిల్లీ వచ్చినప్పటి నుండి ఇద్దరి మధ్య ఎంతో చనువు పెరిగింది. హైద్రాబాద్ వదిలేంతవరకు ఎప్పుడూ ఎవరో ఒకరు, ఏదో ఒక కార్యక్రమం అంటూ శ్రుతిమిం చిన సంప్రదాయపు నాచులో ఇరుక్కుపో వాల్సి వచ్చింది. పెళ్ళితో దగ్గరైన రెండు కుటుంబాలు వారివారి సంప్రదాయాల ప్రకారంగా అనుబంధ కార్యక్రమాలు కొంత విసుగనిపించినా, పెద్దల మనస్సులని బాధపెట్టడం ఇష్టం లేక అన్నింటినీ వధూ వరులుగా నెరవేర్చారు. పురోహితుడు చెప్పిన ప్రకారం నడుచుకున్నారు. ఇప్పుడు ఏ శృంఖలాలూ లేని రెండు మనస్సులు, రెండు శరీరాలకి స్వేచ్ఛ! ఆలోచనలకి పూర్తిగా రెక్కలొచ్చిన వేళ! సంపూర్ణంగా ప్రేమ బేడీలు వేసుకున్న ఖైదీలు వారు!

ఇద్దరిలో ఏదో నిర్వచించలేని ఉత్సా హం. ప్రేమ మండల పరిధిలోకి చేరు కున్న సిగ్నల్స్ శరీరంలోకి ప్రవేశించి వింత అనుభవాలని కలిగిస్తున్నాయి. ఢిల్లీ వచ్చినప్పటి నుండి ఇద్దరి మధ్య పి.డి.ఏ. (పబ్లిక్ డిస్‌ప్లే ఆఫ్ ఎఫెక్షన్) ఎక్కు వైంది. చేతులు స్వేచ్ఛగా కలుసుకుంటున్నా యి. నడుములని చుట్టేసుకుంటున్నాయి. అప్పుడప్పుడు చేతులు భుజాలపైకి పోయి నిలుస్తున్నాయి. కళ్ళుచేసే అల్లర్లు సరేసరి! పోకిరి సంభాషణలు మరిమరీనూ!

అభిమన్యుడిలా డ్రైవర్ ఆగ్రా పట్టణంలో అస్తవ్యస్తమైన ట్రాఫిక్‌ని ఛేదించుకొని తాజ్‌మహల్ దగ్గర వదిలాడు.

ఇద్దరూ నడుస్తూ వెళ్ళి టిక్కెట్లని కొన్నారు. చెప్పులని డిపాజిట్ చేశారు.

ప్రధాన ద్వారం దాటేస్తూనే కనబడే దృశ్యం.. నమ్మలేని అద్భుత ఆవిష్కరణ! ప్రకాశాన్ని నింపుకొని సూర్యకిరణాలు



పాలరాతి కట్టడంపై కంటికి కనబడని వర దలా కప్పేశాయి. నాలుగు కళ్ల నుండి చూపులు నిటారుగా ఎదురుగానున్న కట్ట డానికి కదలలేని లేజర్ కిరణాల్లా అతుక్కు న్నాయి. నోట్లోంచి మాటలు ఆగిపోయి కొ న్ని నిమిషాలు శిలలై దాన్నే చూస్తున్నారు. ఇంకా అలాగే ఉండేవారేమో కానీ పర్యాట కుల గుంపొకటి రావడంతో వారికి తోవ ఇవ్వడానికి పక్కకి తప్పుకోవాల్సి వచ్చింది.

కిరణ్-ప్రభ ఇంకా తాజ్‌మహల్ కని కట్టులో పరవశించి ఈదుతున్నారు.

ప్రభ దగ్గరిగా జరిగింది. కిరణ్ నుండి ప్రతిచర్య! ఇద్దరూ మరింత దగ్గరగా! అది ఆ ప్రాంతపు మహిమ.

అసంకల్పిత చర్యలకి ప్రేమ నిప్పుర వ్వలు అక్కడ పుష్కలంగా దొరుకుతాయి. అదొక ప్రేమరాజ్యం!

ఇద్దరూ చేతులని పెనవేసుకొని తాజ్ మహల్ పైనే చూపులని కేంద్రీకరించి అడుగులేస్తున్నారు.. నెమ్మదిగా స్థలాన్ని అడుగులతో కొలుస్తున్నట్టుగా!

"కిరణ్! మనం చాలా అదృష్టవంతులం కదా! పెళ్ళయిన కొన్నిరోజుల్లోనే ఇక్కడికి వచ్చాం. ఎన్ని జంటలకి ఈ అవకాశం వస్తుంది? నాకైతే ఏదో లోకంలో ఉన్న ట్టుగా ఉంది కిరణ్!" మరింత దగ్గరిగా జరిగి ఇద్దరి మధ్య చలామణిలో ఉన్న నిశ్శబ్దాన్ని ఊదేసింది.

"నాకైతే మాటలు రావడంలేదు ప్రభా! పదహారో శతాబ్దంలో ఇంతటి అద్భుతాన్ని ఎలా సృష్టించగలిగారు? శరీరమంతా పులకించిపోతోంది. ఈ స్థలం, పరిసరాలు, భూమి, ఆకాశం, వెలుతురు.. అన్నీ తగిన పాళ్ళల్లో వాటంతట అవే కలుపుకొని మనని కనికట్టు చేస్తున్నాయేమోనన్న భ్రమ కలుగుతోంది. నిజంగానే మన ముందు ఈ కట్టడముందా? ఓసారి గిల్లు నన్ను.." కిరణ్ వశీకరణమైపోయాడు.

గిల్లమని 'ఆహ్వానం' రాగానే ప్రభకి తోచలేదు. ఆట పట్టించడానికి గట్టిగా గిల్లాలా? లేక సూత్రప్రాయంగా నాజూగ్గా గిల్లాలా? క్షణాల్లో ఆలోచించుకొని, చివ

రకి, నాజూకు వేళ్ళతో గట్టిగానే గిల్లింది - బహిరంగ ఆహ్వానాన్ని పూర్తిగా ఉపయోగించుకున్నానన్న పోజు కూడా పెట్టింది.

"ఉస్స్! గిల్లమంటే ఇంత గట్టిగానా? నాటీ గర్ల్!" గిల్లిన ప్రదేశాన్ని చేతిపై రుద్దుకుంటూ.

"నొప్పిగా ఉందా? బాండేడ్ వేయమంటావా? రక్తం రాలేదు కదా? అవసరం లేదులే!" ఉడికిస్తూ ప్రభ.

"నిన్ను గిల్లుతాను చూడు"

"నో..నో.. నీలా నాది సున్నితపు చర్మం కాదు. గట్టిగా కొరుకుతావా?" ఎక్కడ కొరుకుతాడోనని మొదలే దూరంగా జరుగుతూ ప్రభ ముసిముసి నవ్వులు.

"కొరకమని దూరంగా పోతావేంటీ? దగ్గరికి రా!"

చెల్లాచెదురుగా తిరుగుతున్న పర్యాటకులు సెన్సారు బోర్డు సభ్యుల్లా కనబడ్డారు. అనువుకాని చోటు..! ఆహ్వానాన్ని ఉపయోగించుకోలేని స్థితిలో కిరణ్!

"సారీ! జాలేస్తోంది" ప్రభ ఉడికిస్తూ.

ఫొటోగ్రాఫర్లు తమ అనుభవ రీత్యా పర్యాటకులని అట్టే పసికడ



తారు. దక్షిణ భారతీయులని, కొత్త దంపతులని, ముఖ్యంగా విదేశీయులని వారి వారి కనుకూలంగా గిరాకీలని పట్టేసుకుంటారు. 'సౌత్ ఇండియన్స్' అని గ్రహించి పొడిముక్కల ఇంగ్లీషు భాషలో సంభాషణ మొదలుపెడతారు. ఇద్దరు చురుకైన ఫొటోగ్రాఫర్లు కిరణ్-ప్రభలని కొత్త జంటగా గుర్తించి గాలం వేశారు.

"ఇక్కడ కూచోండి! అందరి ఫేవరేట్ బెంచి ఇది. ఎందరో విఐపీలు ఇక్కడే కూచొని ఫొటోలు దిగారు. మీరు తాజ్‌మహల్ చూసి తిరిగి ఇక్కడికి వచ్చేసరికి ప్రింట్స్ రెడీగా ఉంటాయి" ఆ ఫొటోగ్రాఫర్లు వెంటబడి గిరాకీని చేజిక్కించుకునే ప్రయత్నం చేస్తున్నారు.

"అరె యార్! ముజే చోడ్ దో!" ఒక ఫొటోగ్రాఫర్ మరొకనితో ఈ కస్టమర్లని తనకే వదలమని స్నేహపూరితమైన అధికారంతో కోరాడు. రెండో ఫొటోగ్రాఫర్ ఏమి మాట్లాడకుండానే వెళ్లిపోయాడు. ఇది అక్కడ చలామణిలో ఉన్న సంస్కృతి! సాఫీగా సాగే రోజుటి ఒప్పందాలు!

"స్పెషల్ ఎఫెక్ట్ ఫొటోలని కూడా తీస్తాను. మీ కెమేరాతో తీయమన్నా తీస్తాను.." అంటూనే తన చేతిలో ఉన్న ఆల్బంలోని పేజీలని తిప్పుతూ చూపాడు.

తాజ్‌మహల్ శిఖరాగ్రాన్ని మునివేళ్ళతో పట్టుకున్నట్టుగా!

విభిన్న కోణాల్లో తాజ్‌మహల్ని బ్యాక్‌గ్రౌండ్‌లో చూపడం!

కొత్త జంటల్ని 'హనీమూన్' ఫోజుల్లో తీయడం!

కోటానుకోట్ల జంటలు కూచొని దిగిన బెంచిపై 'ప్రేమ జంటలుగా' కూచోబెట్టి తీసిన చిత్రాలు. ఆ ఫొటోలని చూడగానే తప్పక ఫొటోలని తీయించుకోవాలన్న కోరిక బలపడుతుంది.

ప్రభ ఫొటోల్లో తనని, కిరణ్ని ఊహించుకుంది. ఆల్బంలోని పేజీలని వేగంగా తిరగేసింది.

కళ్ళు కళ్ళు మాట్లాడుకున్నాయి.

ఇద్దరూ సై... సై..!

"ఛలో భాయ్! షురూ కరో! ఫొటో కీంచో..!" బెంచీ వైపు కదులుతూ కిరణ్.

"సాబ్! ఆప్ హిందీ జాంతే హై!" కస్టమర్ హిందీలో మాట్లాడడం విని కుతూహలంతో ఫొటోగ్రాఫర్ అడిగాడు.

"తోడా..తోడా.. హమ్ హైద్రాబాద్ కె హై.. ఉర్దూ జాంతే హైనా.." కిరణ్ ఉర్దూని బయటకి తీశాడు.

"పోయినేడాది నేను హైద్రాబాద్ వెళ్ళాను. మీ చార్మినార్ చూశా" గర్వంతో హిందీలో అన్నాడు ఫొటోగ్రాఫర్.

"ఎలా ఉంది? " ఆయన నుండి వినాలన్న ఉత్సాహంతో కిరణ్.

"చాలా బాగుంది. పైకి కూడా ఎక్కాను. సాలార్‌జంగ్ మ్యూజియమూ చూశాను"

మోస్ట్ పాపులర్ స్పాట్ - పాల రాతి బెంచీ దగ్గరకు చేరుకున్నారు. ఎప్పుడూ జనసందడే అక్కడ. అందరూ తప్పక ఫొటో తీయించుకోవాల్సిందే! తాజ్‌మహల్ని చూశామని ఫొటోల్లో చూపే ప్రమాణపత్రం ఈ బెంచీపైనే తయారవుతుంది. పర్యాటకులందరు ఒక క్రమంలో ఫొటో క్లిక్కుమనిపించుకుంటూ కదలాలి. స్థానిక ఫొటోగ్రాఫర్లు తమ తమ కస్టమర్లతో బెంచీ ఖాళీ అవగానే కూచోబెట్టడానికి సిద్ధంగా ఉన్నారు.

సెకండ్ల ముల్లుల్లా కదులుతుంటారు జనం. పనులు చకచకా కానిస్తూ..!

ప్రభ-కిరణ్‌ల వంతు రానే వచ్చింది.

"ప్లీజ్ కమ్! సిట్.. సిట్..!" ఇద్దరినీ బెంచీపై కూచోబెట్టాడు. అప్పటికే సెలక్ట్ చేసిన భంగిమల్లో ఫొటోగ్రాఫర్ టకటకా సున్నితమైన ఎలక్ట్రాన్ నొక్కులు నొక్కాడు. తమ బుల్లి కెమేరాని కూడా ఫొటోగ్రాఫర్ చేతిలో పెట్టాడు కిరణ్. కెమేరా తన బొజ్జని నింపుకుంది.

ప్రభ మునివేళ్లు కలువ మొగ్గలా చేసి భూమివైపు చూపుతోంది. ఫొటోగ్రాఫర్ ప్రభకి సలహానిచ్చి మొగ్గని గాలిలోనే కద లకుండా ఉంచమన్నాడు. తాజ్‌మహల్ శిఖరాగ్రం ఎంతో దూరంలో, ఆకాశంలోకి పొడుచుకొని ఉంది. ముడుచుకున్న రెమ్మల్లా రూపధారణ చేసిన ప్రభ ముని వేళ్లు.. ప్రేమకి అత్యంత శిఖరాగ్రమై రాణీ ఠీవితో నాలుగు శతాబ్దాలుగా ఆకాశాన్ని దాటుతున్న.. ఈ రెంటిని ఊహల్లో కలిపి చిత్రంలో బంధించాలి.

"రెడీ..ఒన్..టూ..త్రీ.." ఫొటోలో కల యిక విజయవంతమయింది. మునివేళ్లు లోహపు శిఖరాగ్రాన్ని పట్టుకున్నాయి!

"మీరు తాజ్ చూసి తిరిగి వచ్చేసరికి ప్రింట్స్ రెడీగా ఉంటాయి. మీరు తీసుకె ళ్లవచ్చు" అని వేగంగా చెప్పేసి ఫొటోగ్రా ఫర్ మరో కస్టమర్ వైపు పరుగుతీశాడు. అది అతని జీవనోపాధి.

ఇద్దరూ తాజ్‌మహల్ వైపు నడక సా గించారు. ఎందుకో ఓసారి ఫొటోగ్రాఫర్ తీసిన ఫొటోలన్నింటిని చూడాలనిపించిం ది. కాస్త పక్కకి జరిగి గంట-రెండు గంట ల క్రితం తీసిన ఫొటోలని తాజా గతంలో కి దూరి మరీ చూశారు... నవ్వుకున్నారు.

"సెల్లుతో కూడా తీశాను చూడు" కిరణ్.

"ఎంత బాగొచ్చాయి! ఇదైతే చాలా బాగుంది! దీన్ని పంపుదాం" ప్రభ సెలెక్ట్ చేసింది.

"ఓకే..గాన్.. వెళ్ళిపోయింది.. .తాజ్‌ని చూశామన్న ప్రూఫ్! అందరికీ.."

అలా ఫొటో వెళ్లిందో? లేదో? జవా బుల సునామీ!

"ఇప్పుడేమీ ఓపెన్ చెయ్యకు. రాత్రికి తీరిగ్గా చూద్దాం. స్విచ్ ఆఫ్ చేస్తే మనం తాజ్‌మహల్‌ని బాగా చూడొచ్చు.." ప్రభ సలహా ఇచ్చింది.

రెండు సెల్‌ఫోన్ల నోటికి తాళాలు.

ఏప్రిల్ ఎండలో తాజ్‌మహల్ స్నానం చేస్తోంది. ప్రకాశవంతమైన కిరణాల్లో మెరి

## కొత్తగాలి...

**నా నిరీక్షణ**
**నీ రాక కోసం కాదు**
**నీలో మార్పు కోసం!**

– వి.వి.ఎల్. సుజాత,
సైనిక్‌పురి, సికింద్రాబాద్

సిపోతోంది తెల్లని పాలరాతి కట్టడం. మాకు నీ తోడు, నీ కిరణాల అవసరం లేదని పాలరాళ్ళన్నీ సూర్యకిరణాలని తిప్పి కొడుతున్నాయి.

'నన్ను చూడ్డానికి వచ్చిన సందర్శకుల కళ్లని జిగేల్‌మని అనిపించకు. చూడు! వాళ్లు కళ్లని ఎలా చికిలిస్తున్నారో! విదేశీ యులని చూడు! వారు ఇంత ఎండని భరించలేరు. కూలింగ్ గ్లాసుల్ని పెట్టుకొని చూస్తున్నారు. వద్దు! నీ తీవ్రతని తగ్గించు. నా పర్యాటకులని మృదువుగా, సౌకర్యంగా కళ్ళనిండా చూడనీ...చూడు...నీ వల్ల నేను వేడెక్కిపోతున్నాను. వాళ్ళ పాదాలు, చల్లదనానికి మారుపేరైన నన్ను వేడె క్కించి నా వారికి ఎంతో ఇబ్బంది పెడు తున్నావు. షాజహాన్ బతికుంటే ఒక మహా ఛత్రం చేయించి నీ కిరణాలు నాపై పడకుండా చేసేవాడేమో? ' తాజ్‌మహల్.

'నన్ను చిన్నచూపు చూడకు. నిన్ను మంచి వెలుగులో చూపి, చూపి నీ అందా లని మరింత పెంచుదామని..' సూర్యకిర ణాల సంజాయిషీ

'వద్దు.. వద్దు.. నేను ప్రేమ చిహ్నాన్ని! నీ తీక్షణ కిరణాలు ప్రేమ సామ్రాజ్యంలో ప్రవేశించకూడదు. నీకు తెలుసా? నిండు పున్నమి వెలుతుర్లో నన్ను చూసి ఎంత మురిసిపోతారో? ఎంతగా తడిసిపో

తారో? ఆ అనుభవం నీకు తెలియదులే! నీవు సాయంత్రం కాగానే అంతమై పోతావు. నీకు వెన్నెలంటే తెలియదులే!'

'ఇపుడింతగా, కర్కశంగా మాట్లాడుతు న్నావు. చలికాలంలో నా రాక కోసం పడి కాపులు కాస్తావు. ఈ ప్రాంతంలో ప్రతి చలికాలంలో దట్టంగా వచ్చే పొగమం చులో నీవు దగ్గరి నుండి కూడా కనబ డవు. ఎప్పుడు నేనొచ్చి పొగమంచుని తరి మికొడతానో అప్పుడే నా లేత వెలుతు రులో నిన్ను చూస్తారు. అందుకు నేనె ప్పుడు కనపడతానా? అని ఎదురుచూ స్తారు. నిన్ను చూసేముందు, పర్యాటకులు పదేపదే నా కోసం ఆకాశంవైపు ఆశగా చూస్తారు. నేను కనపడ్డాకే కాసేపట్లో నువ్వు చక్కగా కనబడతావని ఆశతో ఉంటారు. శతాబ్దాల నుండి కొనసాగు తున్న మన స్నేహమిది. ఇంత మంచి మిత్రున్ని కసురుకుంటున్నావు'

'కాల మహిమ..చూడు! పెద్ద మేఘమొ కటి అటువైపు నుండి మెల్లగా వస్తోంది. నీ కిరణాలకి అడ్డుకట్ట వేస్తోంది. మనం రేపు మాట్లాడుకుందాం! ప్రస్తుతానికి నా పర్యాటకులని తనివితీరా చూడనీ! ఈ రోజు కొత్త జంటలు చాలానే వచ్చాయి!'

ప్రధాన వేదిక ఎక్కిన తరువాత తాజ్ మహల్ ఎంతటి మహానిర్మాణమో, దాని పక్కన మనుషులం ఎలా వామనులమైపో తామో ఇట్టే తెలిసిపోతుంది. పాల వేది కపై, రంగురంగుల ఈకలతో కదిలే పక్షుల్లా పర్యాటకులు.

అదొక వశీకరణ లోకం. తాజ్‌మహల్ని ఎటునుండి చూసినా ఆకర్షితులమవుతాం. ఎక్కడి నుండి మొదలుపెట్టాలో.. తిక మక. సంభ్రమాశ్చర్యాలు ఆవహించి సత మతమయ్యే స్థితి. పెనవేసుకొన్న చేతివేళ్లు బిగుసుకున్నాయి. మెల్లగా నడుస్తున్నారు తాజ్‌మహల్ని చూస్తూ. అపుడప్పుడు గోడల్ని స్పృశిస్తూ, తన్మయత్వాన్ని పొందుతూ.. అద్భుతకళని మెచ్చుకుంటూ, ప్రశంసిస్తూ... తక్కువమాటలు.. ఎక్కువ అనుభూతి ఇద్దరూ గ్రోలుతున్నారు. షాజ హాన్ నిష్ఠని కిరణ్ తలచుకున్నాడు.

ప్రేమకి కొలమానమై, ఠీవిగా నిల్చొన్న తాజ్‌మహల్ తీరు ప్రభకి ఎంతో నచ్చింది. ఇద్దరూ తాజ్‌మహల్ వెనకవైపు చేరుకున్నారు. యమున గాలి ఏకధాటిగా వీస్తోంది. ఆ వైపు నుండి నదిలో పారు తున్న నీటితో ఇద్దరూ కాస్త చల్లబడి తా జ్‌మహల్ వైపు ఉత్సాహంగా నడిచారు. ప్రభ వెంట్రుకలు గాలి వీచే దిశని స్పష్టంగా చూపుతున్నాయి. వేదిక అంచు వరకు చేరుకొని గాలికెదురుగా.. ఇద్దరూ!

ప్రభ ముందు.. వెనకాలే అంటుకొని కిరణ్..! గాలి రయ్యిమంటూ అదేపనిగా వీస్తూనే ఉంది.

కిరణ్ తన చేతులతో ప్రభ చేతుల్ని పట్టుకొని రెండువైపులా చాచాడు. అచ్చంగా టైటానిక్ చిత్రంలో నాయికా - నాయకుడు ఓడ ముందరి భాగంలో ఎలా కనిపించారో, అలానే కళ్లుమూసుకొని నిల్చున్నారు. కదలికలు లేని కలయిక. తన్మయత్వంతో మునిగిన ముద్ర. గాలి ఇద్దరి శరీరాలని తాకి, చైతన్యం పొంది, వేగాన్ని పెంచుకొని తాజ్‌మహల్ గోడల ను ఢీకొట్టి, కుడి ఎడమలకి తోవ మార్చు కొని కట్టడాన్ని మృదువుగా స్పృశిస్తూ మరో దిశకి పరుగెత్తింది.

కిరణ్-ప్రభల ప్రేమ పుస్తకంలో కొన్ని పేజీలు ముందుకు కదిలాయి. తాజ్‌మ హల్ సొగసులని అన్ని కోణాల నుండి చూశారు. తనివి తీరదు. తీపి గుర్తుగా ఫొటోలు. సెల్లుల్లో, డిజిటల్ కెమేరాల్లో, ఫొటోగ్రాఫర్ తీసిన ప్రింటు కాపీల్లో - అన్నీ హైద్రాబాద్‌కి తాజ్‌మహల్ని మోసు కెళ్తాయి. ఎంతసేపున్నా ఇంకా వెలితే! వెళ్ళక తప్పదు. తిరుగు మార్గంలో అడు గులు ముందుకు పడుతున్నాయి. అపుడ

చమత్కారం

# గొప్పవారితో గొప్పదనం!

గొప్పవారి పక్కనున్న సామాన్యులు కూడా ఒక్కోసారి గొప్పవారిగానే పరిగణింపబడతారు. పండితుల గోష్ఠిలో ఉన్న అజ్ఞాని కూడా పండితుడనే అనుకుంటారు అందరూ. ఓ మంత్రిగారి కొలువులో ఉండే సామాన్యుడు కూడా పూజనీయుడే అవుతాడు. ఆ గోష్ఠి నుంచి వెలుపలకు వచ్చినపుడు ఆ వ్యక్తి నిజస్వ రూపం ఏమిటో తెలుస్తుంది. అలాగే ఆ మంత్రి కొలువు నుంచి తప్పుకున్న తరువాత అతన్ని ఎవరూ పట్టించుకోరు. ఆ వ్యక్తికి ఎలాంటి విలువా లేనప్పటికీ తాను ఉన్న స్థాన విశేషం వల్ల ఆధిక్యం ఆపాదింపబడుతుంది.

ఇదే విషయాన్ని కవిగారు ఈ కింది పద్యంలో ఎంత చమత్కారంగా చెప్పారో చూడండి!

**స్థానవిశేష మాత్రమున తామరపాకున నీటిబొట్టు! నిన్**
**బూనిక మౌక్తికంబనుచు బోల్చిన మాత్రనె యింత గర్వమా!**
**మానవతీ శిరోమణుల మాలికల యందున గూర్పవత్తువో?**
**కానుకలియ్య వత్తువో? వికాసము నిత్తువో? విల్వ దెత్తువో?**



తామరాకు మీద ఉన్నంతసేపూ నీటిబొట్టు ముత్యంలా మెరిసిపోతూ కనువిందు చేస్తూ ఉంటుంది. అంత మాత్రాన అది నిజమైన మేలిమి ముత్యం ఎన్నటికీ కానేరదు కదా! ఇక్కడ కవి ఈ విషయాన్నే ఎంతో చమత్కారంగా చెబుతున్నాడు.

ఓ నీటి బొట్టా! నువ్వు తామరాకు మీద నిలిచి ఉండడం వల్ల నిన్ను ముత్యంతో పోల్చి చెబుతూ ఉంటారు. అది నువ్వు ఉన్న స్థాన విశేషం వల్ల వచ్చిన గొప్పతనం తప్ప సహజంగా నీలో ఉన్నది కాదు. ముత్యంతో పోల్చినంత మాత్రానికే నీకు ఇంత గర్వం తగదు సుమా! ముత్యం అన్నంతలోనే నువ్వేమయినా స్త్రీల కంఠహారాల్లో కూర్చడానికి పనికి వస్తావా? ఎవరికైనా కానుకగా ఇవ్వడానికి తగుదువా? నీకు వికాసమూ లేదు! విలువా లేదు!

అంతే కదా! నీటి బొట్టు తామరాకు మీద ఉన్నంతసేపే ముత్యంలా మెరిసిపోతూ ఉంటుంది. ఆ ఆకు మీద నుంచి తొలగిందా ఇక దాని గతి అంతే! అది ఒట్టి నీటి బొట్టు మాత్రమే! సమాజంలో వ్యక్తులైనా ఇంతే! సహజంగా తమలో గొప్పతనం ఉంటేనే ఎల్లకాలం గౌరవింపబడతారు.

ఈ పద్యాన్ని 'పారిజాతాపహరణం' ప్రబంధ కర్త ముక్కు తిమ్మనగారిదిగా చెబుతారు.

ప్పుడు వెనక్కి తిరుగుతూ మనస్సు నిండా తాజ్‌మహల్ని, కమ్మని భోజనం చివర్న ఐస్క్రీంతో ముగించినట్టుగా, చివరిసారిగా కళ్ళనిండా నింపుకుంటూ ప్రధాన ద్వారానికి చేరుకున్నారు. గేట్ దగ్గర కస్టమర్లతో హడావుడిగా ఉన్న ఫొటోగ్రాఫర్ నుండి ఫొటోలని తీసుకున్నారు. చకాచకా చూసుకుని విశ్వవిఖ్యాతమైన ప్రేమ ప్రాంగణం నుండి నాలుగు పాదాలు నెమ్మదిగా బయటికి అడుగులేశాయి. తాజ్‌మహల్ని చూసినవారి ప్రపంచ జనాభాలో మరో ఇద్దరి సంఖ్య చేరింది. ఆగ్రా కోటని మొక్కుబడిగా చూసినా, షాజహాన్ బందీగా ఉన్నపుడు అక్కడి నుండి తాజ్‌మహల్ని చూస్తూ ఎలా గడిపేవాడో అన్న విషయం ప్రభ-కిరణ్‌లకు ఆసక్తి కలిగించింది.

ఐదు శతాబ్దాల చరిత్రని నిమిషాలకి కుదించి, టూరిస్టుల తొందరని బాగా జీర్ణించుకొని, పిండి కొద్దీ రొట్టెలా చెబుతూ నడుస్తున్నాడు గైడ్. తాజ్‌మహల్ని చూశాక ఆగ్రాలోని మిగతా కట్టడాలన్నీ చంద్రుని ముందు తారలే! పర్యాటకుల ఆసక్తి కూడా అంతంత మాత్రమే! షాజహాన్ బందీగా ఉంటూ తాజ్‌మహల్‌ని ఎక్కడి నుండి చూసేవాడో, దృశ్యం ఎలా కనబడుతుందో పరీక్షగా గమనిస్తున్నారు. గైడ్ చెబుతున్నాడు. అంత అంకితభావంతో తన రాణి కోసం నిర్మించిన ఆ కట్టడాన్ని చూసుకునే వసతి కల్పించడం చివరి రోజుల్లో షాజహాన్‌కి కొంత ఉపశమనం కలిగించి ఉంటుంది. అంతిమ సంవత్సరాలని ఆనందంగా గడిపే ఉంటాడేమో?

'ఎంతమంది ప్రియులకి ఇలా ఆనందంగా అనుభవించే శిక్ష లభిస్తుంది? ప్రతిరోజూ తన రాణి ముంతాజ్‌తో ముచ్చటించే వాడేమో? యమునా నది నేపథ్యంలో వెన్నెల రాత్రుల్లో తనివితీరా ఏకాంతంగా ఇద్దరూ గడిపి ఉంటారు' కిరణ్ అన్నాడు.

చరిత్ర ఎక్కువగా చదవని కిరణ్‌కి ఈ విషయాలు వింతగా, ఎంతో ఆసక్తిగా ఉన్నాయి. వరసగా గైడ్‌ని ప్రశ్నలు అడుగుతూనే ఉన్నాడు. కాలచక్రంలో వెనక్కి మొఘల్ లోకంలో విహరిస్తున్నాడు!

"ఏ లోకంలో ఉన్నావు షాజహాన్?" గట్టిగా గిల్లుతూ ప్రభ.

"విన్న కొద్దీ వినాలని ఉంది. నేను చరిత్రని బాగా చదవాలి. ఒక్క తాజ్‌మహల్ గురించే కాస్త తెలుసు. మిగతా వివరాలు సున్నా" ఒప్పుకున్నాడు.

అందుకే గైడ్ చెప్పిన విషయాలని సీరియస్‌గా వింటున్నాడు.

"నువ్వు సివిల్ ఇంజనీర్! నన్ను బాగా ప్రేమిస్తున్నావని అనుకుంటున్నాను. ఒకవేళ నాకేమైనా అయ్యి ఠక్కున చనిపోతే, ఏం కట్టిస్తావు?" నవ్వుతూ.

"హనీమూన్‌కి వచ్చి ఈ నాన్‌సెన్స్ మాటలేంటి? సిల్లీగర్ల్!" అంటూ ప్రభ నోటిని మూశాడు కిరణ్.

★ ★ ★

ఇంపీరియల్ హోటల్ ఖాతాలోకి, హనీమూన్ రాత్రుల పద్దులోకి మరో రాత్రి వెళ్లింది. ఎన్నో వందల, వేల జంటలకి, ప్రపంచంలోని పలు దేశాల నుండి వచ్చే ప్రియులకి ఈ హోటల్ మధురానుభూతులని పంచుతూనే వస్తోంది. దశాబ్దాల చరిత్రని మోస్తున్న హోటలది.

బ్రేక్‌ఫాస్ట్ ముగించుకుని నడుస్తూ శివాజీ స్టేడియం దగ్గరున్న ఎర్‌పోర్ట్ మెట్రో స్టేషన్ వైపు బయలుదేరారు. ఎడమవైపు పెద్ద షోరూములు. కుడివైపు భాభా కరక్ సింగ్ మార్గాన ఎన్నో రాష్ట్రాల ఎంపోరియాలు. దూరం నుండి లేపాక్షి బోర్డ్ కనబడింది. కళ్ళల్లో సంతోషం. మనదేనన్న కించిత్ గర్వం!

హైద్రాబాద్‌లో ఇంకా మెట్రో సేవలు మొదలవలేదు. అందరూ ఎప్పుడెప్పుడు

మొదలవుతాయా అని ఉత్సాహంతో ఎదురుచూస్తున్నారు. దిల్లీలో మెట్రోట్రైన్ ఉన్నతస్థాయిలో సేవలందిస్తూ మంచి పేరు సంపాదించి ప్రజల జీవితాల్లో అంతర్భాగమైంది. ఇపుడది లేకుండా ఊహించుకోలేం - అందుకే దిల్లీకి 'లైఫ్ లైన్' అంటున్నారు. రోజూ ముప్పై లక్షలకి పైగా జనం ప్రయాణిస్తారు. ఇదొక గొప్ప సేవ అనుకుంటే మరోవైపు ఏర్‌పోర్ట్ మెట్రో ఎక్స్‌ప్రెస్ దిల్లీకి వజ్రపుటుంగరం లాంటి ఆభరణం అని చెప్పుకోవాలి. కేవలం ఆరు స్టాపులతో న్యూదిల్లీ రైల్వేస్టేషన్ నుండి బయలుదేరి దిల్లీలోని రెండు ఏర్‌పోర్ట్‌లని కలుపుతూ, సుందర ఉపనగరమైన ద్వారకాతో సేవ ముగిస్తుంది. 'దీంట్లో తప్పక ప్రయాణించాల్సిందే, జస్ట్ ఎక్స్‌పీరియన్స్ ద జర్నీ' అన్న మిత్రుడి మాటలు జ్ఞాపకానికి వచ్చాయి. 'ఈ మెట్రోలో ప్రయాణం చేయకుండా దిల్లీ నుండి తిరిగి రావద్దురా' అని మరో మిత్రుడి ప్రేమపూరిత రికమండేషన్! అందుకే కిరణ్ - ప్రభల అడుగులు అటువైపే కదిలాయి.

కొత్త జంటకి అంతా కొత్తగా ఉంది. శివాజీ స్టేడియం, మెట్రోస్టేషన్ని చూశాక స్నేహితులకి మనస్సులో కృతజ్ఞతలు తెలుపుకున్నాడు కిరణ్. కదిలే మెట్లపై కదలని జంట కాళ్లుమోపి అండర్ గ్రౌండ్‌లో ఉన్న ప్లాట్‌ఫామ్ చేరుకున్నారు. నాలుగు నిమిషాల్లో ట్రైన్... అంకెలు చెబుతున్నాయి.

రెండు ద్వారాలు తెరచుకోగానే నాలుగు పాదాలు కోచ్‌లోకి కదిలాయి. కొత్తదనపు బెరుకుతనం కాస్త! ఖాళీ సీట్లు కనబడడంతో వెళ్ళి కూర్చున్నారు. ఆసక్తిగా అన్ని దిక్కులకు చూపులు. అత్యాధునిక టెక్నాలజీతో ఆరంభించిన ఈ ప్రజాసేవ అత్యద్భుతం. భారతదేశంలో ఉన్నట్టుగా అనిపించదు. ఒక అభివృద్ధి చెందిన దేశంలో తేలిపోతున్నట్టుగా ఉంటుంది! అండర్ గ్రౌండ్ ప్రయాణం అంతమై భూమి ఉపరితలంపైకి, తరువాత పిల్లర్లపై వేసిన

> **కొత్తగాలి...**
>
> **స్కీమ్**
> **స్కామ్**
> **బొమ్మా! బొరుసూ!**
>
> *- జి.జి.కె. రావు,*
> *శ్రీకాకుళం*

పట్టాలపై వయ్యారంగా దిల్లీని చూపుతూ పోతుంది. ధౌలకువాలో ఆగింది. దిల్లీ చేరుకున్న మొదటి రోజున ఏర్‌పోర్ట్ నుండి హోటల్‌కి బయలుదేరుతున్నపుడు ఇదే ప్రాంతం నుండి వెళ్ళినట్టు గుర్తుకొచ్చింది ఇద్దరికీ. సెల్ఫీల్లో కనబడడానికి ఇద్దరి తలలు దగ్గరయ్యాయి. బుల్లితెరపై చక్కగా కనపడేందుకు ఇద్దరి చెక్కిళ్లని అంటించుకొని దంతాల వరసలకి దర్శన భాగ్యం ఇచ్చి కదిలే ట్రైన్లో కదలకుండా సెల్లులో నిలిచిపోయారు.

"ఎంత బాగుందీ మెట్రో! రియల్లీ బ్యూటీఫుల్! మన హైద్రాబాద్‌కి ఎపుడొస్తుందో? ఎంత లగ్జరీగా ఉంది ప్రయాణం!" కదిలీ కదలకుండా వెళుతున్న ట్రైన్‌లో ప్రయాణాన్ని బాగా అనుభవిస్తూ ప్రభ అంది. ధౌలకువా నుండి మళ్ళీ భూగర్భంలోకి దూరే వరకు రెండువైపులా దృశ్యాలు మనోరంజకంగా ఉంటాయి. వివిధ సేవల కార్యాలయాలు, అల్లుకుపోయినట్టనిపించే ఫ్లై-ఓవర్లు అన్నింటినీ సఫారీ వాహనంలో కూచొని దిల్లీలోని ఒక ముక్కని దర్జాగా చూస్తూ ప్రయాణం!

"జబర్దస్త్" ఉప్పొంగిన ఉత్సాహంతో కిరణ్. ఒక్క మాటలో అన్ని భావాలు నింపేశాడు.

ఇరవై నిమిషాల ప్రయాణం పూర్తిచేసి,



ఇతరుల విమర్శలను
పునాదిగా చేసుకుని
విజయం సాధించినవాడే
నిజమైన విజేత!

– డేవిడ్ బ్రింక్లీ

అ
క్ష
రం

మళ్ళీ అంతే తిరుగు ప్రయాణం చేసి శివాజీ స్టేడియం చేరుకున్నారు. ఆ అనుభవం చిన్నదే అయినా జీవితాంతం గుర్తుంటుంది.

పత్రికా విలేకరి తన వార్తని ఫైల్ చేస్తున్నట్టుగా, స్టేషన్ నుండి బయటికి రాగానే ఇద్దరు తమ సెల్లుల నుండి తమతమ రక్త-సామాజిక బృందాలకి ఫోటోలు పంపారు. అరచేతుల్లో అందరికీ ఆకాశ దేవతల్లా దర్శనమిచ్చారు. రోడ్డు దాటి రాష్ట్రాల ఎంపోరియాల్లోకి దూరిపోయారు. చీరలపై దాడి. ప్రతి రాష్ట్రానికి గర్వంగా చెప్పుకునే అల్లికలు, కుట్లు, చీరలు, చిన్న ఊళ్లలో ఉంటూ, తెలుగు రాష్ట్రాలకి పెద్ద పేరు తెచ్చిన కళాకారులు - పోచంపల్లి, ఉప్పాడ, నారాయణగిరి, గద్వాల్... ఇంకా... ఇంకా..!

ప్రభకి చీరలకన్నా వాటి డిజైన్లు, వెరైటీ అంటే చాలా ఇష్టం. వైవిధ్యమైన రంగుల కలయిక, సృజనాత్మకత, బార్డర్లలో కొత్తదనం, కొంగుల్లో హంగులు.. వీటిపై దృష్టిని పెడుతుంది. ఇక్కడ అన్ని రాష్ట్రాల దుకాణాలు. అసోమ్, బిహార్, గుజరాత్, జార్ఖండ్, బెంగాల్, మధ్యప్రదేశ్, ఒడిశాలతో పాటు ఈశాన్య, దక్షిణ భారతదేశ రాష్ట్రాలన్నీను..! కొత్త సరుకు కొత్త పోకడలు..! పోటీపడి వస్తున్న డిజైన్లు, డిస్కౌంట్లు.

షాపింగ్ ఎలాగూ చేయాల్సిందే! తోడుగా విండో షాపింగ్ ఉచితంగా. ప్రభ సంతోషంగా ఉంది. ఒక్కచోటే ఎంపోరియాల వరస ముచ్చటగా నచ్చింది. ఎక్కడి నుండి మొదలు పెట్టాలో కాస్త తబ్బిబ్బై చివరికి మధ్యప్రదేశ్ ఎంపోరియంతో ఆరంభించారు.

ప్రభలో ఉత్సాహం పొంగిపొరలుతోంది. ఏర్‌పోర్ట్ ఎక్స్‌ప్రెస్ ఆ రోజుటి సంతోషానికి బలమైన పునాది వేసింది. మెజారిటీ స్త్రీలలా ప్రభకి కూడా చీరల బలహీనత ఉంది. ఇప్పుడు చీరల తీరంలో ఉంది. ఒకటడిగితే పది చూపుతున్నారు. కళ్ళముందు చీరల కుప్పలు!

"ఎలా ఉంది కిరణ్?" భుజంపై వేసుకొని అద్దంలో చూసుకుంటూ.

"నీకు నచ్చిందా? అయితే తీసుకో!" అద్దంలో చూపులని కలుపుతూ...

జీన్స్‌పాంట్ - టీషర్ట్ వేసుకున్న ప్రభ కొత్త అందాలని తెచ్చుకుంది. కిరణ్ అద్దంలో ప్రభనే చూస్తున్నాడు.

"మొద్దబ్బాయి! నిన్ను చెప్పమంటే, నాకు నచ్చిందా అంటున్నావ్? తెలియదా నీకు? తిండి మనకి నచ్చింది తినాలి! చూసేవారి కోసం బట్టలు!" అద్దంలో కిరణ్‌ని చూస్తూ.

"బాగా లేదు" చుట్టుకున్న చీరని పక్కన పెట్టింది ప్రభ.

మరొకటి, ఇంకొకటి ఆ రంగు.. ఈ రంగు.. మిశ్రమాల రంగులు. తీయించిన చీరల చిరుకొండ నుండి ఆవగింజలా ఒక చీరతో ఫైనల్ సెలక్షన్...!

"గంటంపావు తీసుకున్నావ్! ఒక్క చీరని కొనడానికి. నాలుగు చీరలు కొనడానికి ఎన్ని గంటలు కావాలి?" మృదువుగా కిరణ్.

నాలుగు కాళ్ళు మరో ఎంపోరియంలోకి

నడిచాయి.

"డోంట్ వర్రీ మై డియర్! నీకు తెలియదా? ఫస్ట్ డెలివరీ కష్టం. ఆ తరువాతవి ఈజీ అంటారు. చూడు! మిగతా నాలుగు చీరల్ని ఎంత తొందరగా సెలక్ట్ చేస్తానో? ఇంతకీ నువ్వేమన్నావ్? ఇంకా నాలుగు చీరలా? నిజంగానే ఐదు కొందామా? " చిరునవ్వుతో ప్రభ.

"యస్! నీకు మాటిచ్చాను కదా? ఐదు కొనాల్సిందే! మనకి టైమ్ దొరకడం కష్టం. ఈ రోజు మనం ఇక్కడి నుండి ఐదు చీరలని తీసుకొని వెళ్లాసిందే!..."

"నువ్వు సూపర్ మొగుడువి..." కిరణ్ ముక్కుని గిల్లుతూ.

బెంగాల్ షాన్... కాంత చీర.

మహారాష్ట్ర పనితనం... పైటన్.

మధ్యప్రదేశ్ సొగసు... చందేరి.

రాజస్థాన్ రోనక్... టై అండ్ డై.

ఒడిశా కొత్త పోకడల చీర సంబల్‌పూర్.

"అక్కకి ఒకటి కొందామా? " సలహా కోసం ప్రభని అడిగాడు కిరణ్.

ఆశ్చర్యంగా, మెచ్చుకోలుగా చూసింది కిరణ్‌వైపు.

"ఈ ఐదు చీరల్లో ఒకటి అక్కయ్యకి, ఒకటి అత్తయ్యకి, ఒకటి మా అమ్మకి ఉన్నాయి. వాళ్ళ ఫేవరేట్ రంగులు, డిజైన్ల ప్రకారంగా కొన్నాను చిన్నా!" నీ మనసులో ఏముందో మొదలే పసిగట్టానన్న చొరవతో చూస్తూ ప్రభ.

"నాకు అనుమానం వేసింది నీ సెలక్షన్ చూసి. షోకుల పిల్ల కాస్త సంప్రదాయపు చీరల్ని ఎందుకు కొంటోందబ్బా! అని. నువ్వు మంచి పిల్లవి!

అంటే నీకు రెండే చీరలన్నమాట! లేదు.. లేదు..! ఇంకా మూడు కొనుక్కో! హనీమూన్లో ఇచ్చిన మాట నిలబెట్టుకోనీ ప్లీజ్!" సహకారాన్ని కోరుతూ కిరణ్.

ప్రేమకి పొంగిపోతూ "తప్పదా? " అంది. "మనం నార్త్ ఇండియాలో ఉన్నాం. ఇక్కడ సల్వార్ - కమీజ్‌లు మంచి డిజైన్లలో దొరుకుతాయి. చీరలకి బదులు వాటినే రెండు కొనుక్కోనా? " వ్యాపార ధోరణిలో బేరమాడుతూ ప్రభ.

"ఈ ఐదు చీరల సరాసరి ధరని దాటకూడదు మరి..!" నీకంటే నేను తక్కువ తిన్నానా? అనే ధోరణిలో కిరణ్ జవాబు.

ఇద్దరూ నవ్వుకున్నారు.

నాలుగు చేతుల్లో ఏడు సంచులు.

"హమ్మయ్య! ఇచ్చిన మాట నిలబెట్టుకున్నాను. ఐదు చీరలు ప్లస్ టు. అక్షరాలా ఒకేరోజు. థాంక్స్"

"థాంక్స్! సంతోషంగా ఉన్నా. చీరలు మనవాళ్లకి బాగా నచ్చుతాయి" ప్రభ తాను సెలక్షన్ ఎలా చేసిందో వివరిస్తూ.

"మన దేశంలో ఎన్ని రాష్ట్రాలో చెప్పు? మనం ఎన్ని ఎంపోరియాల నుండి కొన్నాం? " చిన్న పిల్లలనడిగిన రీతిలో కిరణ్‌ని ప్రశ్నించింది.

"ఇరవై తొమ్మిది మైనస్ ఏడు, ఇరవై రెండు.. నీకిచ్చేది ఏడు ముద్దులే!" ప్రభ.

"ఇరవై తొమ్మిది రాష్ట్రాలు, కేంద్ర పాలిత ప్రాంతాలు... అన్నీ కలుపు... ముద్దుల సంఖ్య పెరిగిపోతుంది. నీ లెక్కల గారడీ భలేగా ఉంది"

"హోటల్‌కి వెళ్ళి తలుపు మూశాక, ఈ లెక్కలు చెల్లవు. మన శరీరాలు అదుపులో ఉంటాయా? నా లెక్కలూ చెల్లవు. నీ ఒప్పందాలు పనిచేయవు"

ఇద్దరు గట్టిగా నవ్వుకున్నారు.

దిల్లీ నుండి వచ్చి మూడు రోజులైంది. సిగ్గుపడే సెకన్లు.. నిషాతో నడిచే నిమిషాలు.. గతి తప్పే గంటలు.. అయితేనేం? ప్రకృతి గడియారంలో రాత్రులు, పగళ్లు మారడంలో ఎలాటి మార్పూ లేదు. ఒకదాంతో మరొకటి దోబూచులాడుకుంటూ మానవాళి కదలికలని నియంత్రిస్తున్నాయి. రాత్రి - పగళ్ల లయ తప్పితే ప్రళయమే! ప్రభ - కిరణ్‌లు ప్రతి సెక

నుకి దగ్గరవుతున్నారు. ఒకరినొకరు మరింతగా అర్థం చేసుకుంటూ యాత్రని ముందుకు సాగిస్తున్నారు. హనీమూన్ ఒకరిపట్ల మరొకరికి ఆకర్షణ, నమ్మకాల బీజాలని నాటుతోంది. క్రికెట్ ఆటలో ఇద్దరు బ్యాట్స్‌మెన్‌ల మధ్య ఎలాంటి సమన్వయం, అవగాహన అవసరమో అందరికే తెలిసిందే! చిన్న పొరపాటైతే ఆట కుప్పకూలుతుంది. ఒకటే తేడా! క్రికెట్ ఆటని నిపుణులు విశ్లేషిస్తారు. అందరూ టీవీల్లో చూస్తారు.. వింటారు. కానీ దంపతుల భాగస్వామ్యం క్రికెట్ ఆటలా అన్ని కోణాల నుండి కనబడదు. వాటిని భార్య - భర్తలే గ్రహించి విశ్లేషించుకోవాలి. కిరణ్ - ప్రభలు ఆట ఆరంభంలోని ఓవర్లని ఎదుర్కొంటున్నారు. పరుగులెన్నో కాలమే చెబుతుంది.

హోటల్ చేరాక ప్రభ కొన్న చీరలన్నిటిని ఓసారి చూడాలనిపించి బెడ్డుపై పరచింది. అన్ని చీరలని ఒక్కొక్కటిగా ఐదు ఎంపోరియాలలో కొన్నది. అన్నింటిని పక్కపక్కన పెట్టి, మళ్ళీ విడిగా, అన్నీ కలిపి చూడాలన్న ఉత్సాహం. కళ్ళనిండా చూడాలి, పోల్చి చూడాలి. ఎంత సంతోషంగా ఉంటుందో? చీరల్లో ఉన్న మత్తు అది. అన్నింటినీ పరచింది. దేశపటంలో రాష్ట్రాలు పక్కపక్కన ఎలా కనబడతాయో అలా... కళల కలయిక. భిన్నమైన చీరలు. అన్నిటి కొలతలూ ఆరు గజాలే. భిన్నత్వంలో ఏకత్వం!

చీరల్ని చూశాక హైద్రాబాద్‌లో ఎలాంటి కామెంట్స్ వస్తాయో? రంగుల్లో వ్యత్యాసం ఉండాలి. బార్డర్లలో వైవిధ్యం కావాలి. కొంగుల్లో కొత్తదనం కనబడాలి. దేనికదే తన ప్రత్యేకతని చాటుతూ నిలబడాలి! పరచిన చీరల్ని పదేపదే చూసింది. చూసిందాన్నే మళ్ళీమళ్ళీ చూస్తోంది. ప్రభ బుర్ర నిండా ఎన్నో ఆలోచనలు.

ఏకాగ్రతతో పనిలో నిమగ్నమై కదులుతున్న ప్రభని, ఆవిడ కదలికలని గమనిస్తున్నాడు కిరణ్. 'చీరల్లో ఇంతటి మహత్తర శక్తి ఉందా?' అని ఆశ్చర్యపోతూ అర్థం చేసుకునే ప్రయత్నమూ చేస్తున్నాడు. ప్రతి చీరని నడుం దగ్గర పెట్టుకొని అద్దంలో చూసుకుంటోంది. కొంగులని కాస్తంత విప్పి కప్పుకుని సంతోషించింది. అద్దమూ ఆనందించింది - తన రోజుని రంగులమయం చేసినందుకు! గదిలో ఏడు రంగులతో ఇంద్రధనుస్సే మకాం చేసింది. తనలో తానే మాట్లాడుకుంటూ ప్రభ చీరల లోకంలో చిందులు వేస్తోంది.

"కిరణ్! ఐదు చీరల్నీ బాగా చూసి నీ రాంకింగ్ చెప్పు?"

"హమ్మయ్య! ఈ గదిలో నేను అనే ఒక ప్రాణి ఉన్నానని గుర్తించినందుకు నీకు యాభై ముద్దులు!"

"రాంకింగ్ చెయ్యమంటే రాగింగ్ మాటలంటున్నావు" మాటల్లో అయిష్టత.. కానీ చూపుల్లో ఇష్టతతో ప్రభ.

వెనక నుండి వాటేసుకొని ప్రభ భుజంపై తన ముఖాన్ని ఆనించి బుద్ధిమంతుడిలా తన రాంకింగ్ చేయడమారంభించాడు. ప్రభని వదలకుండానే ముందుకు వంగి చీరల్ని కదిపాడు.

"నాకిది బాగా నచ్చింది. ఇది నంబర్ వన్! ఇది రెండు! దీని బార్డర్ చాలా బాగుంది కానీ రంగు బాగులేదు. దీని డిజైన్ ఎంతో బాగుంది కానీ బార్డర్ మరీ ఎక్కువైంది. సో.. ఇది మూడు, ఇది నాలుగు" కిరణ్ తన చేతుల్ని గట్టిగా నొక్కి ప్రభని మరింత దగ్గరికి లాక్కున్నాడు.

"బ్యాడ్ రాంకింగ్! చీరల గురించి నీకు బొత్తిగా తెలియదు. ఫెయిలయ్యావు"

"జీన్స్, బ్రాండెడ్ షర్ట్స్, షూస్ గురించి అడుగు. ఇంటర్నేషనల్ గడియారాలు, సెల్‌ఫోన్ల గురించి అడుగు. వీటన్నిటిలో నేను బెస్ట్! నన్ను బీట్ చెయ్యలేవు" ప్రభ మెడపై కిరణ్ ముద్దుల ముద్రలు. ప్రభని

కిరణ్ సుతారంగా ఎత్తి కొత్త చీరలపై వెల్ల కిలా పడుకోబెట్టాడు. "కదలని చీరల పడ కపై కదిలే ఈ చీర ఎంతో బాగుంది. మాట్లాడే చీర మరెంతో బాగుంది" తానూ ప్రభ పక్కకి చేరాడు.

"అమ్మోయ్! నా చీరలు నలిగిపోతాయి" రక్కున లేచింది. కిరణ్‌కి లేవక తప్పలేదు.




**ఖ**జురహోలో విమానం దిగుతోందని ఏర్ హోస్టేస్ ప్రకటించింది. మొదటిసారి ఖజురహో వస్తున్నవారిలో టన్నులకొద్దీ ఉత్సాహం. విదేశీ యాత్రికులు ఎక్కువ సంఖ్యలో ఉన్నారు. 'ద లాండ్ ఆఫ్ కామ సూత్ర' వేలాదిమంది పర్యాటకులని ప్రపంచం నలుమూలల నుండి అయ స్కాంతంలా రప్పించుకొంటోంది. హనీ మూన్ జంటలనైతే మరీనూ! విమానం ఎత్తునుండి క్రమేణా దిగుతూ లాండింగ్‌కి సంసిద్ధమవుతోంది. ప్రభా-కిరణ్ కిటికీ నుండి అత్యుత్సాహంతో చారిత్రక పట్ట ణాన్ని విహంగదృష్టితో చూస్తున్నారు - తమ మెమొరీల్లో నింపేసుకుంటున్నారు.

విమానం సుమారుగా గంటకి పైగా ఆకాశంలో ఈదుతూ గాలితో ఒంటినిండా హైస్పీడ్ ముద్దులు తీసుకొని భూమితో ముచ్చటించడానికి వేగాన్ని తగ్గించింది. విరహపు తొందరని చూపుతూ దడిల్లున భూమిపై తన టైర్లతో గట్టిగా ముద్దులని ముద్రించి రన్ వేపై నిదానంగా, నాజూగ్గా ప్రయాణించి, పక్కకి తిరిగి సిగ్గుతో ఆగిపో యింది. టైర్లిపుడు మళ్ళీ ఎగిరేంత వరకు భూమితో లిప్ - లాక్ ముద్రలో!

విమానం నుండి దిగుతున్నవారి మన సుల్లో రెండే పదాలు నిండి ఉన్నాయి - వాత్స్యాయనుడు, కామసూత్ర. ఎన్నో విదేశీ భాషల్లోకి అనువదితమైన భారతీయ గ్రం థం కామసూత్ర. ఆ పుస్తకంలోని విష యాలు, జ్ఞానానికి, చేష్టలకి, భంగిమలకి ఖజురహోలోని దేవాలయాలే భాండాగా రాలు. శృంగారం గురించి దాపరికాలు లేకుండా బాహాటంగా, స్వేచ్ఛగా, శాస్త్ర - క ళా రూపాల్లో ప్రపంచానికి అందించిన కామ విశ్వవిద్యాలయమిది. చందేలా హోటల్లో బస. చిన్న విమానాశ్రయం నుండి పదిహేను నిమిషాల్లో హోటల్ ముంగిట్లో రిసెప్షన్ డెస్క్‌తో చెక్ ఇన్ పనులు పూర్తిచేసి, కేటాయించిన గదివైపు నాలుగు పాదాలు వడివడిగా అడుగులు వేశాయి. ఆలోచనలు, చేష్టలు, కోరికలు, ఆడా-మగల మధ్య సహజంగా ఉండే ఆక ర్షణలు అన్నీ ఇప్పుడు 36 అధ్యాయాల్లో విపులీకరించిన 1,250 కామసూత్రాల వశంలో ఉన్నాయి. ఉపగ్రహాలని గగనం లోకి ప్రయోగించాక వాటి కంట్రోల్స్ అన్నీ శ్రీహరికోటలోనో? బెంగళూరులోనో? ఉన్నట్టుగా, హనీమూన్ జంటలు కామసూ త్రాల కంట్రోల్స్‌లో ఉంటూ ఉపగ్రహంలా ఊగుతూ ఖజురహో కక్ష్యలో పరిభ్రమి స్తుంటాయి.

కిరణ్ ఒక గైడుతో బేరం చేస్తున్నాడు. గైడ్ తన ఐ-కార్డు చూపుతూ ప్రభుత్వమే ఫిక్స్ చేసిన ఛార్జీల పట్టిక చూపాడు. పరి శీలించి ఓకే అన్నాడు కిరణ్.

ఏళ్లనుండి పనిచేస్తూ ఎన్నో వేలమంది పర్యాటకులని ముగ్ధుల్ని చేసిన అనుభవశా లైన గైడ్ పర్యాటకుల 'కేటగిరి'ని వారితో మాట్లాడిన రెండు నిమిషాల్లో పట్టేస్తాడు.

ప్రభకి స్నేహితురాలి అత్తగారిచ్చిన ఉచి

తసలహా గుర్తొచ్చింది. వెంటనే గైడ్‌కి తెలియకుండా తెలుగులో కిరణ్‌కి చెప్పింది.

"కిరణ్! గైడ్‌తో అన్ని వివరాలని సమగ్రంగా చెప్పమను. హనీమూన్ జంటలకి కేవలం కామసూత్ర వరకే పరిమితం చేసి తొందరగా తమ పనిని కానిచ్చి ఇంకో కస్టమర్ వేటలో పడతారట. మనం ఏ మాత్రం తొందరపాటు చూపకుండా రేటు ప్రకారంగా పూర్తి సమయాన్ని ఉపయోగించుకుందాం"

"ఓకేరా..సా!"

"గుడ్..కీ!"

"కీ... సా... సా... కీ...." ఇద్దరు శ్రుతిలో ఒక్కసారే నవ్వుకున్నారు.

హనీమూన్ యాత్రలో ఒకరోజు ప్రభ "కిరణ్! ఇప్పటినుండి నిన్ను 'కీ' అని పిలుస్తాను" అంది.

ఆశ్చర్యంగా చూస్తూ కిరణ్ 'ఏంటి విషయం?' అన్న అర్థం వచ్చే రీతిలో కళ్లెగరేశాడు.

"చూడు! ఇది ఎస్సెమ్మెస్ యుగం. పదకొండో అవతారం. నిన్ను 'కిరణ్' అనో, 'కిర్రు' అనో గాక 'కీ' అనే పిలుస్తాను"

"నువ్వేలా పిలిచినా ఓకే! కానీ ఎప్పుడు పిలిచినా ప్రేమగా మాత్రం పిలువు"

'కీ' ని సాగదీసి ప్రేమని ఒలకబోస్తూ 'కీ...' అని గారాలు పోయింది.

ఇద్దరు నవ్వుకున్నారు. చిలిపిగా చూసుకున్నారు. అప్పటి నుండి ఒకరిపై ఒకరికి అమితమైన ప్రేమ ఆవరించినపుడు, 'కీ..' 'సా..'లతో పిలుచుకుంటారు.

గైడ్‌తో క్లుప్తంగా పరిచయం చేసుకున్నారు. తన పేరు చెప్పాడు. ఉత్సుకతతో



ఎదురుచూస్తున్న యాత్ర మొదలయింది.

"వెయ్యేళ్ళకి మించిన వారసత్వ సంపద. మనదేశం గర్వించే మహోన్నత చరిత్ర. చందేలా రాజవంశీయులు మానవాళికిచ్చిన అపూర్వ కానుక. వెల కట్టలేం! దేవాలయాలు మన దేశమంతా విస్తరించి ఉన్నాయి. ఈ ప్రాంత దేవాలయాలు మాత్రం చాలా ప్రత్యేకం. ఎంతో భిన్నం" గైడ్ తన సేవకి శ్రీకారం చుట్టి కొనసాగించాడు.

"ఇక్కడ గడపడానికి మీకెంత సమయముంది? మీరు తొందరలో ఉంటే ముఖ్యమైనవి చూపి క్లుప్తంగా చెబుతాను" ఇద్దరి వైపు చూస్తూ గైడ్.

"ఈ ప్రదేశం చూడ్డానికి హైద్రాబాద్ నుండి వచ్చాం. తొందరేమీ లేదు. దినమంతా దీనికోసమే! షార్ట్ కట్ లేకుండా వివరంగా చెప్పు" ప్రభ చెప్పిన మాటల్ని గుర్తుంచుకొని కిరణ్ ఆమె వైపు చూసి కన్నుగీటాడు. మెచ్చుకోలుగా చూసి కళ్ళతోనే 'గుడ్' సంకేతాల్ని వదిలింది.

"వెరీగుడ్! ఓకే! అన్ని విషయాలని సవివరంగా చెబుతాను" వారి 'లెవల్ ఆఫ్ ఇంట్రెస్ట్' గైడ్‌కి అర్థమయ్యింది. మరింత చరిత్ర పుటల్ని తిరగేస్తూ లక్ష్మణ దేవాలయానికి తీసుకొచ్చాడు.

"మొత్తానికి ఎనభై దేవాలయాలని నిర్మించారు. చాలామటుకు శిథిలమైపోయాయి. ఇప్పుడు ఇరవైరెండు మాత్రమే మిగిలాయి. వాటిలో కొన్ని మరమ్మతులు, పునర్నిర్మాణ దశల్లో ఉన్నాయి. ఇక్కడున్న



దేవాలయాల్లో, అన్నిటికన్నా పెద్దది, ప్రముఖమైనదీ ఈ లక్ష్మణ దేవాలయమే! దీంతో మనం మొదలుపెడదాం. మీకు ఎక్కడ ఫొటోల్ని తీయాలో చెప్పండి, తీస్తాను" సహాయాన్నందిస్తూ గైడ్.

ఆకాశం నిర్మలంగా ఉంది. కాలుష్యం కానరాని ఆ చిన్న పట్టణంలో సూర్యకిరణాలు ప్రతి దేవాలయపు వంపుసొంపుల్లోకి చేరి సందర్శకులకి మనోహరంగా కనబడేట్టు చేస్తున్నాయి. ముప్పై ఎకరాల విస్తీర్ణంలో ముచ్చటగా ముస్తాబైన దేవాలయాల సమూహం అక్కడి ప్రకృతి సంపదతో కనువిందుచేస్తున్నాయి.

"థాంక్యూ! సెల్ఫీలు కూడా తీసుకుంటాం"

"తప్పకుండా! టేక్ యువర్ టైమ్. రెండుమూడేళ్ల నుండి మాకు పని తగ్గింది. సెల్ఫీ టెక్నాలజీ మన జీవితాల్లో ప్రవేశించాక ఎవరి ఫొటోలని వాళ్లే తీసుకుంటున్నారు వారివారికిష్టమైన భంగిమల్లో" గైడ్ ముసిముసిగా నవ్వుతూ అన్నాడు.

గైడ్ మాటల్ని వినగానే కిరణ్-ప్రభలూ నవ్వారు. 'కాస్సేపట్లో మేం చేసే పని కూడా అదే' అన్న అర్థం ఆ నవ్వులో ప్రస్ఫుటంగా కనబడింది.

అప్పటికే ఆ మాటా, ఈ మాటా ముచ్చటించాక గైడ్‌తో మంచి స్నేహం మొదలయ్యింది. వయస్సు ముప్పై ఐదు - నలభైల మధ్య ఉండొచ్చేమో! వయస్సు సంబంధిత దాపరికాలు లేకుండా గైడ్‌తో స్వేచ్ఛగా మాట్లాడొచ్చు

"ఒకమాట అడగనా? " గైడ్.

"తప్పక! జరూర్ అడుగు" కిరణ్.

ఆశ్చర్యంతో ప్రభ ఇద్దర్నీ చూసింది.

"మీరు ఖజురహో ఎందుకొచ్చారు? "

సూటి ప్రశ్న! లిప్తపాటు కాలంలో ఆలోచనలని రేకెత్తించింది.

తేరుకున్నాడు కిరణ్.

"రెండువారాల క్రితం పెళ్లిచేసుకున్నాం. హనీమూన్లో ఇదో భాగం. ఖజురహో గురించి చాలా విన్నాం. అందుకే వచ్చాం"

"ఇది అసంపూర్తి సమాధానం. నిజమైన జవాబు కాదు. ఇంకేదో ఉంది. మీలాంటి వారిని మేం రోజూ డీల్ చేస్తుంటాం. మెజారిటీ ఇలాటి సమాధానాల్నే చెబుతారు. అసలు విషయం చెప్పరు"

ఈ ప్రశ్నని గైడ్ తన కస్టమర్లందరినీ అడుగుతాడు. రకరకాల జవాబులు విని బాగా జీర్ణించుకున్నాడు. ఇద్దరూ సీరియస్‌గా ఆలోచనల్లో పడ్డారు.

"దేవాలయాలపై చెక్కిన శిల్పాల గురించి విన్నాం. రతిక్రీడల గురించి, విభిన్న భంగిమల గురించి, ఈ స్థలానికున్న ప్రచారం విని, చదివి ఆసక్తిగా చూడ్డానికి వచ్చాం. పెళ్లయింది కాబట్టి ఈ ప్రదేశాన్ని స్వేచ్ఛగా చూసే అర్హతని సంపాయించాం" మొహమాటం లేకుండా చెప్పాడు.

కిరణ్ జవాబు ఇవ్వడం మొదలుపెట్టకముందు ప్రభ కాస్త దూరంగా జరిగింది.

"థాంక్యూ సర్! ఇక్కడికి మీరెందుకు వచ్చారో సూటిగా చెప్పినందుకు మరోసారి మీకు థాంక్స్! మీరు చెల్లించే ప్రతి రూపాయికి నా సేవల్ని అందిస్తాను. మీరు పూర్తి సంతృప్తితో ఈ ప్రదేశాన్ని చూసివెళతారని ఆశిస్తాను రండి మేడమ్! సార్ పక్కకి రండి.. వినండి"

ప్రభ కిరణ్ సరసన చేరింది. ఇద్దరూ గైడ్ వైపే దృష్టిని సారించారు.

"ఇది పశ్చిమ దేవాలయాల సముదాయం. ఇలా తూర్పు, దక్షిణ సముదాయాలుగా దేవాలయాలని భౌగోళికంగా విభజించారు"

ప్రభ తన బ్యాగ్‌లోంచి ఓ మడతలున్న పటాన్ని తీసి విప్పింది. అది ఖజురహో పట్టణంలోని దేవాలయాల స్థలాలని చక్కగా చూపుతున్న పటం. ఆరు చేతులు పటాన్ని గాలిలో అడ్డంగా పరచి చూస్తుంటే గైడ్ దేవాలయాల స్థలాలని స్పష్టంగా

చూపాడు. పటాన్ని తెచ్చినందుకు అతడు మెచ్చుకోలుగా ప్రభవైపు చూశాడు.

గైడ్ వివరిస్తుంటే ప్రభ -కిరణ్‌లకి ఖజురహోలోని అన్ని దేవాలయాల గురించి స్థూలంగా అవగాహన కలిగింది.

మెల్లగా కదులుతున్నారు.. ఆగుతున్నారు.. కదులుతున్నారు. శిల్పసౌందర్యాలని గ్రోలుతున్నారు. శిల్పాల మొహాల్లో కనిపించే భావప్రకటనలని క్షుణ్ణంగా పరిశీలిస్తున్నారు. కళ్ళు అటూఇటూ, పైకి, కిందికి వేగంగా కదులుతున్నాయి. అంతటి అయస్కాంత శక్తులని శిల్పులు ఎలా ఇమిడ్చారో అంతుపట్టకుండా ఉంది ఇద్దరికీ!

"ఇక్కడి శిల్పకళ ఉన్నతస్థాయిలో ఉండడానికి ప్రధానకారణం శిల్పులు ఉపయోగించిన 'కైముర్' అనే ఇసుకరాయి. శిల్పులకిదొక వరం. మంచి ముడిసరుకు. వారి వారి కళాసొగసులని చూపడానికి ఈ ప్రకృతి వనరు తోడైంది. రాయి మృదుస్వభావం శిల్పులకి మట్టిముద్దలా సహకరించింది. సూక్ష్మాతి సూక్ష్మమైన వివరాలని కూడా తమ నైపుణ్యాలతో అవలీలగా చూపారు. మనుషుల అంగాలు, గోళ్ళు, వెంట్రుకల పాయలు, వంపులు సొంపులు, ముఖాలపై స్పష్టమైన భావప్రకటనలు.. పనితనంలో పతాకస్థాయి కనబడుతుంది. దీన్ని మీరు మెచ్చుకోవాలి" ఆవేశంలో గైడ్. రాజస్థాన్ నుండి వలసవచ్చి మధ్యప్రదేశ్‌లో చిన్న పట్టణమైన ఖజురహోని ఆవాసం చేసుకున్న ఆయన మాటల్లో ప్రాంతీయ అస్తిత్వమూ తొణికిసలాడింది.

ఇద్దరూ మంత్రముగ్ధులై కళ్లని దేవాలయాల బాహ్య సొగసులని చూడ్డానికి అంకితం చేశారు. వివిధ కోణాల్లో అటు-ఇటు ఉత్సాహంతో అడుగులేస్తూ క్షణాల్లో విడిపోయి విడివిడిగా చూసుకుంటూ, మరీ ఆకర్షించినచోట్ల జోడీగా చూస్తూ, చర్చించుకుంటూ దృష్టిని పూర్తిగా దేవాలయాల సౌందర్యాలతో నింపేసుకుంటున్నారు. ఆనందడోలికల్లో విహరిస్తున్నారు.

## కొత్తగాలి...

**నింగికెగసిన ఉపగ్రహాలు**
**అలంకరించాయి**
**భరతమాత కీర్తికిరీటంలో**
**మరిన్ని కలికితురాళ్లు!**

– పి. చంద్రిక,
ఖమ్మం

"ఇలా రండి! ఈ సుందరమైన శిల్పాన్ని చూడండి. మొహంలో భావాల్ని వ్యక్తపరుస్తున్న తీరుని జాగ్రత్తగా పరిశీలించండి. అంగాల్ని, ఆభరణాలని గమనించండి! జీవం ఉట్టిపడే శిల్పాలు అనడం కన్నా, జీవముండి కదలని మూర్తులా అన్న భ్రమ కలుగుతోంది కదా!"

గైడ్ ఆపలేదు. కొనసాగించాడు.

"..అటు చూడండి! ఆమె మొహంలో భావాలు ఎంత స్పష్టంగా కనబడుతున్నాయో! చేతులు లేచి ఉన్న తీరు పరిశీలించండి. ఎక్కడా కూడ శిల్పులు రాజీపడకుండా సందర్శకులకి కనబడని వెనక భాగాలని కూడా ఎలాటి దాపరికం లేకుండా అన్నివైపుల నుండి చూసేలా సర్వాంగ సుందరంగా చెక్కి శిల్పకళా ప్రమాణాల్లో ఉన్నతస్థానం సంపాదించుకున్నారు"

"నిజమే కిరణ్! చూడు! ఎక్కడా లోపాల్లేకుండా ఎంత బాగా చెక్కారో!" శిల్పకళని ప్రశంసిస్తూ ప్రభ.

కిరణ్ ఫొటో -షూట్ మొదలుపెట్టాడు. శిల్పచాతుర్యాన్ని, అంగ సౌందర్యాన్ని క్లోజప్పుల్లో నింపేస్తున్నాడు. హోటల్ కెళ్ళాక ప్రభతో పంచుకోవాలన్న ఉత్సాహం మిళితమై భంగిమలని తనకి నచ్చిన కోణాల్లో తీస్తూనే ఉన్నాడు. ఉత్తేజపూరిత వాతావరణాన్ని చూసి కెమేరా బ్యాటరీ తనంతట

తానే పవర్ని స్విచాఫ్ చేసుకుంది.

"కిరణ్! మనం వచ్చింది కళ్ళారా చూడ్డానికి. నువ్వేమో హైపర్ హుషారుతో లెన్సుల్లోంచి చూస్తున్నావ్. మొదట కళ్ళ నిండా చూడు. ఆ తర్వాత ఫొటోలని నీ 'ఇష్టమైన' రీతిలో తీద్దువుగాని"

"ఇష్టమైన పదం నొక్కి పలికినందుకు మనం గర్వపడాలి!" ఓ శిల్పంవైపు ఫోకస్ చేస్తూ, సరైన కోణం కోసం అటూ- ఇటూ కదులుతూ జవాబిచ్చాడు.

కిరణ్ మానసికస్థితిని గమనించిందామె. ఆ సమయంలో ఆయనపై తిరుగుతున్న అమితోత్సాహ మేఘాన్ని చూసింది. ఫొటోల్ని తీస్తూనే ఉన్న 'స్మార్ట్ హబ్బీ' చురుకైన కదలికల్ని తన స్మార్ట్ ఫోన్ హృదయంలో నింపేసుకుంది.

కాళ్ళు మెల్లగా అడుగులేస్తున్నాయి. కనుచూపు మేరలో శిల్ప సౌందర్య సముద్రం. చూపులని దేవాలయాల పునాదుల నుండి శిఖరాల వరకు కదిలిస్తూ పోతే దూరపు కొండల్లానే కనబడతాయి. చూపులు అడ్డంగా, నిలువుగా దేవాలయాలకున్న అయస్కాంత బలాల్ని పట్టి నిరంతరం కదులుతూనే ఉన్నాయి. చూపుల్ని నిలకడగా ఉంచడం ఒక పెద్ద సవాలే! కదలికలున్నట్టుగా భ్రమ కలిగించే కామక్రీడలు. ఆనందఘడియల్లో మంత్రజలం చల్లగానే ప్రేమికులు బొమ్మలైపోయినట్టు ..

గైడ్ బోధన ఆపాడు. చిన్న బ్రేక్.

కామక్రీడల పేజీలని తిరగేయడం మొదలుపెట్టిన కిరణ్-ప్రభలకి ఇదొక వింత లోకం. రకరకాల భంగిమలతో రతీక్రీడల శిల్పాలు నూతనోత్సాహాన్ని నింపుతున్నాయి. మధురమైన ఆలోచనలు. పెదిమలపై చిరునవ్వులు. ఇద్దరిమధ్యా చిలిపి చూపులు. హోటల్‌కి ఎప్పుడెప్పుడు చేరుకుంటామా అన్న అల్లరి కోరికలు..

"దీన్ని చూడండి! ఇది చాలా ప్రచారంలో ఉన్న ఫొటో! ఖజురహోపై వచ్చిన ఎక్కువ శాతం పుస్తకాల్లో ఈ ఫొటో తప్పక కనబడుతుంది. బాగా పరిశీలించండి. కోతిపిల్ల వెంటబడితే ఆ సుందరి భయంతో ప్రియున్ని ఎలా వాటేసుకుందో! ఆ సౌందర్యవతి మొహంలో సున్నితమైన భయం, లాలన, రతిక్రీడ జరుగుతున్నప్పుడు చూడకూడదని చేతులని మొహంపై కప్పుకొన్న స్త్రీ, ప్రియుడి మెడ చుట్టూతా వేసిన రెండుచేతులు, నాకిపుడు ఎలాటి భయం లేదన్న భరోసా! ఈ శిల్పంలో కనబడుతున్న హావభావాలని ఎంత గొప్ప నటి కూడా ప్రదర్శించలేదు" తన్మయంగా చెప్పాడు గైడ్.

"నిజమే! గైడ్ ఇంత విపులంగా చెప్పకపోతే మనం ఈ భావాల్ని గ్రహించేవాళ్లమా? " ఇద్దరూ ఆ శిల్పాన్ని పరీక్షగా చూస్తూనే అనుకున్నారు.

"చాలా బాగుంది. నువ్వు చెప్పింది అక్షరాలా నిజం"

"కళ్ళకి కాటుక అద్దుకుంటున్న ఓ సుందరి, అరికాలిలో గుచ్చుకొన్న ముల్లుని తీసేటప్పుడు మరో సుందరి మొహంలో కనబడే చిన్నిబాధ! బద్ధకంగా లేచి ఒళ్ళు విరుచుకునేటప్పుడు చేతులు వెనకవైపు ఎలా ఉంటాయో, మొహంపై ఉదయం పూట కనబడే ఛాయలు! ఇంకో మగువ.. అద్దంలో చూసుకుంటూ అలంకరించుకోవడం.. శరీరంపై ప్రియుడి గోర్లు వదిలిన ముద్రల్ని చూపడం... ఇంకా.. ఇంకా... ఎన్నో... ఎన్నెన్నో..." గైడ్ మరికొన్ని అందాల గురించి, శిల్పుల ప్రతిభని ఆసక్తికరంగా వర్ణించి చెప్పాడు.

".. ఎలా చేయగలిగారు.. స్త్రీల శరీరాలు, విభిన్న కదలికల్లో శరీరాంగాలు, వైవిధ్యమైన భావాలు.. వీటన్నిటిని శిల్పులు క్షుణ్ణంగా అర్థం చేసుకుంటే తప్ప ఇంతటి గొప్ప శిల్పసంపదని సృష్టించలేరు. మనం శిల్పుల పనితనాన్ని మెచ్చుకతప్పదు" కిరణ్ గైడ్ పక్కనే నడుస్తూ అన్నాడు.

"మీ పరిశీలన వందశాతం కరెక్ట్! నిజ జీవితంలో స్త్రీ, ముఖ్యంగా స్త్రీ శరీరం గురించి సంపూర్ణ అవగాహన లేనివారు జీవముట్టిపడే శిల్పాలని చెక్కలేరు. అది అసాధ్యం. ఎంతో పరిపక్వత, ఏకాగ్రత, రాయిని చెక్కేటప్పుడు ఉలి సుత్తిలపై పూర్తి నియంత్రణ అవసరం. భావప్రకటనలని మొహాలపై తీసుకురావడం అతి క్లిష్టమైన పని. ఇంతటి ఉన్నతశ్రేణి శిల్పకళ పదో శతాబ్దంలోనే మనదేశంలో ఉండేదంటే మనందరం గర్వపడాలి"

ఆసక్తికరమైన చర్చల మధ్య గైడ్ ఒక దేవాలయం నుండి మరోదానికి. మరోదాని నుండి ఇంకోదానికి.. చూపుతూ తన సేవని పర్యాటకుల అభిరుచి, అడిగే ప్రశ్నల లోతులని బట్టి కొనసాగించాడు.

ఇద్దరి మస్తిష్కాల్లో రకరకాల ఆలోచనలు. హనీమూన్‌కి వచ్చిన జంటలకి బహిరంగంగా బోధించే కామక్రీడల శిల్పాలు. ఆ ప్రదేశమంతా ఆవరించుకున్న వాత్సాయనుడి కామసూత్రాల మత్తు. శిలలవెనక సుందరాంగులు దాగుండి నవరసాలని ఒలకపోస్తున్నారా? అని భ్రమ కలిగించే శిల్ప చాతుర్యం! ఇంతటి విలువైన సంపదని ముందు తరాలకి వదలిన పాలకులు.. వేయి సంవత్సరాల నుండి ప్రకృతి, మానవ చర్యలకి తట్టుకొని పటిష్టంగా నిలిచి ఉన్న కట్టడాలు.. అప్పటి పాలకుల ఆలోచనా విధానాలు.. దేవాలయాలని ముఖ్యకేంద్రాలుగా అభివృద్ధి చేసి మానవజీవనాన్ని పరిపూర్ణం చేయడం.. మూసిన గదుల్లో రహస్యంగా జరిగే కామక్రీడల్ని శిల్పాల్లో బంధించి దేవాలయాల గోడల్లో గోపురాల్లో ప్రస్ఫుటంగా వచ్చినవారందరికీ సూత్రాలుగా ఉంటూ నడిపించడం.. మౌనంగా ఇద్దరు ఆలోచిస్తూ అడుగులు వేస్తున్నారు.

నిశ్శబ్దాన్ని కిరణ్ ఛేదిస్తూ " ప్రభా! సీరియస్‌గా ఆలోచిస్తున్నట్టున్నావ్? "

"చందేలి వంశ పాలకులని మెచ్చుకోకుండా ఉండలేకపోతున్నాను. కామశాస్త్రాన్ని దేవాలయాలపై చెక్కించి ప్రజల్లోకి ఏవిధంగా తెచ్చారో.. అది కూడా పది శతాబ్దాల క్రితం! అప్పటి వారి ఆలోచనలు ఏవో మనం సీరియస్‌గా, లోతుగా చదివితే తప్ప తెలియదు. శృంగార జ్ఞానాన్ని ఈ విధంగా వ్యాప్తిచేయడం, అవగాహన తేవడం నాకు బాగా నచ్చింది. ఇరవై ఒకటో శతాబ్దంలో సెక్స్, సైన్స్‌లో సంతానోత్పత్తి పాఠాలు వచ్చినప్పుడు టీచర్లు క్లాసులో చెప్పకుండా మీరే చదువుకోండని దాటేస్తుంటారు. ఈ విషయాల్ని ఇప్పటికీ గుప్తజ్ఞానంగానే పరిగణిస్తారు"

"ఐ పుల్లీ అగ్రీ విత్ యు! మన సమాజంలో కపటం, నాటకీయత అంతర్భాగమైపోయాయి. శాస్త్రీయదృక్పథాలు లేవు. మూఢనమ్మకాలు రాజ్యమేలుతున్నాయి. సెక్స్ ఎడ్యుకేషన్ ప్రజల్లోకి వెళ్లాలంటే మనదేశంలో ఇంకా ముప్పై- నలభై ఏళ్లు పడుతుందేమో! అంతవరకు.." అని ప్రభని తటాలున ముద్దు పెట్టుకున్నాడు.

గైడ్ పదడుగులు ముందు నడుస్తున్నాడు! రెండున్నర గంటలైంది. యాత్ర చివరిదశకి చేరుకుంది. ఆ ఆవరణలోపల ఇతర కార్యక్రమాల గురించి పరిచయం చేశాడు. ఏటా జరిగే ప్రఖ్యాత డాన్స్ ఫెస్టివల్ గురించి, ప్రతిరోజూ జరిగే లైట్

## కొత్తగాలి... 

**ఫ్రిజ్‌లు వాడితే**
**ఓజోన్ పొరకు తూట్లు!**
**మొక్కలు నాటితే**
**ఓజోన్ పొరకు కుట్లు!**

– అమ్మిన వెంకట అమ్మిరాజు,
పేరూరు, జయశంకర్ జిల్లా



కలతోనే లక్ష్యం ప్రారంభమవుతుంది
కలను సాకారం చేసుకునే శక్తి, సహనం, కోరిక
మీలో ఉన్నాయని గుర్తించినపుడు
నక్షత్రాలను అందుకోవచ్చు ప్రపంచాన్ని మార్చనూ వచ్చు
– డేల్ కార్నెజీ

అక్షరం

అండ్ సౌండ్ షో.. వివరాలు చెప్పాడు. తప్పకుండా షోని రాత్రి చూడమని ప్రోత్స హించాడు.

వేయి సంవత్సరాల వయస్సున్న ఆ ప్రదే శాన్ని నాలుగు పదులు నిండని గైడ్ మూడు గంటలు తిప్పి హైద్రాబాద్ నుండి రెండు వారాల క్రితం పెళ్లాడిన జంటకి ఓ కొత్తలోకం చూపి ఆ ఆవరణ గేట్ దగ్గర తను సెలవు తీసుకున్నాడు.

కిరణ్- ప్రభలు సంతోషంగా గైడ్ చేతిలో టిప్‌గా ఉంచిన మొత్తాన్ని చూసి అతని మొహంలో మహానందం!

లంచ్ ముగించుకొని తూర్పు పశ్చిమ దేవాలయాల సముదాయాలని కూడా చూసి పటంలో ఉన్నవాటినన్నింటిని చూసేశామని నిర్ధారించుకున్నారు. పటం సంతోషంగా ముడుచుకుంది. మడతల్లో ఒదిగిపోయింది. ఆ తరువాత ప్రభ బ్యాగ్ లోకి నాజుగ్గా జారిపోయింది.

లోకల్ షాపింగ్. వరసలుగా చిన్న చిన్న దుకాణాలు. స్థానిక వాసనలు! ఖజురహో గుర్తు కోసం కొన్నింటిని కొని హోటల్‌కి చేరుకున్నారు. రిసెప్షన్ డెస్క్ నుండి కీ తీసుకున్నారు. కుడి-ఎడమ వైపు చూస్తే- అక్కడ కొన్ని షాపులు, స్విమ్మింగ్‌పూల్!

ప్రభ దుకాణాలవైపు అడుగులేసింది. కిరణ్ మొహంలో ఆశ్చర్యం! గదికి తొంద రగా పోవాలన్న ఆతురతని ఆయన మొహంలో ప్రభ ఇట్టే పట్టేసింది. అయినా అటువైపే అడుగువేసి అతన్ని తనతో రప్పించుకుంది. చిరునవ్వుని మొహానికం టించుకున్నాడు!

హాండ్‌బ్యాగ్ చాలా నచ్చితే ప్రభ కొనే సింది. కిరణ్ కోసం ఓ బెల్ట్ కొంది. నడు ముకి పెట్టి చూసింది. వదులుగా ఉంది. రెండు రంధ్రాలని చేయించింది. కిరణ్‌కి బెల్ట్ కలర్ ఎంతో నచ్చింది. 'థ్యాంక్స్! గదికి వెళ్ళాక కానుక ఇస్తా' అని ప్రభ చెవిలో గుసగుసగా చెప్పాడు.

గది తెరిచాడు. పూర్తిగా తెరిచాడో? లేదో? వెంటనే డోర్ వెనకున్న ప్లాస్టిక్ కార్డ్ తీసి డోర్ ముందున్న హ్యాండిల్‌కి పెట్టాడు. 'డోంట్ డిస్టర్బ్' అక్షరాలు చాలా సేపు ఊగి ఊగి నిలిచిపోయాయి.

కిరణ్ చేస్తున్న హడావుడి చూసీచూడన ట్లుగా నటిస్తూ ప్రభ నవ్వుకుంటోంది.

కిరణ్ బోల్ట్‌పెట్టి, డోర్ వెనకాల ఫోజు పెట్టి "మననిక ఎవ్వరూ డిస్టర్బ్ చేయరు. బయట సైనేజ్ పెట్టాను" ప్రకటించాడు.

"ఊహూ... నేను చూ...శా....ను" మాటల్ని సాగదీస్తూ ప్రభ.

గభాల్న వచ్చి ప్రభ ఒళ్ళంతా ముద్దుల తో నింపేశాడు. ఎత్తుకొని, గిరగిరా తిప్పి, కిలకిలా నవ్వుతున్న ప్రభని నాజూగ్గా బె డ్డుపై పడుకోబెట్టి తానూ ఒరిగిపోయాడు. దినమంతా చూసిన రతిక్రీడల భంగిమలే వారి మెదడు నిండా ఉన్నాయి.

సుందరంగా చెక్కిన మిథునం శిల్పాం లోని పురుషుడు- స్త్రీలలో జీవపు కదలి కలు. అన్ని అంగాల్లో కదలికలు.

వాత్సాయనుడి బోధనలు గదినిండా తె మ్మెరల్లా వీస్తున్నాయి. టేబుల్ పైనున్న కామసూత్ర పుస్తకం తనంతటతానే తెరు చుకుంది. పేజీలో కదలికలు..

ఇద్దరి చెవుల్లో ఎవరో రతిక్రీడల సూత్రాలని ఉపదేశిస్తున్నారు. లయబద్ధంగా బయటకి వస్తున్న నిట్టూర్పులు. ఖజురహోలో దేవాలయాలున్న ప్రాంగణంలో వేయి సంవత్సరాల నుండి కదలకుండా రతిక్రీడల్లో శిల్పరూపాన్ని దాల్చిన ఓ జంట మొదటిసారిగా కదిలింది.. అదీ కిరణ్-ప్రభల రూపాల్లో!

ఏ భంగిమను తలచుకుంటూ గదిలో రేగిపోతున్నారో, దేవాలయాలపై ఉన్న ఆ శిల్పాల్లో కదలికలు!!

★ ★ ★

"ఏదో వెలితిగా ఉంది ఖజురహోని వదిలిపోతున్నందుకు. మాటల్లో చెప్పలేకపోతున్నా సా!"

"నాకూ అలాగే ఉంది. ఇంకో రెండురోజులుంటే బాగుండు అనిపిస్తోంది. మనస్సు నిండలేదు. ఈ ప్రదేశంలోని నిర్వచించలేని ప్రణయశక్తుల మహిమ మనపై గాఢంగా ఉంది. పొద్దున లేచి సామాను ప్యాక్ చేయడానికి మనస్సు అస్సలే ఒప్పుకోలేదు"

ప్రభ కుడిచేయి, కిరణ్ ఎడమచేయి 'లాక్' అయ్యాయి. ఇద్దరి తలలూ అనుకూలంగా కుడి- ఎడమలకి సున్నితంగా ఒరిగి ఉన్నాయి. భుజాలూ బుద్ధిగా అతుక్కున్నాయి. ఖజురహో ఏర్‌పోర్ట్‌లో కూచొని ఉన్నారు. కిరణ్ షర్ట్ పాకెట్లో రెండు బోర్డింగ్‌పాస్‌లు అతుక్కొని ఉన్నాయి.

దిల్లీ చేరి అక్కడి నుండి కాఠ్‌మండూ (నేపాల్) ఫ్లైట్‌కి మారాలి.

"మొదటి వెడ్డింగ్ ఏనివర్సరీకి ఇక్కడికే వద్దాం. నీకిష్టమైనన్ని రోజులుందాం. ఈ ప్రామిసే నా గిఫ్ట్!" కౌగిలిలో ఉన్న ప్రభ చేయిని సన్నగా నొక్కుతూ కిరణ్.

"నిజంగా? ప్రామిస్? " ప్రభ ఉత్సాహంతో కిరణ్‌వైపు గోముగా చూస్తూ..

"ఈ ముద్దే ఒట్టుగా పద్దులో రాసుకో" చెక్కిలిపై గట్టిగా ముద్దు ముద్రవేశాడు.

"ఆగాగు! సెల్ఫీ సాక్షిగా ఒట్టు. ఫొటో తీయనీ!" మరింత దగ్గరగా జరిగి చెంప చెంపా తగిలించి సెల్‌లో రెండు మొహాలని ఒకటిగా బంధించిందామె.

క్షణాల్లో జరిగిన ఈ క్రియలన్నింటితో ప్రభ నవ్వుకుంది. కిరణ్ నుండి వెలువడిన కిరణాలు ప్రభ మొహాన్ని మరింత ప్రకాశవంతం చేశాయి.

"థ్యాంక్యూ కిరణ్! ఎంత బిజీగా ఉన్నా మొదటి ఏనివర్సిరీకి ఇక్కడికి తప్పక వద్దాం! ఐలవ్‌యు కీ" ఉద్వేగంతో ప్రభ.

సీట్లు నిండుతున్నాయి. అన్ని రంగుల్లో జాతీయ, అంతర్జాతీయ మనుషులు. ఖజురహో శిల్పసంపద వెనకున్న రాజులు.. రాణులు.. కళాకారులు.. ఈ పట్టణాన్ని నిర్మించిన శ్రామిక వర్గం- అందరూ సమిష్టిగా వదిలిన ఈ సంపద మానవాళిని తరతరాలుగా రజింపచేస్తోందన్న విషయాన్ని ఎలా తెలిపేది? తాను రచించిన కామసూత్ర విశ్వంలో ఎంతటి ప్రాచుర్యం పొందిందో! ఎన్ని భాషల్లోకి అనువదింపబడిందో! భారతదేశానికి ఎంత పేరు తెచ్చిందో! వాత్స్యాయునిడికెలా తెలుపుతాం?

విమానం టేకాఫ్ ప్రకటన! ప్రభ బరువెక్కిన హృదయంతో కిటికీలోంచి చివరిసారిగా దృశ్యాల కోసం ఆసక్తితో వెతికి వెతికి చూస్తోంది. కిరణ్ కూడా కిటికిలోంచి చూడ్డానికి తలని వంచాడు.

టైర్లు రన్‌వేకి గుడ్‌బై చెప్పి విమానం పొట్టలోకి దూరిపోయాయి. విమానం బరువుని మోసే బాధ్యత నుండి వాటికి విశ్రాంతి. గాలిలో ఉన్నంతసేపు ఎంచక్కా కడుపులో దాగుంటాయి కంగారు జంతువు కడుపులో పిల్లలా!

కనిపించేంతవరకు ఖజురహోని చిన్ని కిటికీలోంచి చూశారు. దృశ్యం క్రమేణా మసగ్గా మసగ్గా.. అదృశ్యం! నిట్టూర్పుతో ఇద్దరూ సీట్లలో ఒరిగిపోయారు. విమానం హస్తినాపురం దూసుకుపోతోంది.

ఐదు గంటలు గడిచాయి.

ఢిల్లీలో ఫ్లైట్ మారారు. ప్రభా- కిరణ్ లకి ఇది మొదటి అంతర్జాతీయ ప్రయాణం. వీసాలేని విచిత్ర ప్రయాణం పొరుగున ఉన్న చిన్నిదేశానికి. స్నేహితుడు చెప్పిన మాటలు గుర్తుకొచ్చి ప్రభకి చెప్పాడు. ఎలాటి మబ్బులు లేక, ఆకాశం నిర్మలంగా ఉండి ప్రకాశవంతమైన సూర్య కాంతి ఉంటే హిమాలయశ్రేణులు చక్కగా కనబడతాయని. సూర్యకాంతులు మంచు పర్వతాలపై పడి వెండిలా మెరిసిపోతాయని చెప్పిన సంగతి గుర్తుకొచ్చింది.

ఏప్రిల్ 23, 2015. సూర్యకిరణాలు మొదటి ముద్దుల్ని మేఘాలకివ్వకుండా నేరుగా నేలవైపు దూసుకుపోతున్నాయి.

పైలట్ ప్రయాణికులకు విష్ చేసి హిమాలయ పర్వతాల శ్రేణి చక్కగా చూడవచ్చని సూచించాడు. అప్పటివరకు ప్ర యాణికులు అనుకూలతని బట్టి సీట్లలోం చి కిటికీల ద్వారా చూస్తున్నారు. పైలట్ సూచనతో అందరిలో ఒక్కసారే ఉత్సాహం, దృశ్యాల్ని చూసేందుకు హడావుడి! కళ్లతో కొందరు, కెమేరా కళ్లతో కొందరు, కిటికీ పక్క సీట్లో గాఢనిద్రలో కొందరు..!

అదొక అద్భుత దృశ్యం. మంచుకొండలపై వెచ్చని సూర్యకిరణాల వర్షం. కంటికి కనిపించకుండా సరళరేఖల్లా కురిసే తడి లేని ధారలు, ప్రకృతి సంపర్కంతో పర్వతాలు మెరసిపోతున్నాయి.. వెండి పట్టీని ఆరబెట్టారా అన్నట్టు!

విమాన వేగంలో కొండకొనల అందాలు చిత్రవిచిత్రంగా కనిపిస్తున్నాయి. కదిలే విమానంలోంచి పాతుకుపోయిన పర్వతాల సోయగాలని చూస్తామనుకునేంతలో దృశ్యాలు కనుమరుగవుతున్నాయి. నిరుత్సాహం.. నిట్టూర్పు....కింది నుండి పర్వతాలు ఎద్దేవా చేస్తూనే ఉన్నాయి!

విమానం కాఠ్‌మండు ఏర్‌పోర్ట్‌లో దిగింది. చిన్నదేశానికి తగిన సైజులో అది ఉంది. లగేజ్ అందుకొని ఎదురుచూస్తున్న డ్రైవర్ని కలుసుకున్నారు. కారువైపు ఆరడుగుల కదలికలు.

హోటల్లో 'చెక్ ఇన్' పూర్తిచేశారు. కాఠ్‌మండూలో నాలుగు రాత్రులు మకాం. హనీమూన్లో చివరి ఘట్టానికి శుభారంభం. విదేశంలో చిత్రవిచిత్ర తీపి అనుభవాల లోకంలోకి అడుగుల కదలికలు.

ప్రభా- కిరణ్ గుండెల్లో పెరిగిన లబ్-డబ్ కదలికలు.




ఖజురహో ఛాయలు, కామసూత్ర పాఠాలు, దృశ్యాలు- అన్నీ వారినంటుకునే నేపాల్లో ప్రవేశించాయి. గదిలోకి దూరిన తాజా జంట తెల్లారి బ్రేక్‌ఫాస్ట్ సర్వీసు మూసేసే వరకు కూడా బయటకు రాలేదు. గది తలుపు బయట తగిలించిన మూడు పదాల 'డు నాట్ డిస్టర్బ్' కార్డ్ ఎవ్వరినీ తలుపు దగ్గరికి రానివ్వడంలేదు!

ఏప్రిల్ 24, 2015

"మనం గడియారాల్లో టైమ్ సవరించాలి" ప్రభ వాచ్ తీస్తూ అంది. కిరణ్‌కి అర్థంకాక ఏమిటన్నట్లు ప్రభవైపు చూశాడు.

"నేపాల్ మన దేశపు కాలమానానికి పదిహేను నిమిషాలు ముందు.. వెర్రి కన్నా! నీ వాచ్ కూడా సవరించుకో!"

"అంతేనా! పదిహేను నిమిషాలేగా! మనం అంత నిక్కచ్చిగా చేసే పనులేమీ లేవుగా! అందులో హనీమూన్ జంటకి

కచ్చితమైన టైమ్ అవసరమా? మనమసలు వాచీల వైపు చూడొద్దు" కిరణ్ కొంటె కామెంట్.

"పదిహేను నిమిషాలనకుండా పోనీ తొమ్మిది వందల సెకన్లంటే నీకు నచ్చుతుందా? నీ దృష్టిలో సంఖ్యలు పెద్దగా ఉండాలనుకుంటా? ఇలా ఇవ్వు! నేనే సరి చేసిపెడతాను" గడియారాన్ని తీసుకుని ఇద్దరి గడియారాల్లో పదిహేను నిమిషాల కాలాన్ని ఠక్కున వెనక్కి తోసేసింది.

దినమంతా టూరిస్ట్ ప్రదేశాలన్నీ తిరిగి సాయంత్రం 'తమేల్' ప్రదేశానికి చేరుకున్నారు. టూరిస్టులని బాగా ఆకర్షిస్తూ, కాఠ్మండూలో బిజీగా ఉండే ప్రదేశమది. అన్నిరకాల అవసరాలకి, షాపింగ్‌లకి వసంధైన చోటది. రెస్టారెంట్లు, హస్తకళా సామగ్రి, పుస్తకాల దుకాణాలు, బట్టలు, మత్తుమందులు, ఫాషన్ నగలు, సెక్స్ వర్కర్లు.. ఇంకా.. ఇంకా..!

ఇండియన్ కరెన్సీ నేపాల్లో హాయిగా చెల్లుతుంది. వ్యాపారులు ఇండియన్ కరెన్సీని కళ్లకద్దుకుని తీసుకుంటారు.

ప్రభ- కిరణ్ ఓ హ్యాండిక్రాఫ్ట్ దుకాణంలో తీరిగ్గా వస్తువులని పరిశీలిస్తున్నారు. ప్రభ జ్యూయలరీ చూస్తోంది. హైద్రాబాద్‌లో మామూలుగా కనబడే వాటికన్నా భిన్నంగా ఉండడంతో దృష్టిని ఆకర్షించాయి. వెరైటీ ఎంతో నచ్చింది. ధరలని చూసింది. ఖరీదనిపించాయి. కొంచెం నిరుత్సాహమనిపించింది. కిరణ్ దగ్గరగా జరిగి ధరలెక్కువని ఫిర్యాదు చేసింది.

"సిల్లీగర్ల్! ఇది ఇక్కడి కరెన్సీలో రాశారు. మనదేశపు కరెన్సీలో ఇది తగ్గిపోతుంది. ఇపుడే కరెక్టుగా చెబుతాను. ఒక్క నిమిషం..! " కౌంటర్ వైపు అడుగులేశాడతను నవ్వుతూ.

"మన వంద రూపాయలు, నేపాల్లో నూట అరవై రూపాయలతో సమానం. ఇప్పుడు ధరలెలా ఉన్నాయో చెప్పు!"

"ఎక్స్‌ఛేంజి రేటు బాగానే ఉంది. ధరవాలేదు. కొన్నయితే చవకగా అనిపిస్తున్నాయి ఇపుడు" ప్రభలో ఉత్సాహం!

ఆ ఊపులో కొత్తపోకడలతో మార్కెట్లోకి దూసుకువస్తున్న ఫాషన్ జ్యూయలరీని సర్వే చేస్తూ ప్రభ చాలాసేపు అక్కడ గడిపింది. కిరణ్ ఓపిగ్గా కంపెనీ ఇచ్చాడు. నచ్చిన వాటిని ప్రభ మధ్యమధ్య కిరణ్‌కి చూపుతూ మురిసిపోతోంది. ప్రభ వేటిని బాగా పరిశీలిస్తోందో, ఇష్టంగా చూస్తోందో, తన ఒంటికి పెట్టుకుని అద్దంలో చూసుకుంటోందో కిరణ్ కనిపెడుతున్నాడు. ప్రభకి ఎన్నో నచ్చాయి. చెవులకి, చేతులకి, మెడలో వేసుకునే ఆభరణాల నుండి కాళ్ల పట్టీల వరకు..! పెద్ద షాప్! జ్యూయలరీలో ఏదో కొత్తదనం, ఆకర్షణ లాగుతున్నాయి. బాగా నచ్చినవాటిని కొన్నింటిని మెదడులో నోట్ చేసుకుంది. వాటిని కొనాలన్న కోరిక వాటికే అతుక్కుపోయింది. కొనాలన్న కోరిక ఉన్నా, అంకెలు నిర్ణయాన్ని వెంటనే తీసుకోనివ్వ లేదు. ఎక్స్‌ఛేంజ్ రేటు అనుకూలంగా అనిపించినా, చార్టర్డ్ అకౌంటెంట్ మనస్సు అటుయిటుగా ఊగుతోంది.

కిరణ్ కాస్త దూరం నుండి ప్రభని గమనిస్తున్నాడు. లోలోపల నవ్వుకుంటున్నాడు. జాలిగా కూడా చూశాడు. మరో ఇరవై నిమిషాలు గడిచాయి.

ప్రభ పక్కన చేరి "సెలెక్టు చేసుకున్నావా? వెళ్దామా? " అన్నాడు కిరణ్.

"వీటిని ఇపుడు తీసుకుందాం. వాటిని మాత్రం ఇండియాకి వెళ్లేరోజు వచ్చి మరోసారి చూస్తాను. అప్పుడు ఆలోచించి కొందాం. బాగా నచ్చాయి కానీ ఇప్పుడొద్దు"

"నీ ఇష్టం! గంటన్నర గడిపాం ఇక్కడ. బయటికి చూడు రాత్రయ్యింది. వింటున్నావా? రాత్రయ్యింది" రాత్రి పదాన్ని నొక్కి పలుకుతూ అన్నాడు.

"బ్యాడ్ బాయ్" అంటూ సెలెక్ట్ చేసిన సామగ్రితో కౌంటర్ వైపు అడుగులేశారు.

వెళ్లేముందు కిరణ్ తటాలున వెనక్కి పరుగుతీసి ఓసారి ప్రభ సెలెక్టు చేసి కొనక వదిలేసిన జ్యుయలరీని కళ్లనిండా చూశాడు. బయటకొచ్చాక పరిసరాలని కూడా బాగా గుర్తుపెట్టుకున్నాడు.

మరో రాత్రి కాఠ్‌మండూలో...

★ ★ ★

పర్వతారోహణకి ప్రసిద్ధి నేపాల్. ఏటా వేలల్లో విదేశీయులు ప్రకృతి సౌందర్యాలను తనివితీరా చూడ్డానికి, తమతమ శక్తి సామర్థ్యాలను పరీక్షించుకోవడానికి, నైపుణ్యాలకి పదును పెట్టుకోవడానికి వస్తుంటారు. ఈ 'టూరిజం కర్మాగారం' చుట్టూతా నేపాల్ ఆర్థిక వ్యవస్థ తిరుగుతూ ఉంటుంది.

హిమాలయాల చల్లని చూపు నేపాల్ దేశానికి ఎంతో కీలకం! దక్షిణాసియా ప్రజల్లో నేపాల్‌కి ఒక ప్రత్యేకస్థానంతో పాటు అభిమానం, సాహస పర్యాటకులని పర్వతారోహణ అయస్కాంతంలా ఆకర్షిస్తే, కొత్తజంటలకి, ప్రేమికులకి ప్రకృతి సౌందర్యం ప్రధాన ఆకర్షణ. ఏటా వేల జంటలు మన విశాలదేశంలోని ఎన్నో హనీమూన్ హాట్- స్పాట్‌లవైపు చూడకుండా, మన దేశంలో ఒక రాష్ట్రంగా కనిపించే బుల్లి దేశంవైపు తరలి వెళుతుంటాయి. మరచిపోలేని అనుభూతులతో, అనుభవాలతో తిరిగొస్తాయి.

ట్రెక్కింగ్ చేసి వచ్చినవారు బాగా అలసిపోయి ఆదమరిచి నిద్రపోతున్నారు. హనీమూన్‌కి వచ్చినవారు ఎదలతో ఆడుకుంటున్నారు. ఎక్కడి వారక్కడ హాయిగా, బాధగా, ఆందోళనగా, ఆనందంగా, అన్నిరకాల అనుభూతులతో నిద్రలో ఉన్నారు. కాఠ్‌మండూలో ఉన్న జైల్లో ఛార్లెస్ శోభారాజ్ నిద్రిస్తున్నాడు. పదవీచ్యుత రాజ కుంటుంబం వారు కూడా నిద్రిస్తున్నారు. దినం పనిని శాసిస్తుంది. రాత్రి విశ్రాంతిని స్తుంది. జగమెరిగిన సత్యమే! కాఠ్‌మండూకీ మినహాయింపు లేదు.

రాత్రి నల్లని దారాలల్లుతూ ఉంది. కొన్ని గంటలు గడిచాయి. మా డ్యూటీ మొదలయ్యిందంటూ చంద్రకిరణాలు నేపాల్‌ని మెత్తగా మెల్లగా కప్పేశాయి. ఏప్రిల్ 25వ తేదీ ఉదయించి శనివారపు చొక్కా తొడుక్కుంది.

కాలెండర్లో రెండంకెల గుర్తు! గడియారాల్లో గానుగెద్దుల్లా తిరిగే ముళ్లకి తేడా లేదు. పాతుకుపోయిన అంకెలని తడుముతూ తమతమ గమనాలని బట్టి అంకెల్ని ముద్దాడుతూ పరిభ్రమిస్తూనే ఉన్నాయి.

నేపాల్ ప్రజలు తమ పనుల్లో తేలిపోతున్నారు. సెకండ్ల ముళ్లలా కొందరైతే, మరి కొందరు నిమిషాల ముళ్లలా, మెల్లగా! ఇంకా కొందరు మెల్లగా గంటల ముళ్లలా, కనబడీ కనబడని కదలికలతో ఈ ముళ్లన్నీ సంయుక్తంగా మనుషుల్ని, వారి కదలికలని నియంత్రిస్తూ ఉంటాయి. జీవనయాత్ర అదే! అందులో సుఖమూ ఉంది. దుఃఖమూ ఉంది. జీవన సౌరభమంటే అదే!

కిరణ్ మెల్లగా కళ్ళు తెరిచాడు. ఎనిమిదవుతోంది. ప్రభని చూశాడు. గాఢనిద్రలో ఉంది. మొహం తృప్తిగా, ప్రసన్నంగా కనబడింది. మూసిన కళ్ళపై మృదువుగా ముద్దులు పెట్టి వాష్‌రూమ్‌కి వెళ్ళాడు.

ఫోన్ మోగింది. అదేపనిగా కొంచెం సేపు అరిచింది. అలసి ఆగిపోయింది. ప్రభ నిద్రలోనే ఉంది. ప్రభవాళ్ళ అమ్మ నుండి ఆ కాల్!

కిరణ్ టీమేకర్ దగ్గరికెళ్ళి గరం గరం చాయ్ తయారు చేసుకున్నాడు. కర్టెన్ జరిపి బయటికి చూస్తూ తాగుతున్నాడు. ఎనిమిదిన్నర అవుతోంది. ఒంటరితనం భరించలేకపోతున్నాడు. ప్రభ పక్కకి చేరాడు. మునివేళ్ళతో ప్రభ మొహంపై సున్నితంగా నాట్యమాడించి మెల్లమెల్లగా ఆమెని గాఢనిద్ర నుండి కపట నిద్రావస్థ

లోకి తెచ్చాడు.

కళ్ళు తెరవకుండా చేస్తున్న కపటాన్ని కిరణ్ గ్రహించి తన మునివేళ్ళ నాట్యగతిని పెంచాడు. ఇక నిద్రా నటన ఆపుకోలేక కిలకిలా నవ్వుతూ కళ్ళు తెరచి కిరణ్‌ని గట్టిగా చుట్టేసుకుంది.

"నేను వాష్‌రూంలో ఉన్నప్పుడు ఫోన్ వచ్చింది. నువ్వు నిద్రలో ఉన్నావు. మీ అమ్మ నుండి. బెంగపెట్టుకుందేమో? ఒకసారి మాట్లాడు"

"ఫోనివ్వు! మాట్లాడుతాను. నువ్విలాగే కూచో" కిరణ్‌ఒళ్ళో తలని పెట్టుకొని సెల్ మొహంపై వేలిని నాట్యమాడించింది.

"అమ్మా!" నిద్రమత్తు వదిలించుకొని హుషారు కంఠంతో ప్రభ.

"ఎలా ఉన్నారు? నేపాల్ ఎలా ఉంది? " ఆతురతతో తల్లి.

"రెండురోజులయ్యిందమ్మా! చాలా బాగుంది. హాయిగా ఉన్నాం!"

కిరణ్ గమ్మున కూచోక చిలిపి చేష్టలు మొదలుపెట్టాడు. సంభాషణలో అపశ్రుతి తెప్పించాలని కొంటె ప్రయత్నమతనిది.

ప్రభ ఆనందిస్తూనే మరోవైపు మనసుని కేంద్రీకరించి తల్లితో మాట్లాడుతోంది. అల్లుడి అల్లరి కూతురి ద్వారా చెప్పకుండా చెప్పించాలి అన్నది కిరణ్ పోకిరీ కోరిక. అది జరగకుండా చూడాలని ప్రభ పట్టు!

సంభాషణ ఇంకా.. ఇంకా.. లతో కొనసాగుతూనే ఉంది.

ఒక్కసారిగా ప్రభ గొల్లున నవ్వింది. అందులో మెరుపులాంటి అరుపు. వెంటనే ఫోన్ మొహానికి చేతిని ఆచ్ఛాదించి కిరణ్ వైపు సత్యభామలా కోపంగా చూసింది.

"ఏమైందమ్మా? " సంభాషణలోని ఆనందశ్రుతిని గమనించి విషయాన్ని అర్థంచేసుకుంది ప్రభ తల్లి.

".. టీవీలో ఏదో కార్టూన్ షో! నవ్వాపుకోలేకపోయానమ్మా!"

ఇంతలో కిరణ్ ఫోన్లో కదలికలు. ప్రభ తలని నెమ్మదిగా ఒళ్ళోంచి తీసి, దిండుపై ఉంచి కొంచెం దూరం జరిగాడు.

"అమ్మా!"

"కిరణ్! ఎలా ఉన్నార్రా? ప్రభ ఎలా ఉందిరా? "

'ఇప్పుడు నీపని పడతా చూడు!' అని ప్రభ మనస్సులో అనుకొని తన తల్లికి 'బాయ్' చెప్పేసింది.

సోఫాలో కూచున్న కిరణ్ దగ్గరికి చేరింది. అతని ఎదపై తలని ఆనించి మెడ వెనకాల చేతులని చుట్టేసి కలిపింది. కొన్ని నిమిషాల క్రితం జరిగిన ఎపిసోడ్ పునరావృతం చేస్తోందని గ్రహించాడతను.

"నేపాల్‌కి చేరుకున్నాం. రెండు రోజులయ్యింది. ఇద్దరం బాగున్నామమ్మా! మీరెలా ఉన్నారమ్మా? అందరూ కులాసాగా ఉన్నారు కదూ!"

అప్పటికి నూట ఎనభై సెకన్ల సంభాషణ జరిగింది - తల్లీకొడుకుల మధ్య.

'నీకేమి తక్కువ కాదు కన్నా..' అనుకుంటూ ప్రభ తనవంతుగా అల్లరి మొదలుపెట్టింది. కిరణ్ చేత కూడా సంభాషణని పట్టాలు తప్పించాలని ఆమె కోరిక!

కిరణ్ చాకచక్యంగా "ప్రభ పక్కనే ఉందమ్మా! ఫోన్ ఇస్తున్నా.. మాట్లాడమ్మా!" అనేసి తప్పుకున్నాడు. ప్రభవైపు చూస్తూ వెక్కిరించాడు.

'నీ పని పడతాలే..' అన్న అర్థం వచ్చేట్టుగా అభినయం చేసి సెల్లందుకుంది.

అత్తా-కోడళ్ళ ముచ్చట్లు మొదలయ్యాయి. 'ఫ్రీ టాక్‌టైమ్' స్ఫూర్తితో తీరిగ్గా.. ఇంకా ఇంకా.. చరణాలతో, పల్లవులతో జోరుగా సాగింది.

"వాణ్ణెలాగైనా పశుపతినాథ్ గుడికి తీసుకెళ్ళమ్మా! దర్శనం బాగా చేసుకోండి. వీలైతే మన రెండు కుటుంబాల పేరన అర్చన చేయించు" అని కొత్త కోడలికి తన కొడుకు పగ్గాల్ని అందించింది అత్తాగారు.

"తప్పకుండా అత్తయ్యా! మీరు కూడా

ఓసారి గట్టిగా చెప్పండి. గుళ్ళు, దేవుళ్ళంటే ఎక్కువ ఆసక్తి చూపరు" అని ఫోన్ని కిరణ్ చేతిలో పెట్టి కొంటెగా గిల్లింది.

"ఒరేయ్! కిరణ్! ఇద్దరూ పశుపతినాథ్ గుడికి వెళ్ళండి. ప్రభకి చెప్పాను. అమ్మాయి చెప్పినట్టు విను!"

"అలాగేనమ్మా! తప్పక దర్శనం చేసుకునే వస్తాం" ప్రభవైపు చిరుకోపాన్ని ప్రదర్శిస్తూ సంభాషణని ముగించాడు.

కిలకిలా నవ్వింది ప్రభ.

"ఇంతకీ మనం వచ్చింది కాశీయాత్రకా? లేక హనీమూన్కా!"

"అలా అనకూడదబ్బాయ్! తప్పుకదా! పెద్దల మాటలు కాదనకూడదు కన్నా!" కవ్వింపుగా ప్రభ.

"ఈ గుడి తతంగం చివర్న పెడదాం. మొక్కుబడిగా దర్శనమయ్యిందనిపిద్దాం!"

"కుదరదు చిన్నా! నేను గుడి పరిసరాల నుండి సెల్ఫీలు పంపిస్తానని అత్తయ్యకి మాటిచ్చాను. బుద్ధిగా ఈ దేవి.. నీ దేవి చెప్పినట్టుగా వినాలి స్వామీ!"

దగ్గరగా జరిగి సోఫాలో ఉన్న ప్రభని ఎత్తుకుని బెడ్పైన వదుల్తూ "పశుపతినాథ్కి జై.. ప్రభాదేవికి జై.." అంటూ ఆమె కౌగిట్లో ఒరిగిపోయాడు.

ఇద్దరు నవ్వుకున్నారు.. ఇంకా నవ్వుకున్నారు. బాగా నవ్వుకున్నారు. ఊగిపోయారు. నవ్వుల్లో నలిగిపోయారు.

పదిన్నర టైముని చూసేంతలో సెకండ్ల ముల్లు పరుగు.

జీవితంలోనూ క్షణాలు దొర్లుతూనే ఉంటాయి. అవి మధురంగా, మరిచిపోలేని అధ్యాయాలుగా నిండిపోవాలంటే ప్రతి క్షణాన్ని రసపట్టులో పునీతం చేసుకోవాలి. ప్రతి క్షణాన్ని పేలవంగా, నిర్జీవంగా గడుపుతుంటే శుష్కమైన జీవితమే ఆవిష్కృతమవుతుంది.

రెండు మనస్సులు ఒకటైనాయి. ఇరువురి అర్ధసెకన్లు ఒక సెకనై రసగుళికలుగా మారుతున్నాయి. సెకన్లు.. నిమిషాలు.. మధురానుభూతులుగా రూపం పోసుకుంటున్నాయి. జీవితంలో మరిచిపోలేని ఘట్టం. పదేపదే జ్ఞాపకానికి వచ్చే పరమానందం. ఒకరినొకరు పూర్తిగా అర్థం చేసుకునే దగ్గరితనం.. తన్మయత్వం. హనీమూన్లోని అంతరార్థం అదేనేమో?

"సా! నువ్వు రెడీ అవ్వు! నేను ఓ గంటలో వస్తాను" అని తలుపు మూసి వెళ్ళాడు. గది బయట 'డునాట్ డిస్టర్బ్' అటూ ఇటూ ఊగి నిలిచిపోయింది. ఎవ్వరినీ లోనికి రాకుండా సుందరమైన అక్షరాల్లో అలంకరించిన బెదురు బొమ్మ అది! స్ట్రిక్టుగా పనిచేసే డోర్ కీపర్!!

ప్రభ బెడ్డుపై నుండి లేచింది. ఆ రోజు వేసుకొనే బట్టల్ని ఎంపిక చేసుకుంది. ఎంబ్రాయిడరీ చేసిన గుజరాతీ కుర్తా. సరిపోయే ప్లాజో, గాజుల్ని, గడియారపు పట్టీని, నెయిల్ పాలిష్.. మ్యాచింగ్కి కావలసిన వాటిని ఒకచోట పెట్టింది. పెళ్ళికి ముందు ఈ డ్రెస్ వేసుకున్నప్పుడు కిరణ్ అన్న మాటలు గుర్తుకొచ్చి దీన్ని వెంట తెచ్చుకుంది. నేపాల్లో వేసుకుని కిరణ్ని ఆశ్చర్యంలో ముంచేయాలన్న ఆరాటం! తనలో తానే నవ్వుకుంటూ తలుపు తీయగానే కిరణ్ ప్రతిస్పందన ఎలా ఉంటుందో చూడాలన్న ఆతురత!

కిరణ్ నడుచుకుంటూ క్రితం రోజు వెళ్ళిన హాండిక్రాఫ్ట్స్ షాప్కి వెళ్ళాడు. పరిసరాలని, రోడ్డుని బాగా గుర్తుపెట్టుకున్నాడు. తొందరగానే చేరుకున్నాడు. ప్రభ ముందు రోజు కొనాలనుకున్న జ్యూయలరీని గుర్తుపట్టడానికి ఎక్కువ సమయం పట్టలేదు.

పదకొండు నలభై దాటింది.

క్రితం రోజు కొనమంటూ తను ప్రభని బలవంతం చేయంది ఇందుకే! ఒంటరిగా వచ్చి ప్రభకి నచ్చిన వాటిని ఆమెకి తెలియకుండా కొని తీసుకెళ్ళి ఆమె ముందర పరచినప్పుడు ఆమె కళ్ళలోని మెరుపు,

సంతోషం చూడాలనే కోరిక!

బిల్లు చెల్లించేముందు మరోసారి పెద్ద హాలునంతా తిరుగుదామని ఆకర్షణీయంగా అమర్చిన సామగ్రిని చూస్తూ అడుగులేస్తున్నాడు. తన కుటుంబంలో ఇంకెవరికైనా కొందామా? అన్న ఆలోచన. హాల్లోని గడియారం పదకొండు ఏభై ఆరు నిమిషాలు చూపుతోంది. 'కాలం ఎవరి కోసం ఆగదు' అన్న జగమెరిగిన సత్యాన్ని చెప్పకనే చెబుతూ సెకన్ల ముల్లు గడియారంలోని అంకెలని స్పృశిస్తూ తన స్కోరుని పెంచుకుంటూ పన్నెండు అంకెని దాటగానే అరవైకి చేరి, నిమిషాల ముల్లుని ఒక చిన్న బిట్టు ముందుకు తోసి, తాను శూన్యధారణ దాలుస్తోంది.

కానీ ఈ స్థాయిలో ఎక్కువసేపుండదు. తన పని కాలాన్ని వెనక్కి నెట్టుతూ, చరిత్రలో భాగంగా మారుతూ మళ్ళీ ఒకటి, రెండు, మూడు... ఏభై ఎనిమిది, ఏభై తొమ్మిది, అరవై.. మళ్ళీ ఒకటి.. రెండు..

వెనక్కి చూడని ప్రయాణం!

సెకన్లముల్లు పన్నెండు వైపు గేర్లు లేని నడకతో సాగుతోంది. పన్నెండు అంకెని తాకింది. అరవై సెకన్లు పూర్తయ్యాయి.

సమయం. ఉదయం : 11.56.

పది సెకన్లు కాలగర్భంలో కలిశాయి. కిరణ్ కొన్నింటిని సెలెక్ట్ చేశాడు.

ప్రభ ఇక్కడ హోటల్‌లో తన నైపుణ్యాన్నంతా ఉపయోగించుకుని మేకప్ చేసుకుంది. ఏ క్షణాన వస్తాడా? ఎప్పుడు తలుపు తెరచి తనని చూస్తాడా? అని ఊహించుకుంటూ తీయని తలపులతో ఎదురుచూస్తోంది.

సెకన్ల ముల్లు నాలుగు అంకెని దాటింది. సమయం 11.56.20 సెకండ్లు.

టిక్..21, టిక్.. 22, టిక్..23, టిక్.. 24, టిక్..25, టిక్..26.

టైమపుడు : 11:56:26

...క

.........ద

..................లి

.........................క

...............................లు

భూమి కడుపులో చిన్ని కదలికలు, కుదుపులు. రెండు మహా ఫలకాలు కాస్త సర్దుకుని నిలకడగా ఉండడానికి కదిలాయి. అంతే! కొన్ని సెకన్లే!!

కానీ దాని ప్రభావం భూమి పైన మహా కదలికలుగా మారింది. నేపాల్లో ఊహించని రీతిలో కదలికలు. భారతదేశంలోనూ కదలికలు. బంగ్లాదేశ్, చైనాల్లోనూ కదలికలు. మంచుకొండల్లో కదలికలు. మహాపర్వతాల శ్రేణుల్లో కదలికలు. బహురూపాల్లో ఉన్న దేవి- దేవతా మూర్తుల్లో కదలికలు. పక్కాఇళ్లనుకుని మురిసిపోయిన వారి ఇళ్ళల్లోనూ కదలికలు! కదిలే మనుషుల్ని ఎప్పటికీ కదలకుండా చేసిన కదలికలు. కదిలే స్థితిలో ఉన్నా కదలకుండా ఇరుక్కుపోయిన వేలాది ప్రాణులు.

ఇదంతా కొన్ని సెకండ్లలోనే!

అప్యాయతతో, అభిమానంతో, అష్టకష్టాలు పడి కట్టుకున్న ఇండ్లు, భవనాలు, వారసత్వ సంపదగా కిరీటాలని ధరిస్తున్న కట్టడాలు.. ఇంకా ఎన్నో.. వంకర టింకర పగుళ్ళతో కళ్ళముందే ధ్వంసమయ్యాయి. దుమ్ము, ధూళి! శిథిలమైన మానవ నిర్మితాలు!!

ఆ కొన్ని సెకండ్లే ఎన్నో జీవితాల్ని చిందర వందర చేసేశాయ్!

భయంతో జనం పరుగులు తీశారు. రక్షణ కోసం నిర్మించుకున్న ఇళ్లనుండే ప్రాణరక్షణ కోసం బహిరంగ ప్రదేశాలకి పరుగులు. భయం తాండవించడానికి ఎన్నో మొహాలు వేదికలయ్యాయి. భయానికి వేదిక విస్తీర్ణం క్షణాల్లో పెరగడంతో, భయానికి తాండవించడానికి భయం వేస్తోంది. సెకండ్ల ముల్లుల్లా కదిలినవారు బయటపడ్డారు. నిమిషాల ముల్లుల్లా కద

లినవారు బయటపడలేకపోయారు. గంటల ముల్లులా కదలినవారు శిథిలాల్లో భాగాలయ్యారు. వారి స్థితిగతులని - బతికి ఉన్నారా? గాయపడ్డారా? కదిలే స్థితిలో ఉన్నారా? భౌతికశాస్త్ర సూత్రాలే నిర్ణయించాలి మరి!

★ ★ ★

అందంగా అలంకరించుకుని హుషారుగా ఎదురుచూస్తున్న ప్రభకి గదిలో కదలికలు తెలుస్తున్నా సీరియస్‌గా తీసుకోలేదు. హోటల్ బిల్డింగ్‌లో ఏమైనా పనుల తాలూకు శబ్దాలేమో? అనుకుంది.

కిరణ్ ఎపుడెపుడు వస్తాడా? ఎదురు చూపులు! అంతలో భయంకరంగా శబ్దాల పరంపర!

భయంతో గట్టిగా అరుచుకుంటూ గది నుండి బయటపడదామని సోఫాలోంచి లేచిందో? లేదో? పెద్ద శబ్దంతో సీలింగ్ దభాల్న పడింది.

కళ్ళు మూసుకునే బిగ్గరగా 'కిరణ్' అని అరిచింది. ఆ తరువాత తనకేమైందో తెలియదు. ఆధునికయుగం. ఇరవై ఒకటో శతాబ్దం తొలి దశాబ్దాలు. సమాచార రంగాల్లో సాధనాల విప్లవాల్లో డోలలాడుతున్నాయి. ఎంత అల్ట్రా వేగంతో ఈ ప్రకృతి బీభత్సం వచ్చిందో అంతకంటే వేగంగా ప్రపంచమంతా తెలిసిపోయింది.

నేపాల్లో మహాభూకంపం!

చిన్ని దేశానికి పెద్ద దెబ్బ!

బుల్లి తెరపై బుల్లి దేశపు విపత్తుని ప్రత్యక్ష ప్రసారంలో చూపేందుకు ఎక్కువ సమయం పట్టలేదు.

కొత్త రాజ్యాంగంతో సింగారించుకోబోతున్న దేశాన్ని వైకుంఠపాళిలోని పెద్ద పాము మింగేసింది. అస్తవ్యస్తం.. అంధకారం.. దిగ్భ్రాంతి.. ప్రళయతాండవం!

దేశ ప్రధాని కాఠ్‌మండూలో లేడు. తన చికిత్స కోసం వేరే దేశంలో ఉన్నాడు.

అరుపులు.. ఆర్తనాదాలు.. భయంకర శబ్దాలు! భవనాలు అట్టబొమ్మల్లా కూలుతున్న వికృత దృశ్యాలు! బతికున్న వారి మస్తిష్కాలు మతిని కోల్పోయాయి. శరీర ప్రాథమిక పనుల్లో సమన్వయం ఆగిపోయింది. ఘాతాల పంజాల్లో గిలగిలా కొట్టుకుంటున్నారు.

నిశ్శబ్దం!

అరుపులు!

పరుగులు!

అపుడపుడు కూలుతున్న భవనాలు చేస్తున్న వికృత శబ్దాలు!

దేశ ప్రథమ పౌరుడైన రాష్ట్రపతి భవనమూ నివాసయోగ్యతను కోల్పోయింది. భూకంపానికి అందరూ సమానమే! ఇరుగుపొరుగు దేశాల ప్రభుత్వాల్లో కదలికలు! సహాయచర్యలకి సన్నాహాలు! దూర దేశాల్లోనూ కదలికలు! ఆదుకునే అంతర్జాతీయ సంస్థల్లో ఉరుకులు. ఐక్యరాజ్య సమితి అంగాల్లో ఆరాటం.. బుల్లి దేశాన్ని మళ్లీ నిలబెట్టటానికి. వార్తలు.. ప్రకటనలు.. సానుభూతి సందేశాలు..!

★ ★ ★

కిరణ్ బిల్లు చెల్లించి అడుగులేశాడు. చేతిలో జ్యుయలరీతో నిండిన ఆకర్షణీయమైన పాకెట్. తొందరగా వెళ్ళి ప్రభని ఆశ్చర్యపరచి ఆమె మొహంలో ఆనందాన్ని కళ్ళారా చూడాలి. ఊహించుకుంటూ.. ఉత్సాహంతో మెట్లు దిగుతున్నాడు.

ఏవో కదలికలు. హుషారుగా అడుగులేస్తున్నాడు కాబట్టి ప్రకృతి కదలికలు.. పాదకదలికలకి సోకలేదు.

భవనం భయంకరంగా క్షణాల్లో కూలింది. వికృత శబ్దాల పరంపర.. ఆర్తనాదాలు! అడుగులు పడుతున్న మెట్లలో కదలికలు! తడబడ్డ అడుగులు! సర్రున జారిపోయాడు కిరణ్! ద్వారం మూసుకుంది! చీకటి..! బిల్డింగ్ తాలూకు సామగ్రి చిందరవందరగా పడుతోంది!

స్పృహ తప్పి అచేతనంగా పడిపో

యాడు కిరణ్!

హైదరాబాద్‌లో భూకంపం గురించి తెలిసింది. బంధువులు, మిత్రులందరిలో కలవరం.

ఫోన్ల సునామీ.

ఫోన్ కాల్స్‌కు స్పందన లేదు.. అంద రిలో భయం.

కిరణ్ - ప్రభలున్న హోటల్ నంబరుకీ ఫోన్లు కలుపుతున్నారు. టీవీలకి కళ్లప్ప గించి మరీ చూస్తున్నారు.

అందరిలో ఆందోళన! క్షణాల్లో ఛిన్నాభి న్నమైన పరిస్థితులు! సహజమైన పిరికి తనం కీడువైపే ఆలోచనల్ని తోసేస్తోంది. మృతుల సంఖ్య క్షణక్షణానికి పెరిగిపో తోంది. నేపాల్లోని ప్రాంతాల నుండి.. ఇరుగుపొరుగు దేశాల నుండి... వైపరీత్య ప్రభావిత విధ్వంస వార్తలు పలురూపాల్లో ప్రసార మాధ్యమాలలో ఎడతెగకుండా వస్తూనే ఉన్నాయి. భూకంప కేంద్రం నేపాల్లోనే ఉన్నా, దాని ప్రభావం మూడు -నాలుగు దేశాలకు పాకి పోయింది.

ప్రతివార్త ఆందోళనల్ని గుణకారం చేస్తే, ఆశలేమో భాగహారం చేస్తున్నాయి. ప్రభ గురించి ఏ వార్తా లేదు. కిరణ్ నుండి ఎలాంటి సమాచారమూ లేదు.

కాఠ్‌మండూ విమానాశ్రయం వాణిజ్య సేవలనాపేసింది.

గంటలు గడిచాయి. నిమిషాలు నడుస్తు న్నాయి. సెకన్లు కళ్ళముందే చరిత్రలో కనుమరుగైపోతున్నాయి.

నేపాల్ చరిత్రలో మరిచిపోలేని మహా భూకంపాలు. చరిత్ర చెబుతోంది. 1833 సంవత్సరంలో.. 1934లో.. 1960లో.. 1988లో.. ఇప్పుడు 2015లో. భూకంపాల సరసన చరిత్రలోకెక్కడానికి కొన్ని సెకం డ్లు చాలు! మహాఫలకాలు మహారాజ ఠీవిలో మిల్లీమీటర్లు కదిలితే చాలు!

బాధితుల కన్నీటిని తుడవడానికి ఎన్నో సంవత్సరాలు.

కాఠ్‌మండూలో ఉన్న విదేశాల రాయబా రుల కార్యాలయాల్లో హడావుడి. తమ తమ దేశపౌరుల రక్షణ ఎంతో ముఖ్య మైన బాధ్యత. పర్యాటకులకి పీక్ సీజన్. ట్రెక్కింగ్ కోసం ఎన్నో దేశాల నుండి గుంపులకొద్దీ వస్తుంటారు. వారి వారి దేశాల పౌరులని వెతకడంలో, అవసరమై నవారికి వైద్యసేవల్ని అందించడంలో యు ద్ధప్రాతిపదికన పనులు ఆరంభించారు. ఇంకోవైపు తప్పిపోయినవారి, చనిపోయిన వారి జాబితాలు తయారవుతున్నాయి.

భారతదేశ రాయబార కార్యాలయం లోనూ హడావుడిగా ఉంది. ఇద్దరు ప్రధా నులు ఫోన్లో మాట్లాడారు. భారతదేశం పెద్దఎత్తులో సహాయాన్నందించడానికి రంగంలోకి దిగింది. వాయుసేన విమా నాలు, బిహార్ నుండి రోడ్డు మార్గాన లారీలు అన్నిరకాల సామగ్రి, ప్రత్యేక దళా లతో రవాణా కోసం సిద్ధమవుతున్నాయి. రెస్క్యూ బృందాలు రెడీ. సాంకేతిక ఉపక రణాల తయారు. టన్నుల కొద్దీ సహాయ సామగ్రి సిద్ధం.

మధ్యాహ్నం వాడిపోయి సాయంత్రమ యింది. సాయంత్రం తన పట్టింపు లేకుం డానే రాత్రిలోకి జారిపోతోంది.

కిరణ్ ప్రభలు దిగిన హోటల్ కుప్పకూ లింది. నామరూపాలు లేవు. దూరం నుండి చూస్తే ఈజిప్టులోని పిరమిడ్ గుర్తు కొస్తుంది. అందమైన హోటల్. ఆతిథ్యా నికి పేరు సంపాదించిన అక్కడి సిబ్బంది ఎలా ఉన్నారో? సాంకేతిక వివరాలు అమెరికా, ఇండియాల నుండి ప్రపంచ మంతా పాకిపోతున్నాయి. భూకంపం చేసిన వినాశం, మారణకాండ, ఊపందు కుంటున్న సహాయక చర్యలు బొమ్మలుగా బుల్లితెరలపై ప్రత్యక్షం. నియంత్రణలేని స్థితి, అస్తవ్యస్తం.

రాత్రి చిక్కబడింది. విద్యుచ్ఛక్తి సరఫరా దెబ్బతినడంతో, నేపాల్లో రాత్రి ఆ రోజు

కాటుకని పూసుకుని ఎన్నడూ చూడని నలుపు రంగుని సంతరించుకుంది.

ప్రభకి మెల్లగా స్పృహ... వస్తూ.. పోతూ అపస్మారక స్థితి.. అచేతనావస్థ.. తనపై ఏవో సామగ్రి చిందరవందరగా.. బరువుగా.. చేతనావస్థ... వెంటనే అచేత నావస్థ.. మళ్ళీ చేతనావస్థ.. వెనువెంటే అచేతనావస్థ.. నాలుగు నిమిషాల యాతన! పుంజుకున్న చైతన్యం. ప్రభ తన చేతులని కదిపే యత్నం చేసింది. కళ్లని తెరిచే ప్రయాస. కుడిచేతిని మెల్లగా కది లించింది. ఏవో బరువులు..! చేతిని కొంచెం అటూ ఇటూ స్వేచ్ఛగా కదల్చడా నికి స్థలాన్ని ఏర్పర్చుకుంది. మెల్లిగా చేతిని తన మొహంపైకి తెచ్చింది. మధ్యలో ఏ అడ్డంకులు లేవు. చేతివేళ్లు తన మొహాన్ని స్పృశించాయి. దుమ్ము, ఇటుక ముక్క లు.. ఒక్కొక్కదాన్ని జాగ్రత్తగా తీసేసి, తన మొహంపై ఇంక ఏమీ లేవని నిర్ధా రించుకుంది. మెల్లగా కళ్లు తెరిచింది. ఆశ గా చూడాలనుకున్న వెలుతురు ప్రభకి కన బడలేదు. చూపుపోయిందా? తానెక్కడుం ది? చుట్టుపక్కల ఎలాంటి శబ్దం లేదు.

కళ్లు మూసింది.. తెరచింది తన్ను తానే పరీక్షించుకుంటోంది. మూసింది.. మళ్ళీ తెరచింది. తేడా ఏమీ కనిపించలేదు. తనకి చూపుపోయిందా? తేడా లేకపోవ డంతో కళ్లని మూసుకుంది.

చైతన్యావస్థ చీమ నడకలా కళ్లలోకి ప్రవహిస్తోంది. అప్పటి వరకూ ప్రభకి తన కాళ్ళవైపు దృష్టి పోలేదు. చైతన్యం కొంతదూరం పోయి క్రమేణా ఆగిపోయిన ట్టుగా అనిపించింది.

కాళ్లని కదిలించే ప్రయత్నం.. కదలడం లేదు. గట్టిగా కట్టేశారా? కుడిచేతిని మెల్లగా కాళ్లవైపు జరిపింది. తొడలని తడు ముకొని ఇంకా ముందుకు జరిపింది. చేతికి ఏదో గట్టి వస్తువొకటి తగిలింది. తడిమి చూసింది. భారీ వస్తువే! మోకా ళ్లపై అడ్డంగా పడి ఉంది. కాళ్లని ఆ శిథి

**కొత్తగాలి...**

**పాలూ**
**నీళ్లూ**
**సహజీవనం**
**చేస్తున్నాయ్!**

– యు. చిట్టిబాబు,
న్యూ పాల్వంచ, ఖమ్మం జిల్లా

ల వస్తువు ఒక్క సెంటీమీటరు కూడా కద ల్చకుండా కట్టేసినట్టుగా ఉంది. కుడి కాలిని కాస్త అటుఇటూ కదల్చగలుగుతోంది. ఎడమ కాలిలో ఒక్కసారిగా నొప్పి.

చేతివేళ్ళకి కళ్లతికించి జాగ్రత్తగా తడి మింది. కాళ్లపై గోడ అవశేషం పడిందని గ్రహించింది.

తనకేమయ్యింది? కిరణ్ ఎక్కడు న్నాడు? తన సెల్ ఎక్కడుంది? ఇప్పుడు సమయమెంత? నిశ్శబ్దంగా ఉంది.

తానెందుకు లేవలేకపోతోంది? బలహీ నత.. ఆకలి.. పిరికితనం.. అశక్తత...

★ ★ ★

కిరణ్ ఖరీదు చేసిన జ్యుయలరీని తీసు కొని పాకెట్‌ని హుషారుగా ఊపుకుంటూ మెట్లు దిగుతున్నంత వరకే జ్ఞాపకముంది. ఆ తరువాత తనపై భవనపు శిథిలం పడడం, పర్యవసానంగా మెట్లపై నుండి అడుగులు జారి గభాల్న ముందుకు పడడం లీలగా గుర్తుంది.. అంతే! అంతకు మించి ఏమీ జ్ఞాపకం లేదు. స్పృహ తప్పి పడి ఉన్నాడు. గంటలు గడిచాయి. పగలు - సాయంత్రం. దినం చనిపో యింది. రాత్రి జనించింది.

తలలో విపరీతమైన నొప్పి. ఏదో పెద్ద వస్తువు తలపై పడి గాయపరచింది. రక్తం కారి గడ్డకట్టుకుపోయింది. 'అమ్మా!



జీవితంలో అన్నీ మనం కోరుకున్నవే జరగవు
పరిస్థితులను మనకు అనుకూలంగా
మార్చుకోవడమే తెలివైన మార్గం!

– జెన్నీ జెరోమ్ చర్చిల్

అ
క్ష
రం

అమ్మా!' మెల్లగా కలవరిస్తున్నాడు.. నొప్పి, బాధతో మూలుగు.

స్పృహ లోకంలోకి మెల్లిగా ప్రవేశం. తనకేమైంది? ఎక్కడున్నాడు? ఈ వస్తువులేమిటి? తనపై ఎందుకు పడున్నాయి? లేవాలని ప్రయత్నం చేసినా కదలలేని స్థితి. శక్తిని కూడదీసుకుని కదిలే ప్రయత్నం. హూ... హూ.. ఏమాత్రం కదలలేకపోతున్నాడు. ఈ యత్నంలో తన ఎడమ చేయి కదలకపోవడాన్ని గ్రహించాడు. కదిల్చే ప్రయత్నం చేశాడు. మరో వస్తువేదో దభాల్న మీద పడి స్థిరంగా మకాం వేసింది.

కుడిచేయికి కాస్త కదిలే స్థలం ఉంది. అటూ - ఇటూ కదిపి చూశాడు. దుమ్ము, ధూళి పైకి లేపి చూశాడు. ఏవో సామగ్రి అడ్డు తగిలాయి. చీకటి.. టైమ్ చూద్దామంటే గడియారం లేదు. తొందరలో హోటల్లో వదిలేసి వచ్చాడు.

కాలం కదులుతూనే ఉంది.

ప్రభ..! ప్రభ..! ఎక్కడ..? ఎక్కడా..? అయ్యో..! ఎలా ఉందో? గుండె దడ పెరిగింది. అయోమయం. తాను ప్రభని వదిలి రాకుండా ఉండాల్సింది. ఎందుకు వచ్చానా? అని పశ్చాత్తాపం! ఓ మైగాడ్!!

ఫోన్ గుర్తుకొచ్చింది. అవును..! ఎక్కడుంది? ఏమీ జ్ఞాపకం రావడం లేదు.

తల కొంచెం, ఎడమచేయి మాత్రం బాగా గాయపడ్డట్టుగా అర్థమవుతోంది. సివిల్ ఇంజనీరింగులో పట్టభద్రుడు.

ఇదంతా భూకంప ప్రభావమే అని అర్థం చేసుకున్నాడు. కోర్సులో చదువుకున్న విషయాలు జ్ఞాపకానికి వస్తున్నాయి.

ప్యాంట్ కుడివైపున్న జేబులోకి అతికష్టంగా చేయిని దూర్చాడు. సెల్ లేదు. చేతిని బయటకు తీసి ఎంతవరకు పోగలుగుతుందో అన్ని వైపులా అటూ - ఇటూ జరిపాడు. జ్యూయలరీ పాకెట్ చేతికి తగిలింది. దగ్గరగా లాక్కున్నాడు. మరోసారి చేతితో ఊడ్చాడు. సెల్ చేతికి తగిలింది. తనకిక డోఖా లేదని సంతోషించాడు. గభాల్న దగ్గరికి లాక్కున్నాడు.

ఫోన్ ఆన్ చేశాడు. ఆ చిన్న ప్రాణానికి చిత్రంగా ఏమీ దెబ్బ తగలలేదు. ప్రాణం ఉంది! వెలుతురు! వర్ణించలేని సంతోషం కిరణ్ మొహంలో. కటిక చీకటిలో చిన్న కిరణాల విలువ అమూల్యం. వెలుతురుని అన్ని దిక్కుల తిప్పాడు. ఎటుచూసినా బిల్డింగ్ శిథిలాలు.. సెల్‌ఫోన్ టార్చ్‌తో తనపై వెలుతురు చల్లుకున్నాడు. షర్ట్ అంతా రక్తంతో తడిసింది - ఆరిపోయింది. కుడిచేతిలో ఉన్న సెల్-టార్చ్‌తో ఎడమచేయివైపు ఫోకస్ చేశాడు. మోచేతి వరకే కనబడుతోంది. కింది భాగం కనబడలేదు. బరువైన గోడముక్క పడింది. దానికింద చేయి! కదల్చలేకపోతున్నాడు. కదల్చాలన్న ప్రయత్నాన్ని విరమించాడు. ఒక్కసారే చెయ్యినొప్పి మొదలైంది.

సమయం రాత్రి ఒంటి గంట. తేదీ 25 నుండి 26కి మారింది. భూకంపం వచ్చి పన్నెండు గంటలు దాటాయి. 'ఆఫ్టర్ షాక్స్' తాలూకు ప్రకంపనలు తమ ప్రభావాన్ని చూపుతున్నాయి. కాస్త అటుగా ఇటుగా నిలిచి ఉన్న కట్టడాలు 'ఆఫ్టర్

షాక్స్' తో పూర్తిగా కుప్పకూలుతున్నాయి.

చావుపై చావు. నాశనంపై వినాశనం.

ప్రభ నెంబర్ నొక్కాడు గంపెడాశతో.. దుఃఖంతో.. ఎలాంటి వార్త వింటానోనన్న భయంతోనూ..!

★ ★ ★

నిశ్శబ్దాన్ని ఛేదిస్తూ మృదువుగా రింగ్ టోన్. ఎంతో ఇష్టంతో, పదేపదే వినాలన్న కోరికతో ఇష్టపడి సెట్ చేసుకుంది. ఎటు వైపు నుండి వస్తోందో అంతుపట్టడంలేదు. కాస్తదూరంలో పొట్టి వెలుతురు కిరణాలు. ఫోన్‌పై దుమ్ము. ప్రభలో ఆశాకిరణాలు. మెల్లగా తన చేతిని కదిలించి సెల్‌ని పట్టుకుంది. తెరపై 'హబ్బీ' అక్షరాలు మెరుస్తూ... ఎన్నో హార్స్ పవర్ల బలం ఒక్కసారే శరీరంలోకి చేరింది.

"కిరణ్..! కిరణ్..! ఎక్కడున్నావ్? ఎలా ఉన్నావ్?" పిరికితనం పీడనలో ప్రశ్నల పరంపర. గుండె ధైర్యంతో ఏడు పుని ఆపుకునే ప్రయత్నం చేస్తోంది.

"ప్రభా..! ప్రభా..! నువ్వెలా..? నువ్వెలా ఉన్నావ్?" ఆరాటంతో, ఆదుర్దా!

ప్రభ గొల్లుమంది! "నన్నెందుకు వదిలి వెళ్లావ్ కిరణ్?" రోదిస్తోంది.

"ప్రభా..! నేను.. బతికే ఉన్నా. కానీ కదల్లేనిస్థితిలో శిథిలాల మధ్య! పెద్ద భూ కంపం వచ్చినట్టుంది. నువ్వెలా ఉన్నావ్"

ప్రభ ఏడుస్తూ తన స్థితి విడమర్చింది.

"ప్రభా! ఇప్పుడు రాత్రి ఒంటిగంట దాటింది. ధైర్యంతో ఉండు. రేపటి వర కల్లా రెస్క్యూ టీములు వస్తాయి. మనల్నీ వెలికి తీస్తారు. ఈ సమయంలోనే మనం ధైర్యంగా ఉండాలి. మనమేమీ చేయలేమి పుడు. ఇంకో విషయం గుర్తుంచుకో! మ నం ఎక్కువసేపు మాట్లాడవద్దు. మనల్ని బయటికి తీయడానికి ఎంత సమయం పడుతుందో కచ్చితంగా చెప్పలేం. ఫోన్ బ్యాటరీ పొదుపుగా వాడాలి. లేకపోతే మనం కాంటాక్ట్‌లో ఉండలేం"

"అలాగే ఆకలిగా, దాహంగా ఉంది. నువ్వు జాగ్రత్త!" పెట్టేసింది.

ప్రభ బెంబేలు పడి పిరికిదైపోతుందని కిరణ్ తన స్థితి గురించి పూర్తిగా చెప్ప లేదు. నిజం చెబితే మానసిక ధైర్యం తగ్గి పోతుందని అతని ఆలోచన.

అలికిడి అసలే లేదు. శ్మశాన నిశ్శబ్దం. అపుడపుడు అక్కడక్కడా బాధతో మూలు గులు, శక్తి క్షీణించిన రోదనలు, ప్రాణరక్ష ణకి పిలుపులు.. పట్టణమంతా ఇలాగే!

కాఠ్‌మండూ విమానాశ్రయం బిజీగా ఉంది. పలుదేశాల నుండి సహాయబృం దాలు తరలివస్తున్నాయి. అత్యాధునిక ఉపకరణాలతో, సూపర్ స్పెషలిస్టులతో, అన్ని రకాల సంసిద్ధతలతో భూకంప బా ధితులకి సహాయాన్ని అందించడానికి.

ప్రకృతి వైపరీత్యాలు అందరినీ మాన వతా దృక్పథంతో ఒక్కచోటికి తెస్తాయి. ఐక్యరాజ్య సమితి, రెడ్‌క్రాస్ దళాలు, 'డాక్ట ర్స్ వితౌట్ బార్డర్స్'... ఇంకా ఇంకా అనేక అంతర్జాతీయ సంస్థలు, సైన్యం, విమాన బలాలు, వాలెంటీర్లు. అందరూ రంగం లోకి.. మానవ జాతి కష్టాలని సత్వరం తగ్గించడానికి!

నేపాల్ గజగజలాడింది.

పిచ్చుకపై బ్రహ్మాస్త్రం.

మృతుల సంఖ్య క్షణక్షణానికి పెరిగిపో తోంది. గాయపడినవారి సంఖ్య వడివడిగా పరుగులుపెడుతోంది. ఇండ్లు, పెద్ద భవ నాలు, వారసత్వ సంపదని జీర్ణించుకున్న కట్టడాలు.. అన్నీ నేలమట్టం. కొన్ని కట్ట డాలు నిల్చొని ఉన్నా నివాసయోగ్యతని కోల్పోయాయి. ప్రకంపనలు చిన్నవైనా అ ప్పటికే పగుళ్లతో బలాన్ని కోల్పోయి నామ మాత్రంగా ఉన్నవి నేలకొరిగిపోతున్నాయి.

భూమి నేపాల్ వైపు కన్నెర్రచేసి చూసింది. ఆ దేశం ఛిన్నాభిన్నమైంది.

★ ★ ★

హైద్రాబాద్‌లో కుటుంబసభ్యులు టీవీ

లకే అతుక్కుపోయారు. ఛానెల్స్ చూపిన వాటినే పదేపదే చూపుతున్నాయి. కొత్త వార్తల కోసం చూస్తున్నారు.

భయం.. వందల్లో మృతులు.. ధ్వంసం.. ఘోర విపత్తు..! అందరూ భయంగా ఎప్పుడు ఎలాంటి వార్త రాబోతుందో? బెంగ.

సెల్ మోగింది. కిరణ్ పేరు కనబడింది. పండగలా సంతోషం!

"కిరణ్... కిరణ్.. ఎలా ఉన్నార్రా? " తల్లి పొంగివస్తున్న దుఃఖంతో.

"అమ్మా..! అమ్మా..!" ఆయాసంతో.. బాధతో.. మూలుగుతో.. కిరణ్.

"నేనూ, ప్రభ బతికే ఉన్నామమ్మా! కాని.. కానీ.. ఒక్కచోట లేం! ఇప్పుడే ప్రభతో మాట్లాడాను. మీరెవరూ ఫోన్ చేయకండి. మేం అవసరం మేరకు తక్కువగా మాట్లాడి బ్యాటరీ పవర్ని కాపాడుకోవాలి. మేం.. మేం కూలిపోయిన బిల్డింగులలో చిక్కుకుపోయాం.." అత్యవసర మాటల్ని చెప్పి సెల్ కట్ చేశాడు.

తల్లి మనస్సుకి కిరణ్‌తో ఇంకా మాట్లాడాలనిపించినా నియంత్రించుకుంది. కొడుకు గొంతు విని సంతోషపడింది. ఇద్దరూ బతికున్నారన్న సమాచారం అందరినీ సంతోషంలో ముంచింది. కొంత శాంతి!

కిరణ్ ఆ పరిస్థితులలోనూ ఓ సెల్ఫీ తీసుకున్నాడు. ఎవరికీ పంపలేదు. ఆలోచనలోంచి తేరుకున్నాడో? లేదో? ప్రభ నుండి తనని చూపుతూ ఫొటో రానేవచ్చింది. పరీక్షగా ప్రభ స్థితి చూసి గొల్లున ఏడ్చాడు. వెంటనే తమాయించుకుని ధైర్యంగా ఉండమని మెస్సేజ్ పంపాడు. తన ఫొటోని పంపి ప్రభని అధైర్యపరచకూడదనుకుని పంపలేదు.

ఫోన్లతో కనెక్ట్ అయినందుకు ఇద్దరికీ సంతోషంగా ఉంది. ఆ సమయంలో అది ఒక గొప్ప కానుక. లైఫ్ లైన్! మాట్లాడుకున్నారు. హైద్రాబాద్ వదిలినప్పటినుండి ఇంతసేపు ఒకరితో ఇంకొకరు మాట్లాడుకోకుండా ఉండడం ఇదే మొదటిసారి!

ఇద్దరి పరిధుల్లో ఆలోచనలు, అశక్తత! లోకంలో ఆలోచనలకు కరవు ఎలా ఉంటుంది? వాటంతటవే వస్తుంటాయి.

'ప్రభని ఆశ్చర్యంలో ముంచెత్తడానికి జ్యుయలరీ కొనడానికి రాకుండా ఉండాల్సింది. మంచైనా చెడైనా ఇద్దరం ఒక్కచోటే ఉండేవాళ్లం. పెద్ద తప్పు చేశాను..' కిరణ్‌లో ఆత్మవేదన.

'నేనెందుకు వెళ్లనిచ్చాను కిరణ్‌ని! తనతో కలిసి వెళ్ళాల్సింది. పదిహేను నిమిషాలు ఆలస్యమైనా తాను రెడీ అయ్యి జంటగా వెళ్లి ఉంటే ఈ క్లిష్ట పరిస్థితిలో కలిసే ఉండేవాళ్లం. ఈ కష్టాల్ని కలిసే ఎదుర్కొనేవాళ్లం. కిరణ్ వచ్చేలోగా అతనికి నచ్చిన డ్రెస్ వేసుకొని సంతోషపరచాలన్న కోరిక ఎందుకంతగా కలిగిందో? మూర్ఖురాలిని!'

ప్రభ మూలుగులో సన్నగా ఏడుపు. గట్టిగా ఏడ్చే స్థితి లేదు. శక్తి కూడా లేదు.

రకరకాల ప్రకృతి విపత్తులకి ముందస్తు హెచ్చరికలు చేసేందుకు పద్ధతులున్నాయి. వర్షాలకి, పెను తుఫానులకి ఉన్నాయి. సునామీల ఆగమనం గురించి తెలుసుకోవచ్చు. మానవజనిత విపత్తులకి మరో రకం హెచ్చరికలు! పోలీసువారు రెడ్ అలర్ట్ ఇస్తారు. ప్రభుత్వాలు టెర్రరిస్టుల దాడుల గురించి సూచిస్తూ అప్రమత్తంగా ఉండాలని ప్రకటనలిస్తుంది. భూకంపాలు వచ్చే విషయాల్లో మనిషి చాలా బలహీనుడు. మన శాస్త్ర- సాంకేతిక రంగాలు కచ్చితమైన ముందస్తు హెచ్చరికలు ఇవ్వలేకపోతున్నాయి. భూమి గర్భంలో జరిగే కదలికల్ని మనిషి పసిగట్టలేకపోతున్నాడు. మనిషికి- ప్రకృతికి జరుగుతున్న మహా పోరాటమిది. ఘర్షణ వందల సంవత్సరాల కొద్దీ కొనసాగుతున్న యుద్ధం. తన ఆకారాన్ని పెంచుకుంటూ

ప్రకృతి రహస్యాలని ఛేదించుకుంటూ.. ముందుకు సాగుతూ విర్రవీగుతున్న మనిషి కొన్ని విషయాల్లో ఎందుకు వామనుడవుతున్నాడు? బలహీనుడవుతున్నాడు? చిత్తుగా ఓడిపోతున్నాడు! తల్లుల గర్భాల్లో తొమ్మిది నెలలు రకరకాలుగా కదిలి బయటపడ్డ మనుషులు, మేధావులైనా, శాస్త్రవేత్తలైనా, మహానిపుణులైనా భూమాత గర్భంలో ఉన్న ఫలకాల కదలికల్ని ఎందుకు పసిగట్టలేకపోతున్నారు? ఆస్తి నష్టాల్ని నివారించకున్నా ప్రాణ నష్టాలని తగ్గించేవాళ్ళం కదా! గత ముప్పై సంవత్సరాల్లో దక్షిణాసియా దేశాల్లో ఎన్ని భూకంపాలు రాలేదు? చనిపోయిన వారి సంఖ్య లక్షల్లో లేదూ? బతికిబయటపడ్డ వారు ఎలా ఉన్నారు? ఎలాంటి జీవితాలు గడుపుతున్నారు?

ఇప్పుడు నేపాల్లో!

ఏ వర్గంలో కిరణ్- ప్రభలని జోడించాలి? చనిపోయిన వారిలోనా? తీవ్రంగా గాయపడ్డవారిలోనా? చిన్న గాయాలతో బయటపడ్డ జాబితాలోనా?

రానున్న రోజులే జవాబివ్వాలి!




ఏప్రిల్ 26, 2015 ఉదయం! నలుపు కనుమరుగైంది. తెలుపు పరుచుకుంది. ప్రభ ఆకలి, దాహంతో మూలుగుతోంది. సొమ్మసిల్లి బలహీనత శరీరమంతటికీ విస్తరిస్తోంది.

కిరణ్ మెలకువగా ఉన్నా అచేతనంగా ఉన్నాడు. కదలలేని స్థితి. శక్తిహీనుడిగా నిద్రలోకి జారిపోయాడు. బయటి అలికిడికి మెలకువలోకొచ్చాడు. శరీరంలో చిన్ని కదలికలు. వెలుతురు తోవచేసుకొని అందరికీ చేరుకుంటోంది. ప్రత్యక్షంగా.. పరోక్షంగా..!

కిరణ్ చుట్టూతా కాస్త వెలుతురు. మెల్లగా గ్రహిస్తున్నాడు. అప్పటివరకూ కళ్ళు చీకటిలోకానికి అలవాటుపడ్డాయి. వెలుతురికి క్రమేణా తెరుచుకుంటున్నాయి. కిరణ్‌లో ఆశ. ఎవరో వస్తారు. తనని శిథిలాల్లోంచి తీస్తారు. వెంటనే తన ప్రభని కలుసుకుంటాడు.

ఆశలపై ఆశలు..కళ్ళాలు లేని ఆశలు..!

ప్రభ ఇంకా కళ్ళు తెరవలేదు. అపస్మారక స్థితిలోనే ఉంది. తన చుట్టూతా పడ్డ సామగ్రి ఒక కుహరంలా ఏర్పడడం వల్ల వెలుతురికి అడ్డంకిగా ఉంది.

ఒక్కసారే దూరంగా అరుపులు. పక్క గదుల్లో చిక్కుకున్న వారెవరో గట్టిగా మూలుగుతూ.. తోడుగా సన్నని ఏడుపు.. తర్వాత ఇంకెవరిదో అరుపు. "నేను బతికే ఉన్నాను! రక్షించండి.." హిందీలో.

"ఎవరైనా ఉన్నారా? వింటున్నారా? దయచేసి రక్షించండి.." ఆంగ్లంలో.

గొంతు - గొంతూ ఏకమయ్యాయి. ప్రభ చెవిలోకి దూరాయి. కదలికలు.. జాగ్రత్తగా వింటోంది. తనలాగే ఇరుక్కుపోయినవారి ఆర్తనాదాలు.

క్షణాలు.. నిమిషాలు గడిచాయి.

నిశ్శబ్దం.. గొంతులు అలిశాయి. శక్తిని పుంజుకొని ఆశతో పంపిన ఆర్తనాదాలు అక్కడ ఇరుక్కుపోయినవారికే వినిపించాయి. చనిపోయినవారి చల్లని చెవులని కూడా తాకి ఉంటాయి.

ఆ ప్రాంతంలో ఇంకా ఏ సహాయక బృందాలూ అడుగుపెట్టలేదు. నిశ్శబ్దం.. మార్పు లేదు. అలాగే కొనసాగుతోంది.

నిమిషాలు గంటల్లోకి.. ఉదయపు గంటలు.. మధ్యాహ్నపు గంటల్లోకి..

అవసరాలు ఆకాశమంత.. అందుబాటు పిడికెడంత.

ప్రభావిత ప్రాంతాల వంతు ఎపుడొస్తుందో? అభయహస్తాలు తమ శరీరాలని ఎపుడు తాకుతాయో? తమనెపుడు బయటకి తీస్తారో? ఆశా-నిరాశల మధ్య డోలలాడుతున్న ఆలోచనలు.

గంటగంటకి శరీరాలు క్షీణిస్తున్నాయి. గాయాలతో తనువులు మరింత బాధపడుతున్నాయి. కిరణ్‌కి చాలా దాహంగా ఉంది. గొంతు ఎండిపోతోంది. నాలుక మరింత పిడచకట్టకుండా ఉండడానికి ఏమీ చేయలేకపోతున్నాడు. నోరంతా శుష్కకుహరంలా తయారయ్యింది.

"నీళ్ళు.. నీళ్ళు.. పానీ దేవో.. పానీ దేవో భయ్యా.." మాటలు వాటంతట అవే బయటపడుతున్నాయి. "బచావో.. బచావో.. కాపాడండి.. రక్షించండి.. వినబడుతోందా? పలకరేం?" ధ్వని క్రమేణా తగ్గుతూ.. హెచ్చుతూ.. సహాయక బృందాల దృష్టిని ఆకర్షించడానికి తిప్పలు పడుతున్నాడు. శక్తి నశించింది. మాట్లాడలేని స్థితిలోకి జారుతున్నాడు.

నిమిషాలు గడిచాయి.

వరస ప్రకంపనలు వస్తూనే ఉన్నాయి. ఆ కదలికలకి కట్టడాలు పడుతూనే ఉన్నాయి. చావులపై చావులు రికార్డవుతున్నాయి. ఆస్తుల, మౌలిక వసతుల నష్టాల అంకెలు అదుపులో లేవు.

కిరణ్ ఆలోచనల్లో చిన్న మెరుపు! అరుపులు ఎలాటి ఫలితాలనివ్వకపోతే చివరి ఆశాకిరణం. అతి కష్టంగా కుడిచేతిని ముందుకు పోనిచ్చి కప్పులా చేసి తన మూత్రాన్ని నింపాడు. జాగ్రత్తగా చేతి కప్పు నుండి ఒక్క చుక్క కూడా కిందపడనీకుండా తననోటి దగ్గరికి జరుపుకున్నాడు. నాలిక తడయ్యింది. విపత్తులో మనలోనే ఉన్న దివ్య ఔషధం! తన మూత్రమే అప్పుడు అమృతం! ఎప్పుడో దినపత్రికల్లో విపత్తులో ఇరుక్కున్నవారు ప్రాణాల్ని నిలుపుకోడానికి మూత్రాన్ని తాగిన విషయం గుర్తుకొచ్చింది. ఈ రోజు తాను అమలు చెయ్యాల్సిన అవసరం వచ్చింది. రెండోసారి మరికొంత! ఈ తడి ఈ పూటకి చాలు అనుకున్నాడు. రెండు-మూడు గంటల వరకు ప్రాణాన్ని నిలుపుకోవచ్చనే విశ్వాసం పెరిగింది. వెంటనే ప్రభ గుర్తుకొచ్చింది. ఠక్కున ఫోన్ చేసి వేగంగా చెప్పాడు. సంకోచించకుండా ప్రాణాల్ని నిలుపుకోవడం ముఖ్యమని ధైర్యం చెప్పాడు.

ప్రభ కూడా వార్తల్లో ఇలాటి అనుభవాలని చదివింది.

★ ★ ★

దేశ విదేశాల నుండి సహాయక బృందాలు తరలి వస్తున్నాయి. నేపాల్ ఆర్మీ ఆధ్వర్యంలో చిన్నచిన్న బృందాలుగా ఏర్పడి రంగంలోకి దిగుతున్నాయి. అధునాతన పరికరాలు, సాంకేతిక ఉపకరణాలు, సిమెంట్- కాంక్రీట్ బ్లాక్స్‌ని అవలీలగా కోసే కట్టర్స్.. శిథిలాల కింద కూరుకుపోయి, కనబడకున్నా, ప్రాణాలతో ఉన్న మనుషుల్ని పసిగట్టే సరంజామా, తర్ఫీదు పొందిన కుక్కలు.. యుద్ధ ప్రాతిపాదికన పనులు ఆరంభమయ్యాయి.

కాఠ్‌మండూ నగరమంతా కదలికలే! భూగర్భంలో జనించిన చిన్న కదలికలు భూమి ఉపరితలంపై ఊహకందని పెను కదలికలకి కారణమయ్యాయి. పట్టణంలో ఎప్పుడూ లేని రీతిలో రకరకాల విమానాలు దిగుతున్నాయి.. తిరిగి వెళుతున్నాయి. మానవాళి శ్రేయస్సు కోసం. ఒక చిన్న పేద దేశంలో సంభవించిన మహా విపత్తుని ఎదుర్కొనేందుకు సౌభ్రాతృత్వంతో సహాయసహకారాలు అందించే ప్రక్రియ. నేపాల్ సైన్యం వాహనాల కద

లికలు. ప్రత్యేక బృందాల కదలికలు. వారి చేతుల్లో కదులుతున్న అధునాతన సాంకేతిక ఉపకరణాలు. మేమూ ఉన్నామంటూ వచ్చిన శునకాలు. అప్పటికప్పుడే ఏర్పాటు చేసిన తాత్కాలిక ఆస్పత్రులు. ఆపరేషన్ థియేటర్లు. వేగంగా కదులుతున్న వైద్య బృందాల చేతులు. కదిలీ కదల్లేని స్థితిలో బెడ్డుపై పడి ఉన్న క్షతగాత్రులు.. మూర్ఛపోయి ఉన్నవారు.. మూలుగుతున్నవారు.. బాధల్ని తట్టుకోలేక అరుస్తున్నవారు.. ఆడ, మగ, శిశువులు, మధ్యవయస్కులు.. వృద్ధులు, బక్కచిక్కినవారు.. అందరి కళ్ళలో ఆశలునిండిన చూపుల కదలికలు.

అత్యవసర శస్త్రచికిత్సలు చకచకా సాగుతున్నాయి. దేశవిదేశాల నుండి వచ్చిన డాక్టర్ల బృందాల చేతుల్లో వేగంగా కదలికలు. చిత్రవిచిత్ర రీతుల్లో తీవ్ర గాయాలతో వస్తున్నవారి సంఖ్య పెరుగుతోంది. టకటకా కుట్లు పడుతున్నాయి. స్థితులని బట్టి శరీరాంగాలని తీసేస్తున్నారు. ప్రాణాలని కాపాడడానికి ప్రాణప్రదమైన అవయవాలని తీయక తప్పడం లేదు.

రోడ్డుపైన మనుషుల కదలికలు.. మతిస్తిమితంలేని చలనాలు. విపత్తు షాక్‌లోనే ఇంకా ఈదుతున్న అసహాయులు. కథల్లో చదువుకునే నేపాలీ మాంత్రికుడి వికృతలీలలు ఇలానే ఉంటాయేమో!

టూరిస్టులకి అనువైన కాలం. పర్వతారోహణకి సమయం. ఏప్రిల్ నుండి రెండు-మూడు నెలలు నేపాల్ చాలా రద్దీగా ఉంటుంది. విదేశీ పర్యాటకులు పెద్ద సంఖ్యలో వలస పక్షుల్లా యేటా వస్తుంటారు. ఈ కారణాలవల్ల అంతర్జాతీయ పర్యాటకులని కాపాడుకునే బాధ్యత ఆయా దౌత్యకార్యాలయాలపై పడుతుంది. ఎంబసీలు సత్వరమే రంగంలోకి దిగి వారి పౌరుల ఉనికి, క్షేమసమాచారాల కోసం తాపత్రయపడుతుంటారు. అవసరాలని బట్టి గాలింపు చర్యలు మొదలుపెడతారు. ప్రత్యేక విమానాల్లో వారి గమ్యస్థానాలకి పంపే యత్నాలు.

## కొత్తగాలి...

**చేనేతతో చెలిమి**
**నేతకారులకు కలిమి**
**ఉపాధిబాటన బలిమి!**

– ముడుంబ సీత,
భద్రాచలం

★ ★ ★

ప్రభ చెవులకి ఏదో అలికిడి మెల్లగా సోకింది. జాగ్రత్తగా వినే ప్రయత్నం చేస్తోంది. నిస్సత్తువ శరీరమంతా ఆవరించింది. ప్రయత్నించినా నోట్లోంచి మాటలు రావడంలేదు. 'నన్ను కాపాడండి' అని పదే పదే అరవాలని ఉన్నా మూగతనం. కళ్ళల్లో నీరు. ఏడుపు శబ్దంతోనైనా ఆ ప్రాంతానికి వచ్చిన బృందానికి తన ఉనికిని తెలపాలన్న తపన. శరీరం, గొంతు సహకరించకపోవడంతో అచేతనంగా ఉండిపోయింది.

కనుకొలకుల నుండి కారుతున్న నీటిని చేతివేలితో నాలుకపై అద్దుకుంది. ఉప్పగా ఉన్నా నాలిక చివర్న తడి తగిలింది. అదొక వింత అనుభవం! ఆ సమయంలో అమృతపు చుక్క!!

రెస్క్యూ బృందాలు ప్రభ పడి ఉన్న చోటికి దగ్గరలో తిరుగుతోంటే, బతికున్న మనిషి సంకేతాలు రావడంతో ఆ ప్రాంతంలోనే శోధన ఆరంభించారు. ఆ దరిదాపుల్లోనే నిపుణులంతా ఉపకరణాల సహాయంతో ఒక్కచోటికి చేరుకొని స్థలాన్ని పరిశీలించారు.

చీకటి చిక్కబడింది. టార్చ్‌లు, హెడ్ గేర్ లైట్లని పనిలోకి దించారు. బృందం



సభ్యుల మధ్య ఆంగ్లంలో సంభాషణ జరుగుతోంది.

ప్రభకి బయట ఏం జరుగుతోందో కాస్త అర్థమవుతోంది. మనస్సులో సంతోషం కలిగినా గొంతు సహకరించలేదు. మాట రావడం లేదు. ఎంత ప్రయత్నం చేసినా ఏవో అస్పష్టమైన శబ్దాలే వస్తున్నాయి.

"మేం వచ్చాం! భయపడవద్దు!"

"టక్... టక్... టక్..." ప్రభ ఇటుక ముక్కతో శబ్దం చేస్తోంది.

లైట్ల వెలుతురు వివిధ కోణాల్లో ప్రయాణించేసి ప్రభ ఉన్న కుహరంలోకి ప్రవేశించింది. చీకటి మసకచీకటిలా మారింది.

ఆశలూ అంకురించాయి.. ప్రభకీ - రెస్క్యూ బృందానికీ..!

టక్.. టక్ శబ్దంలో వేగం పెరిగింది.

అది వస్తున్న చోటు తెలిసింది. బృంద సభ్యులు చర్చలు చేసి ప్రాణంతో ఉన్న మనిషి స్థలాన్ని నిర్ధారించారు. వారికొక పెద్ద సాంకేతిక సవాలెదురైంది. చుట్టూతా సిమెంటు- కాంక్రీటు శిథిలాలు అస్తవ్యస్తంగా పడి ఉన్నాయి. ప్రవేశించడం సులభ సాధ్యంగా లేదు. బృందం వద్ద గ్యాస్ కట్టర్స్ లేవు. కావలసిన వెలుతురు సౌకర్యాలూ లేవు. తెగింపుతో ఏ మాత్రం సాహసం చేసినా పరస్పర ఆసరాతో సెటిల్ అయి ఉన్న సిమెంటు-కాంక్రీటు శిథిలాలు దభాల్న మనిషిపై పడే ప్రమాదాలు ఎక్కువైనందున జాగ్రత్తగా నిర్వహించాలి. ప్రాణాలకి అపాయం తెచ్చే రిస్కులని ప్రస్తుతం తీసుకోలేరు. దీన్ని ఒక ప్లాన్ ప్రకారం చేయాలంటే మరునాడు



పూర్తి సంసిద్ధతతో, నిపుణులతో రావాలి.

రెస్క్యూ బృందం నిర్ణయం తీసుకుంది. అప్పటి స్థితిలో అదే ఉత్తమ నిర్ణయం. రేపు పొద్దున వస్తామని హామీ ఇచ్చి, అధైర్యపడొద్దని పలుమార్లు చెప్పి, కౌన్సిలింగ్ చేసి నిష్క్రమించారు. నీళ్ళ బాటిళ్ళు ఇచ్చే వీలు కనపడలేదు.

ప్రభకి వారి మాటలు అర్థమయ్యాయి. పరిస్థితీ మెల్లగా తెలిసింది. వారి ధైర్యపు మాటలు గుర్తుకొచ్చి బతుకుపై విశ్వాసం పెరిగింది. చీకటి కుహరం చుట్టూతా చీకటి దట్టంగా చుట్టుకుంది.

★ ★ ★

కిరణ్ ఇంట్లో హడావుడిగా ఉంది. తోచిన రీతిలో అందరి నుండి ఉచిత సలహాలు ఊడిపడుతున్నాయి. విషయజ్ఞానమున్న శ్రేయోభిలాషులతో సత్వర సంభాషణలని జరుపుతున్నారు. పలుకుబడి ఉన్న పెద్ద మనుషులతో, రాజకీయనాయకులతో, సీనియర్ అధికారులతో సంప్రదింపులు మొదలయ్యాయి. వాలెంటరీ ఆర్గనైజేషన్స్‌కీ వివరాలనిచ్చారు.

కాఠ్‌మండూలోని ఇండియన్ ఎంబసీ అధికారులకి ఫోన్లు చేయిస్తున్నారు. అన్ని లిస్టులపైనా చనిపోయినవారి పేర్లున్న జాబితాలతోసహా అన్యమనస్కంగానైనా ఓ కన్నేసి చూస్తున్నారు.

ఆ ఇంట్లో ఒక బృందం అవతరించింది. ఒక ఉపబృందం వాణిజ్య విమాన సేవలనారంభించగానే కాఠ్‌మండూకి, మరో ఉపబృందం బిహార్ రాష్ట్రం ద్వారా రోడ్డు మార్గాన, మూడో ఉపబృందం ఢిల్లీలో

మకాం వేసి పైరవీ మార్గాలని వెతికి శీఘ్రంగా కిరణ్-ప్రభల ఆచూకీ, యోగక్షేమాలని తెలుసుకుని వెంటనే ఏర్ లిఫ్ట్ చేసి హైదరాబాద్ తీసుకురావడానికి.

★ ★ ★

కిరణ్ శరీరం శుష్కించి పోతోంది. తిండి, నీరూ లేక ఒక రోజు గడిచింది. ఎడమ చేతికి పెద్ద గాయం. కదలలేని స్థితి. మెదడు దిమ్ముగా ఉన్నా ఎక్కడో చురుగ్గా పనిచేసే ద్వీపాలు. తనలోని విమర్శకుడు ప్రశ్నలు వేస్తున్నాడు. బాణాల్ని సంధిస్తున్నాడు. రయ్ రయ్యిన అవి మస్తిష్కంలోకి దూసుకుపోతున్నాయి. బయటకి లాగలేకుండా ఇరుక్కుపోయాయి. తానే సమాధానాలని, పరిష్కారమార్గాలని వెతకాలి.

ఎందుకీ పరిస్థితి ఏర్పడింది? ఈ భూకంపం రెక్టర్ స్కేల్ పై ఎంతో? వందల్లో వేలల్లో చనిపోయుంటారు. రకరకలుగా గాయపడినవారూ వేలల్లోనే ఉంటారు. ఆస్తినష్టం, జననష్టం. మౌలిక వసతుల నాశనం... వివిధ రూపాల్లో బాణాలు తొలుస్తున్నాయి. దీర్ఘాలోచనలు మూలాల వరకు తీసుకెళ్తున్నాయి. అపుడపుడు మెరుపు ఆలోచనలు...

నాకీ స్థితి ఎందుకు కలిగింది? నేనెందుకు ఇలా ఇరుక్కుపోయాను. మెట్లు దిగుతున్నాను. కొన్ని సెకన్లయితే షాప్ నుండి బయటపడి రోడ్డుపై ఉండేవాణ్ణి. షాప్‌లో ఉన్నవారు ఎలా ఉన్నారో? ఏమయ్యిందో వారికి? వారు కూడా శిథిలాల కిందే ఉన్నారా? బయటకి వెళ్ళే మార్గం ఈ మెట్లే కాబట్టి పైనే ఉండి ఉంటారు. ఎలాంటి శబ్దాలూ లేవు. చిన్నకళ్ల నేపాలీ అమ్మాయి చిరునవ్వుతో ఇండియా అనగానే ఎంతో అభిమానం చూపింది. ఆమె తోటి వారంతా.. తనలాగే గాయపడి, అచేతనంగా కూలిన శిథిలాల కింద చిక్కుకుపోయారా? చనిపోయారా? తీవ్రంగా గాయపడ్డారా?

స్ట్రక్చరల్ ఇంజినీరింగ్‌లో చదివిన పాఠాలు గుర్తుకొచ్చాయి. భూకంపాలని కొంతవరకు తట్టుకొని నిరోధించే పద్ధతులు లీలగా మెదిలాయి. హా.. హా.. బిల్డింగ్ కోడ్స్ అవునవును..! భూకంపాలు మనల్ని చంపవు. భవనాలు కూలడం వల్ల జననష్టం జరుగుతుంది. భూకంపాలని తట్టుకొని తీవ్రతని బట్టి నిరోధిస్తూ నిలబడే భవనాలని, ఇండ్లనీ నిర్మించే టెక్నాలజీ మనకు అందుబాటులో ఉంది. కోర్సులో ప్రొఫెసర్ చెప్పిన విషయాలు గుర్తుకొచ్చాయి. బిల్డింగ్ కోడ్స్‌ని ఎందుకు అమలు పరచలేకపోతున్నాం? ఎందుకు ప్రతిసారీ భూకంపం వచ్చినపుడల్లా వేలల్లో ప్రాణనష్టం జరుగుతోంది? భవనాలెందుకు పేకమేడలకంటే వేగంగా పడిపోతున్నాయి? చిత్తశుద్ధి ఎక్కడ కరవైంది? ప్రజల ప్రాణాలతో ఆటలాడుకుంటున్నామా? భావోద్వేగంతో చెప్పిన పాఠాలు కిరణ్‌ని బాగా ప్రభావితం చేశాయి. ఫైనల్ సెమిస్టర్లో గుజరాత్‌లో వచ్చిన భూకంపం (జనవరి 2001) విషయం పరిధిలోకి వచ్చిన టాపిక్‌పై ప్రాజెక్ట్ పని పూర్తిచేసి కిరణ్ తోటివారి కంటే ఈ రంగంలో కొంచెం ఎక్కువ జ్ఞానాన్ని సంపాదించాడు.

గంభీరమైన ఆలోచనలతో, అంతర్మథనంతో నీరసం ఆవహించింది. ఒకటిన్నర దినం గడిచింది. గొంతు మరింత శుష్కించింది. శరీరంలోకి సరఫరా ఏమీ లేకపోవడంతో మూత్రవిసర్జనా తగ్గింది.

'నేను చావను. బతికి బయటపడతాను. ప్రభ బతికుంది. మేం కలుసుకుంటాం. హనీమూన్ చివరి పాదంలో 'హాని' జరిగినంత మాత్రాన దాన్ని చెడుగా ఎందుకు అనుకోవాలి? ఈ అనుభవాన్ని ఆసరాగా మార్చుకొని మేమిద్దరం కొత్త ప్రాజెక్టులకు శ్రీకారం చుడతాం. వాటి విజయాలకి కృ

అ
క్ష
రం

నిజాన్ని తప్పించుకు తిరిగినా
దాని ఫలితం నుండి ఎవరూ తప్పించుకోలేరు

– అయాన్ రాండ్



షి చేస్తాం. పనికి కొత్త నిర్వచనాలిస్తాం!'

అలాంటి అనిశ్చితి పరిస్థితుల్లో కూడా అచంచలమైన విశ్వాసంతో ప్రతిజ్ఞకి తక్కువేమీ కాని స్థాయిలో మనస్సులో ఒక దృఢ సంకల్పానికి అంకురార్పణ జరిగింది. మూసుకున్న కళ్ళ ముందు భారతదేశ దిగ్గజాల మొహాలు అలా కదిలాయి! నారాయణమూర్తి, మల్లికార్జునరావు, నియోగి, షానవాజ్ హుస్సేన్, అంజిరెడ్డి, కిశోర్‌బియాని, కిరణ్ మజుందార్‌షా, జీవీకే రెడ్డి.. ఇంకా.. ఇంకా.. స్పష్టంగా.. అస్పష్టంగా..

అనుమానం లేదు. తమ రియల్ ఎస్టేట్ వ్యాపారం కూడా పుంజుకొని విస్తరిస్తుంది. పేరుని సంపాదిస్తుంది. మాకు మేం వినూత్నంగా ఆరంభిస్తాం. బిజినెస్ మాన్‌గా కాదు, బిజినెస్‌విమన్‌గా కాదు.. కొత్త రీతిలో 'బిజినెస్ కపుల్'గా పేరు సంపాదిస్తాం. పదేళ్లలో బిజినెస్ స్కూళ్ళ పాఠాల్లో కేస్ స్టడీగా చోటు సంపాదిస్తాం.

ఇలాంటి పాజిటివ్ ఆలోచనలు కిరణ్‌లో శక్తిని నింపుతున్నాయి. ఉత్సాహం కలుగుతోంది. నిశ్శబ్దాన్ని ఛేదిస్తూ ఓ వాహనం వచ్చి ఆగినట్లు దగ్గర్లో అలికిడి. మనుషుల మాటలు వినబడ్డాయి. కిరణ్‌లో ఆశాకిరణాలు. రెస్క్యూ బృందం వచ్చిన వాసన.

★ ★ ★

ఏప్రిల్ 26.

దినం చనిపోయింది. కొన ఊపిరితో చీకటిలోకి ప్రవేశించి 'రాత్రి' అని పేరుపెట్టుకుంది. కొన్ని గంటలైతే మధ్య రాత్రికి మరో తేదీ జనిస్తుంది. ప్రకృతి విపత్తుల పుస్తకంలో ఏప్రిల్ 25న కొత్త అధ్యాయం మొదలైంది. ఆ రోజుకొక విశేషతని ఇచ్చింది. పదాలు, వాక్యాలు, పేరాగ్రాఫులు వేగంగా నిండుతున్నాయి. 26వ తేదీ వచ్చే సరికి పేజీలు దొర్లాయి. గణాంక వివరాలు తమతమ గళ్ళల్లో చోటుచేసుకుంటున్నాయి. ఘడియ ఘడియకీ ఈ అంకెలు పెరుగుతూ పోతున్నాయి.

ముచ్చటగా ఏ మాత్రం కాదు.. మరికిగా మూడో రోజులోకి ప్రవేశం. ప్రభావిత ప్రాంతంలో అన్నివైపుల నుండి నిరాశ, నిస్పృహలే! సవాళ్లపై సవాళ్ళు ఊహించని రీతిలో! ఏర్‌పోర్ట్ రన్ వే దెబ్బతింది. విమానాలని దించడంలో ఇబ్బందులు. మరమ్మతులని పగటి పూట చేయలేం. అత్యవసర పరిస్థితిలో అంతరాయాన్ని కలిగించలేం. రాత్రిపూట చేపట్టాలి. అన్నిరకాల సహాయాలకి 'అప్పీళ్లు' బయటకొస్తున్నాయి. నేపాల్ ప్రధానమంత్రి ప్రజల్ని, దాతల్ని విరాళాలివ్వమని కోరారు. కూలిన భవనాల అవశేషాల్లో కుళ్లుతున్న శవాలు. ముసురుతున్న ఈగలు. వాంతులు వచ్చే దుర్గంధపు గాలి అలలు. గాయపడి ఇరుక్కుపోయినవారు బిక్కుబిక్కుమంటూ ఆశతో ఊపిరి పీల్చుకుంటున్నారు. ఏ సహాయం అందక అచేతనంగా పడి ఉన్నారు- స్త్రీలు, గర్భిణులు, పిల్లలు అన్ని వయసులవారు నరకయాతనని ప్రత్యక్షంగా అనుభవిస్తున్నారు.

బతికి బయట పడ్డవారి కష్టాలు మరో రకం. అన్నీ కోల్పోయి కేవలం ప్రాణంతో

ఉన్నా మానసిక సంతులన లేదు. చిత్రవి చిత్రమైన ప్రవర్తనలు.

ఇలాంటి హృదయవిదారక స్థితిలో మానవ వికృత రూపాలు అనేక కోణాల్లో కనబడతాయి. శవాల నుండి సొమ్ముల్ని ఊడ్చుకుపోయేవారు. నిత్యావసర వస్తువుల ధరలు అమాంతంగా పెరిగిపోయాయి. పాల ధర లీటరు రెండువందల రూపాయలు దాటింది. అభాగ్యులైన అమ్మాయిలపై కన్నేసి మాయమాటలతో గుప్తంగా దేశ సరిహద్దులని దాటించి వ్యభిచార వృత్తిలోకి దింపడం. ఆడవారిపై లైంగిక హింస, ఇంకా దోచుకునే మార్గాలు ఎన్నోరూపాల్లో ప్రదర్శితమవుతాయి!

నిండిపోతున్న శిబిరాలు అదుపు తప్పుతున్నాయి. తగ్గుతున్న సరఫరా. దొరికిన వారికి మరింత, దొరకని వారికి ఏమీ లేదు. పోట్లాటలు, లూటీలు, మనిషిని మనిషి చంపుకునే దమనకాండలు.. రాక్షస చేష్టలు! సంఘర్షణ, గొంతెత్తి అరవ లేని పరిస్థితి. అధికారాల కోసం పోట్లాడ దామంటే అనుకూలతలేని సమయం. స్థానికుల సమస్యలొకవైపైతే, అంతర్జాతీయ పర్యటకుల గతేంటి? టూరిజంపై ప్రధానంగా ఆధారపడిన దేశం నేపాల్! మంచుకొండలు విరిగిపడ్డప్పుడో? ఇంకేవైనా ప్రకృతి విపత్తులు సత్తాని చూపినప్పుడో చనిపోయినవారినో? లేక గాయపడిన వారినో? పౌరసత్వాన్ని బట్టి వారి ఎంబసీలు పూర్తి బాధ్యత తీసుకుంటాయి.

ఇవన్నీ ప్రతి విపత్తులో జరిగినా ఈ భూకంపం నేపాల్లో ఒక చిత్రమైన స్థితిని మానవాళి ముందుంచింది. పేద దేశమైన నేపాల్లో ప్రజలు జీవనోపాధికి రకరకాల మార్గాలు వెతుక్కుంటారు. భారతదేశంలో నేపాలీలు కనబడడం సాధారణం. టూరిజం చుట్టూతా స్థానిక ప్రజలకి ఆకర్షణీయమైన జీవనోపాధి దొరుకుతుంది. సంప్రదాయ జీవనోపాధి మార్గాలివి.

సాంకేతిక విప్లవాలు, టెక్నాలజీ పురోగమనాలు మానవాళి జీవన సమస్యలని అంచెలంచెలుగా సులభతరం చేయడానికి ముందుకు తీసుకెళతాయి. మనిషి అవసరాలు, పేదరికం విచిత్రమైన పనులని చేయిస్తాయి. బక్కచిక్కి రిక్షా తొక్కే మనిషి అత్యవసర పరిస్థితిలో ఓ సీసా రక్తాన్ని అమ్ముకుంటాడు. స్త్రీ తన శరీరాన్ని వాడుకోనిస్తుంది. కిడ్నీలమ్ముకునే వారి కథల్ని వింటూనే ఉంటాం. ఇలా ఎన్నోరకాలుగా చట్టం చట్రంలోకి రాకుండా తప్పించుకొని భారీ ఎత్తున వ్యాపార ఫక్కీలో దక్షిణాసియా దేశాల్లో విచ్చలవిడిగా సాగుతూనే ఉన్నాయి. నేపాల్లో స్త్రీలు గర్భాలని అద్దెకిస్తారు.

భూకంపానికి కొన్నిరోజులు ముందుగా, భూమి కదిలినప్పటి నుండి నేపాల్లో జన్మించిన శిశువుల సంఖ్య వందల్లో ఉంటోంది. కానీ అకస్మాత్తుగా కేవలం 33 మంది శిశువుల గురించి ఒక్కసారి ప్రాముఖ్యం సంతరించుకుంది. మీడియా కథనాలు, కవరేజీల, మంచి మసాలా వాసనలున్న ఐటం! ఇజ్రాయిల్ దేశం మెరుపు చర్యలకి పెట్టిందిపేరు. అక్కడ 'గే' పెళ్లిళ్ళకి చట్టం ఉంది కానీ, అద్దె గర్భాలకి చట్టంలేదు. 'గే జంటలు' వైద్యరంగంలో అందుబాటులోనున్న టెక్నాలజీ ఆసరాతో చట్టాలు అనుకూలంగా ఉన్న దేశాల్లో తమ సంతతికి రూపధారణ చేయించుకుంటారు. నేపాల్ స్త్రీలు గర్భాలని అద్దెకిచ్చి పిల్లలని కన్న తరువాత స్వలింగసంపర్కుల (జంటల) చేతుల్లో పెడతారు. సేవలందించినందుకు నేపాల్ స్త్రీలు ఫీజు తీసుకుంటారు. నైతిక, ఆర్థిక దోపిడి కారణాలున్నా, అంతర్జాతీయస్థాయిలో దీనిగురించి చర్చలు జరుగుతున్నాయి. ఈ తతంగం బహిరంగంగా, చట్టపరంగా జరుగుతూంటుంది.

నేపాల్ భూకంపం నేపథ్యంలో ఇజ్రా

# కొలంబస్ సంగతులు




ఉత్తర అమెరికా ఖండాన్ని కనిపెట్టిన క్రిస్టఫర్ కొలంబస్ సంగతులు..

★ కొలంబస్ రిపబ్లిక్ అఫ్ జెనోవా పౌరుడు.

★ 1492-1503లలో క్రిస్టఫర్ కొలంబస్ స్పెయిన్ - అమెరికా మధ్య నాలుగు సముద్రయానాలు చేశాడు. అందుకు స్పెయిన్ రాజు ఆర్థికసహాయం చేశాడు.

★ అమెరికాని కనుగొన్నప్పుడు ఆ ఖండంలో అప్పటికే తొమ్మిది కోట్లమంది నివసిస్తున్నారు. అది ఆనాటి ప్రపంచ జనాభాలో మూడో వంతు.



★ కొలంబస్‌కి ఐదొందల ఏళ్ల మునుపే లీఫ్ ఎరిక్సన్ అనే యురోపియన్ ఉత్తర అమెరికాకి వచ్చాడని నమ్మకం. ఇతని విగ్రహం వాషింగ్టన్ డి.సి. లోని కేపిటల్ బిల్డింగ్ ఆవరణలో ఉంది.

★ 2200 ఏళ్లకి మునుపే ఈజిప్ట్ గణిత శాస్త్రవేత్త ఎరాస్ట్ హెన్స్ భూమి చుట్టుకొలత ఎంతో ఆ దేశం నుంచి బయటకి వెళ్లకుండానే కనుక్కున్నాడు. అది నిజమైన లెక్కేనని కొలంబస్ నమ్మి, భూమి గుండ్రంగా ఉందని విశ్వసించాడు.

★ క్రిస్టఫర్ కొలంబస్ వారసుడు నేడు స్పెయిన్‌లో జీవిస్తున్నాడు.

★ ఆయన కాలంలో హిస్పానియోలా దేశంలో ముప్పై లక్షల మంది ప్రజలు యుద్ధాలు, బానిసత్వం, గనుల్లో పని వల్ల మరణించారు.

★ కొలంబస్ ఎలా ఉంటాడో ఎవరికీ తెలీదు. వర్ణనని బట్టి అమెరికన్ శాస్త్రజ్ఞులు ఆయన మొహాన్ని రూపొందించారు.

★ అమెరికాను కనుగొనడానికి యాభై ఏళ్ల ముందు పెరూలోని మచ్చుపిచ్చు నిర్మాణం జరిగింది.

★ 'బుక్ ఆఫ్ ప్రొఫెసీస్' అనే భవిష్య పురాణాన్ని కొలంబస్ తన చివరి దశలో రాశాడు.

★ అమెరికాకి నిమ్మగింజలని మొదటిసారి కొలంబస్ తీసుకువచ్చాడు.

★ ఓసారి మొక్కజొన్నలని దొంగిలించిన నిందితుడి ముక్కు, చెవులు కోసి ఆయన్ని బానిసగా అమ్మేశాడు కొలంబస్!

★ కొలంబస్‌కి దైవభక్తి అధికం. ఆయనకు బైబిల్ కొట్టిన పిండి. తన ఉత్తరాల్లో, లాగ్‌బుక్స్‌లో బైబిల్‌లోని కొటేషన్స్ రాసేవాడు.

యిల్ 'గే జంటల' శిశువులు కాఠ్మండూలో తయారవుతున్నారు. జన్యుపరంగా ఈ పిల్లలని ఇజ్రాయిల్ పౌరులుగా పరిగణిస్తారు. భూకంపానికి కొన్నిరోజుల ముందు భూకంపం వచ్చాక జన్మించిన 33 మంది శిశువులకి ఒక్కసారే విశేష ప్రాముఖ్యం వచ్చేసింది. వారిని క్షేమంగా 'ఏర్ లిఫ్ట్' చేసే బాధ్యత ఆ దేశం వారిదవుతుంది. ప్రత్యేక విమానంలో మగ 'జంటలు' వచ్చి తమ పిల్లల బాగోగులని చూసుకుంటున్నారు. ఆ శిశువులందరినీ 'పింక్' రంగు టవల్స్‌లో చుట్టారు. మీడియాలో 'పింక్ బేబీస్' శీర్షికతో కథనాలుగా వర్ణించారు. మరికొన్ని 'గే' జంటలని, డెలివరీకి దగ్గరలో ఉన్న స్త్రీలని, అద్దె గర్భాలిచ్చిన స్త్రీలని ఇక్కడ డెలివరీకి సురక్షితమైన పరిస్థితులు లేవని ఇజ్రాయిల్ తీసుకెళ్లారు. నేపాల్ భూకంపం విసిరిన అత్యంతాసక్తికరమైన ఏర్‌లిఫ్ట్ ఇది. చరిత్రలో అరుదయిన సంఘటన ఇది. వైమానిక సిబ్బంది, ఇజ్రాయిల్ అధికారులు ఈ కార్యాన్ని జాగ్రత్తగా నిర్వర్తించి కళ్లుతెరవని 33మంది శిశువులని తీసుకొచ్చిన జంటలకి విమానాశ్రయంలో స్వాగతాన్ని పలుకుతూ కానుకలని అందిస్తూన్న ఘటన మధుర స్మృతిగా రెస్క్యూ ఆపరేషన్ చరిత్రలో

నిలిచిపోయింది.

★ ★ ★

ఇండియన్ ఎంబసీ బిజీగా ఉంది. పూర్తి వివరాలు ఇంకా బయటకి రాకపోవడంతో బంధువులు, స్నేహితులు, అధికారులు ఎంబసీ సిబ్బందితో మాట్లాడి స్థితిగతుల్ని తెలుసుకోవడం, తమ మనుషుల గురించి వివరాలివ్వడం, బతికున్నారా? గాయపడ్డారా? లిస్ట్ ఎప్పుడు పెడతారు? ప్రశ్నలు.. కోపాలు.. గందరగోళం.. గంటగంటకి మారుతున్న పరిస్థితులు.

కిరణ్, ప్రభల గురించి అన్నివైపుల నుండి, అన్నిస్థాయిల్లో వాకబు మొదలయింది.

★ ★ ★

హనీమూన్ పర్వంలో కాఠ్‌మండూకి చేరుకున్న రోజు రాత్రి విదేశంలో 'మొదటి రాత్రి'. ప్రత్యేకతని సంతరించుకొన్న రాత్రి. 'లవర్స్ సిటీస్'గా చెప్పుకునే అత్యంత మనోరంజకమైన స్థలాలని సొంతదేశంలో చూసి గుండెల నిండా ఆనందాలని, అనుభూతులని నింపుకుని పొరుగు దేశంలో పతాకస్థాయికి చేరుకోవాల్సింది. ఒకరితో మరొకరు మమేకమై హిమాలయ పర్వతాల నీడల్లో మనసులు శివ-పార్వతుల శరీరాల్లా ఒకటిగా కావడానికి ముందుకు గంతులేస్తున్నాయి. ముచ్చటగా నాలుగురోజులు గడిపి ఒక మనసు-రెండు శరీరాలుగా హైద్రాబాద్ తిరిగిపోవాల్సింది.

మనుషుల ఆలోచనలు ఇవి.

ప్రకృతి మరోలా ఆలోచించింది.

ఎనిమిది రోజులుగా ఆనందడోలల్లో ఊగుతూ, కళ్లు తెరచి ఆస్వాదిస్తూ, ఆనందంతో కళ్ళు మూసుకుంటూ తన్మయత్వం చెందుతూ కొత్తలోకాల్లో వి హరించి మరింత ముందుకు సాగుతామనుకునేంతలో చిన్ని 'కదలికలు' ఛిన్నాభి న్నం చేశాయి. గట్టి సంకల్పాలు చెల్లాచెదురయ్యాయి. కలలు కొన్ని ఎగిరిపోతే మరి కొన్ని కరిగిపోయాయి. పకడ్బంది ప్రణాళికలు, ఆలోచనలు చిందరవందరయ్యాయి. ఆశలన్నీ ఆమడ దూరం జరిగాయి.

ప్రాణాలతో బయట పడడమే ప్రధాన ఆశయమిప్పుడు. 'ఆశ' ఆశయంవైపే ఎపుడెపుడు నిజమవుతుందానని ఆశగా ఎదురు చూస్తోంది.

ప్రభకి రాత్రి భారంగా గడిచింది. పొద్దున ఎవరో వస్తారు.. తనని రక్షిస్తారు.. ఆశపూరిత ఆలోచనలు.. ఆకలి.. నీరసం.. బలహీనత.. నిద్ర అనాలా? స్పృహ తప్పుతున్న అన్నిటి మిశ్రమం అమితావస్థ! తన ప్రమేయం లేకుండానే నోటి నుండి వింత ధ్వనులు బయటకి వస్తున్నాయి. కాయంలో మాత్రం ప్రాణం భద్రంగా ఉంది.

అలికిడి.

రెస్క్యూ బృందం వచ్చింది. ఉపకరణాలు ఘోషించి చెబుతున్నాయి. పరిసరాల్లో జీవముంది. రాపిడ్ ఏక్షన్! క్షణాలు కూడా వృధా కావు వారి చర్యల్లో! కట్టర్స్‌తో జాగ్రత్తగా అడ్డంకులని తొలగించుకుంటూ ముందుకు కదులుతున్నారు. వారికంటే ముందే వెలుతురు ప్రవేశించింది. ప్రభ శరీరాన్ని మృదువుగా తాకింది. చీకటి నీ దరిదాపుల్లోకి రాదిక అంటూ ఆప్యాయంగా ముద్దాడింది.

"ఫిమేల్..ఫిమేల్.." శరీరం కనబడగానే బృందంలో ఉత్సాహం.

అతి జాగ్రత్తలు, అప్రమత్తత, ఉన్నత స్థాయి నిపుణత, వేగం... ఈ పనుల్లో మహా చతురులు వచ్చినవాళ్లు.

ప్రభ అచేతనంగా పడి ఉంది. మొహమంతా వాడిపోయింది. ఎంతో మురిపెంతో ఇష్టంగా వేసుకున్న డ్రెస్సు నిండా రక్తం, చెమట, దుమ్ము, ధూళి, మూత్రం! ఆ ప్రదేశమంతా దుర్వాసనగా ఉంది. కళ్లని అపుడపుడు తెరుస్తోంది. కానీ రెప్పలు వాటంతట అవే మూసుకుంటున్నాయి. మొహం భావ రహితంగా ఉంది.

అవయవాల్లో కదలికలు లేవు. ఛార్జ్ అయి పోయిన బాటరీతో సెల్ పక్కనే నిర్జీవంగా పడి ఉంది. ఎడమ కాలి గాయం చాలా పెద్దగా ఒక్కసారే కనబడింది. కాలిపై పడ్డ సిమెంట్ దిమ్మెని మెల్లగా పైకి ఎత్తితే తెలిసింది. ఎండిన రక్తం, రంగు మార్చుకున్న రక్తపు మరకలు, చికిత్స లేకపోవడంతో నుజ్జయిన కాలు వికృతంగా కనబడుతోంది. వాంతులు వచ్చే దుర్వాసన!

అంతర్జాతీయ బృందంలోని వివిధ రంగుల (తెలుపు, గోధుమ, నలుపు) హస్తాలు సమన్వయంతో క్షణాల్లో అతిజాగ్రత్తగా స్ట్రెచర్ పైకి ఆమెను చేర్చాయి.. మెరుపువేగంతో అంబులెన్స్‌లోకి మార్చాయి. తాత్కాలికంగా అక్కడ ప్రారంభించిన మెడికల్ కాంప్ వైపు దూసుకుపోయింది అంబులెన్స్.

రెస్క్యూ చేసిన మనుషుల సంఖ్యకి ఒకటి జోడించారు.

★ ★ ★

ప్రకృతి వైపరీత్యాలు అందరినీ సమానంగా కొట్టినా, ప్రభావితం చేసినా, స్త్రీలు అధికంగా బాధలకి గురవుతారు. అందులో యుక్త వయస్సులో ఉన్న అమ్మాయిలు, అభ్యాగ్యులైన ఆడవారిని అపహరించే ముఠాలు ప్రత్యక్షమవుతాయి. తల్లిదండ్రులని కోల్పోయి నిర్భాగ్యులైన అమ్మాయిలని టార్గెట్ చేసి నేపాల్ - బిహార్ బార్డర్ నుండి రోడ్డు మార్గాన అవలీలగా భారతదేశ పట్టణాల్లోని వేశ్యాగృహాలకి అమ్ముతారు.

ఏళ్ళనుండి జరుగుతున్న అంతర్జాతీయ రాకెట్ ఇది. విపత్తు సమయాల్లో ఈ దందా విజృంభిస్తుంది. మామూలు పరిస్థితుల్లో ప్రతి సంవత్సరం ఐదు నుంచి పది వేల మంది వరకు స్త్రీలు, ముఖ్యంగా వయస్సులో ఉన్న అమ్మాయిలు నేపాల్ నుండి భారతదేశంలో ప్రవేశిస్తారు. దళారులు వీరిని వేగంగా రవాణా చేయడంలో ఆరితేరినవారు. భూకంపం లాంటి వైపరీత్యాల దెబ్బ తగిలినప్పుడు పేద కుటుంబాల్లో సంక్షోభం వస్తుంది. బొటాబొటిగా ఉన్న జీవనోపాధి అస్తవ్యస్తమవుతుంది. కుటుంబ యజమానులు చనిపోతే అందరూ వీధిన పడతారు. మార్గాలు మూసుకుపోవడంతో దారిద్ర్యం అనే పాస్‌పోర్ట్ పట్టుకొని అంతర్జాతీయ సరిహద్దుని అవలీలగా దాటి భారత్‌లో అడుగుపెడతారు.

భూకంప సమయంలో ప్రభుత్వ యంత్రాంగం సహాయ కార్యక్రమాల్లో మునిగిపోవడంతో స్త్రీల రవాణా వైపు దృష్టి ఉండదు. దళారులకదే అదను.

కొన్ని స్వచ్ఛంద సేవాసంస్థలు కేవలం మనుషుల రవాణా రంగంలోనే పని చేస్తాయి. స్త్రీల కష్టాలని తగ్గించి మానసిక ధైర్యాన్ని నింపుతాయి. వారికోసం ప్రత్యేక శిబిరాలని తెరచి దళారుల డేగ కళ్ళ బారి నుండి రక్షణ కవచాలందిస్తుంటాయి.

★ ★ ★

రెస్క్యూ బృందం తన పనిని చకచకా ఆరంభించింది. శిథిలాల్లో కొట్టుకుంటున్న గుండె చప్పుళ్లని, ఊపిరితిత్తుల ఊదులాటలని ఆ ఉపకరణాలు బృందానికి జీవసంకేతాల రూపంలో చూపుతున్నాయి.

ఎక్కడో తెలుగుగడ్డన జన్మించిన కిరణ్ నేపాల్లో కూలిన భవన శిథిలాల్లో ఊపిరి పీలుస్తున్నాడు. జీవసంకేతాలని పసిగట్టే ఉపకరణం పలుదేశాల ప్రతినిధులు కనబడుతున్న రెస్క్యూబృందంలో కీలకమైన కర్తవ్యాన్ని నెరవేరుస్తోంది. తాను నిర్జీవమైనా బతికున్నవారి సంకేతాలని పట్టుకుంటోంది. అదే కిరణ్ ఇంకా బతికున్నాడని నిర్ధారించింది.

అస్తవ్యస్తంగా పడి ఉన్న శిథిలాలని అతి నైపుణ్యంతో తీశారు. శిథిలాలను ఒక్కొక్కటీ తీసినకొద్దీ కిరణ్ ఉన్న 'గుహ'లో లైటు వోల్టేజీ పెరిగి చీకటిని తరిమే

స్తోంది. రెస్క్యూ బృందం కిరణ్ దగ్గరకి చేరింది. కిరణ్ వెల్లకిలా అచేతనంగా పడి ఉన్నాడు. మొహం పీక్కుపోయింది. శరీరమంతా దుమ్ము కప్పేసి ఉంది. గడ్డమూ పెరిగింది. కళ్ళు మాత్రం ఆశాజనకంగా చూస్తున్నాయి. ఏదో పట్టుదల గోచరమవుతోంది.

బృందం కిరణ్ ఎడమచేతిని, దాని పరిస్థితిని గమనించింది. చేయి ఇంకా శిథిలాల కిందే ఉంది. దీనివల్లే కిరణ్‌ని అక్కడి నుండి కదిలించలేకపోతున్నారు. ఎడమ చేయి కింది భాగం ఏ మాత్రమూ కనబడ్డం లేదు. మొదటిరోజు నుండే కిరణ్‌కి స్పర్శలేదు. తనచేతికి ఏమయ్యిందో తెలియదు. బరువైన శిథిలమేదో పడడంతో చేయి నలిగిపోయుంటుంది.

దుర్వాసన దూసుకు వస్తోంది. ఈగలు, దోమలు, చీము, ఎండిపోయిన రక్తం చారలు..! రెస్క్యూ బృందం సభ్యులు కిరణ్‌తో మాట్లాడే ప్రయత్నం చేశారు. నీటిని అందించారు. నోటిని తడుపుకున్నాడు. పరిస్థితిని క్షుణ్ణంగా పరిశీలించి తక్షణమే ఒక నిర్ణయానికి వచ్చారు. తమ నైపుణ్యానికి పరీక్షగా ఉపకరణాలతో, కట్టర్స్‌తో శిథిలాన్ని ముక్కలుగా కోసి చేతిపై ఏ వస్తువు లేకుండా చేసి ఊపిరి పీల్చుకున్నారు. బృందసభ్యుల్లో విచారం.. అసంతృప్తి..! చేయి తన రూపాన్ని కోల్పోయింది. శిథిలం కింద పూర్తిగా నలిగి పచ్చడయింది. ఇన్ఫెక్షన్ మొదలయింది.

ఒక్క నిమిషం ఆలస్యం చేయకుండా కిరణ్‌ని ఎంతో నైపుణ్యంతో లేపి స్ట్రెచర్ పైకి మార్చారు.

కిరణ్ ఏదో చెప్పాలని ప్రయత్నం. బృందం సభ్యుడు అర్థం చేసుకునే ప్రయత్నం చేశాడు. సె..... సె.... సెల్ ఫోన్.... ఫో.....ఫో.... ఫోన్..!

ఒకతను పరిగెత్తి కిరణ్ పడి ఉన్నచోట అటూ-ఇటూ వెదికాడు.

"గాట్ ఇట్..! ఇక్కడుంది..!"

కిరణ్ కళ్ళలో సంతోషం.

"దీన్ని భద్రంగా ఉంచుతాం. నీవు కోలుకున్నాక ఇస్తాం"

కిరణ్ ఆయనవైపు కృతజ్ఞతా పూర్వకంగా చూశాడు. శక్తిహీనతతో ఏమీ మాట్లాడలేక పోతున్నాడు. ఆ సెల్‌లో హనీమూన్ ఫోటోలతో పాటు, తమకి హాని కలిగించిన ఫోటోలు కూడా ఉన్నాయని బృందానికి తెలియదు. కిరణ్‌కి అవెంతో విలువైనవి.

ఒక్కసారే వెలుతురు పెరగడంతో కిరణ్ కళ్లు మూసుకున్నాడు. అంబులెన్స్ వైద్యశిబిరానికి పరుగులు తీసింది.

రెస్క్యూ చేసిన మనుషుల సంఖ్య ఒకటిని జోడించుకుంది.

ప్రకృతి విపత్తుల్లో అసాధారణ పరిస్థితుల్లో బతికి బయటపడ్డ వారిని మీడియా ప్రత్యేక కథనాలు చేసి చూపుతుంది. విపత్తు స్వభావాలని బట్టి వారు బతికి బయటపడ్డ కథనాలు ప్రేరణనిస్తాయి. కంట తడిపెట్టిస్తాయి కూడా! వరదల మధ్యలో చెట్టుకొమ్మని పట్టుకొని ఓ మనిషి మూడురోజులు బతుకుతాడు. తరువాత ప్రభుత్వ యంత్రాంగమో లేక స్థానికుల సహాయంతోనో ఒడ్డుకి చేరుకుంటాడు. భూకంపం శిథిలాల్లో చిక్కుకొన్న ఓ మహిళ వారం రోజులకి ప్రాణాలతో బయటపడుతుంది. మరోచోట శిశువుకి ఎలాటి గాయాలు లేకుండా నిద్రపోతూ సురక్షితంగా కనబడుతుంది. చనిపోయిన వారి సంఖ్య పెద్దమొత్తంలో ఉన్నా చిన్న సంఖ్యలో అదృష్టజీవుల ఆశ్చర్యపూరిత సంఘటనలూ జరుగుతూనే ఉంటాయి. ఎదురుచూసేవారి ఆశలని తొందరగా చావకుండా మరింత ఆశతో ఉండమని చెబుతాయి. మృత్యువాదం ఎలాటి అవకాశం ఇవ్వకుండా ఏకంగా ప్రాణాలని హరిస్తుంది. కానీ మరొక వాదం కూడా

ఉంది. అది గాయాల వాదం. ప్రాణం వారిని వదలదు. శరీరం గాయాలకి లోన వుతుంది. గాయాల స్వరాలని బట్టి తీవ్ర స్వల్ప గాయాలుగా వర్గీకరించుకుంటాం. దీని ఆధారంతోనే పరిహారాలని నిర్ణ యించి చెల్లిస్తుంది ప్రభుత్వం.

ఇలా పలు దేశాల్లో విపత్తులతో దెబ్బ తిన్న ప్రాంతాల్లో చిత్రాలు.. విచిత్రాలు.

మీడియాలో ప్రభ- కిరణ్‌లు జీవించి ఉన్న వార్త ప్రసారం అయ్యింది. బుల్లితెర అడుగున ఈ వార్త అక్షరాల మాల రూప ధారణతో దినమంతా ప్రదక్షిణలు చేస్తూనే ఉంది. బంధువులు, మిత్రులకి సంతోషం. అదేరీతిలో చనిపోయిన వారిని నిర్ధారిస్తూ ప్రదక్షిణలు చేస్తున్న పేర్లూ... వార్తలు. సంతోషం.. దుఃఖం పక్కపక్కనే మకాం!




అంతర్జాతీయస్థాయిలో అన్ని సౌకర్యా లతో విపత్తు కార్యక్రమాల ప్రామాణికాల ప్రకారం వైద్యశిబిరం ఏర్పాటుచేశారు. ఆప రేషన్ థియేటర్‌లతో సహా ఉన్నతస్థాయి సేవలందించే సౌకర్యం. శిథిలాలు మీద పడి గాయాలకి లోనై బతికి బయటపడ్డవా రిని వేగంగా శిబిరాలకి తరలించి సత్వ రమే వైద్య సేవలనందిస్తున్నారు. రెస్క్యూ పనులు కొన్ని రోజులవరకు కొనసాగుతుం టాయి. ప్రాణాలని కాపాడడం ప్రధానో ద్దేశ్యం. రెస్క్యూ సేవలందక శిథిలాల కిం దే ఉన్నవారికి ఇక గాయాల ప్రభావం మొదలవుతుంది. రక్తనష్టం జరుగుతుంది. ఇన్ఫెక్షన్ మొదలై గాయాలు చీము పడ తాయి. సంక్రమిత వ్యాధుల ప్రమాదం ఏర్పడుతుంది. ఆ విలువైన ప్రాణాలని కాపాడటానికి డాక్టర్లు కఠిన నిర్ణయాలు తీసుకోవడం తప్పనిసరి. ప్రాణాన్ని కల కాలం ఉంచాలంటే ముప్పు తెచ్చే శరీరభా గాలని తొలగించక తప్పని పరిస్థితి. జీవిని బతికించడం కీలకం. వైద్యశిబిరంలో పడక లని చూస్తే ఆస్పత్రుల్లోని ఆర్థోపెడిక్ వార్డులు గుర్తుకు వస్తున్నాయి. శరీరాంగా లని అతికించడానికి, కాళ్ళు చేతులు అతి కించడానికి తాత్కాలిక అమరికలు. పడక లపై ఉన్న రోగులలో ప్రాణమొక్కటి ఉమ్మడి లక్షణం. అంగాల విన్యాసాల్లో వైవిధ్యం. అదృశ్యమైన కాళ్ళు చేతులు, ఎముకలనొక్కటి చేయడానికి ప్లాస్టర్లు, తీవ్రగాయాలకి తలలకి కట్టిన పట్టీలు.. అంగచ్ఛేదనలు.. మూసుకుపోతున్నగా యాలు..

హృదయవిదారకమైన రూపాల్లో బతికి బయట పడ్డవారు.

రూపం అందవికారమైనా అచంచలమైన ధైర్యసాహసాలతో ప్రాణాలని నిలుపుకుని బయటపడ్డవారు.

ప్రభ ఒక బెడ్డుపై బలహీనంగా.. కళ్ళు మూసుకుని ఉన్నాయి. అనస్తీషియా ప్రభా వంలో ఉన్నట్టుంది.

పుట్టుకతో చక్కని రెండు కాళ్ళతో వచ్చింది. తేడాలేమీ లేని కాళ్ళు - ఒక్క కుడి.. ఎడమ.. తప్ప!

ఇప్పుడు అసమానం! ప్రాణం నిలపడం కోసం ఎడమ కాలిని తీసెయ్యక తప్ప లేదు. తన బరువుని బాధ్యతగా మోస్తూ వస్తున్న కాలికి తోడులేదిప్పుడు. ప్రభకి పుడు ఒక్క కాలే. ఎడమ కాలు మోకాలి వరకే! పుట్టినప్పుడు సమానంగా పెరిగి నడకలు, పరుగులు నేర్చిన కాళ్ళు విడిపోక తప్పలేదు.

## కొత్తగాలి...

**కష్టపడే వారికి**
**దారులుంటాయి**
**బద్ధకస్తులకు**
**సాకులుంటాయి!**

– బిక్కునూరి రాజేశ్వర్,
పొన్కల్

శరీరంలో ఒక ముఖ్యాంగానికి కళ్ళ ముందే చావు. అంత్యక్రియలూను! కాలు పోయింది. కాయం మిగిలింది.

ప్రభ మెల్లగా కోలుకుంటోంది.

★ ★ ★

మరణించిన వారి కంటే గాయపడిన వారి సంఖ్య ఎక్కువ. భూకంపం తీవ్రతని బట్టి, అవసరాలని బట్టి సహాయాన్నందించడానికి ముందుకు వచ్చిన దేశాలు, అంతర్జాతీయ సంస్థలు వైద్య శిబిరాలని మెరుపు వేగంతో నెలకొల్పుతున్నాయి. పెద్దసంఖ్యలో గాయపడిన వారికి పలు శిబిరాల్లో సేవలు కొనసాగుతూ ఉన్నాయి.

మరో పెద్ద శిబిరం. అన్ని వయసుల్లో ఉన్నవారు. ఆడా, మగా, స్థానికులు, విదేశీయులు.. ప్రాణాలని నిలుపుకున్నవారు!

అందులో ఒక బెడ్డుపై కిరణ్!

మైనస్ ఎడమచేయి!

ప్రభ ఒక వైద్యశిబిరంలో.

కిరణ్ మరో వైద్యశిబిరంలో.

హనీమూన్ జంటగా సర్వాంగాలతో నేపాల్లో అడుగుపెట్టారు!

విడివిడిగా భూకంపంలో చిక్కుకున్నారు.. ఎదుర్కొన్నారు.. ప్రాణాలతో బయటపడ్డారు కానీ ఒకరు కాలిని.. మరొకరు చేతిని కోల్పోయారు.

రెండు శరీరాలు.. ఒక మనస్సు. మూడు కాళ్ళు! మూడు చేతులు!!

ఒకరి గురించి ఇంకొకరికి తెలియదు. సెల్ ఫోన్లు నిర్జీవం.

ఇద్దరూ బతికే ఉన్నారని బంధుమిత్రులందరికీ తెలిసిపోయింది. కానీ బయటపడ్డ కిరణ్.. ప్రభల మధ్య ఎలాటి కాంటాక్ట్ లేదు. ఒకరు మరొకరి చింతనలో చిత్రవధని అనుభవిస్తున్నారు. అనస్తీషియా ప్రభావం కొంత చిత్రవధ తీవ్రతని కాస్త తగ్గించిందేమో?

కిరణ్ ఆలోచనలన్నీ ప్రభ గురించి!

ప్రభ ఆలోచనలన్నీ కిరణ్ గురించి!

సుమారుగా రెండు కిలోమీటర్ల దూరంలో ఒకరికి తెలియకుండా మరొకరు వేర్వేరు వైద్యశిబిరాల్లో కోలుకుంటున్నారు.

కాఠ్మండూలో పరిస్థితి క్రమంగా మెరుగవుతోంది. పర్వతప్రాంతాల్లో ఉన్న చిన్న చిన్న పట్టణాలు గ్రామాల నుండి సమాచారం మెల్లమెల్లగా చేరుతోంది. మౌలిక వసతుల్లో కొంత పునరుద్ధరణ కనబడటంతో దూరప్రాంతాల వారికి సహాయాన్ని అందించే ఒత్తిడితో ప్రభుత్వం ఉక్కిరిబిక్కిరవుతోంది. ఎర్ పోర్ట్ రన్ వే స్థితి బాగా లేదు. సహాయసామగ్రితో వచ్చే పెద్ద విమానాలు దిగడానికి అనుకూలంగా లేదు. దాంతో విమాన రాకపోకలని తాత్కాలికంగా ఆపాల్సివచ్చింది. రాత్రి పూట వేగంగా మరమ్మతు పనులని చేయించి మరునాటికల్లా మెరుగుపరచి ఒక కొలిక్కి తెచ్చారు.

అంతర్జాతీయ సంస్థలు అవసరాలకనుగుణంగా చేయూతనందిస్తున్నాయి. దక్షిణాసియాలో 'బిగ్‌బ్రదర్' అయిన భారత దేశం నుండి కూడా ఎందరో వాలెంటీర్లు, పలు స్వచ్ఛంద సంస్థలు నేపాల్లో సహాయ కార్యక్రమాలకి శ్రీకారం చుట్టారు. అంతటి ఘోరవిపత్తులో ఏ చిన్న సహాయాన్నందించినా కొంతమేరకు బాధని తగ్గించినట్టే.

కిరణ్- ప్రభల బంధుమిత్రులు చాకచక్యంతో ఓ నేపాలీ స్వచ్ఛంద సేవా సంస్థని

కాంటాక్ట్ చేశారు. దాని పేరు 'ప్రొటెక్షన్ ఆఫ్ రైట్స్ ఇన్ సౌత్ ఏషియా' క్లుప్తంగా 'ప్రిసా' అంటారు. అప్పటికే ప్రాథమిక పరిచయాలు.. ఉపోద్ఘాతాలు జరిగాయి. స్థానిక సహాయం కోసం అభ్యర్థించారు. దాని డైరెక్టర్ గోపాల్‌థాపా.

"నమస్తే గోపాల్‌థాపాజీ! మీరందిస్తున్న సహాయానికి చాలా కృతజ్ఞతలు. ఎంతో బిజీగా ఉండే మీరు ముఖ్యంగా నేపాల్ని దెబ్బతీసిన ఈ సమయంలో మాకు గట్టిగా సహాయాన్నందించడానికి ముందుకొచ్చారు. మీకు రుణపడి ఉంటాం" కిరణ్ తండ్రి.

"నమస్తే! అన్ని విషయాలు తెలిశాయి. మీ అబ్బాయి, కోడలు సంతోషంగా నేపాల్లో గడపడానికి వస్తే ఈ ఘోరం జరిగింది. మేమెంతో బాధపడుతున్నాం. మీరేమీ చింతించకండి. ఇక్కడ మా సంస్థ ఇదే పనిలో బిజీగా ఉంది. మీరు ఇద్దరి ఫొటోలు, వివరాలు వెంటనే పంపండి. బతికే ఉన్నారని చెప్పారు.. సంతోషం! మీరు అదృష్టవంతులు!"

"ఐదు నిమిషాల్లో పంపుతాం! మీరు ఈ- మెయిల్ ఐడి ఇవ్వండి, థాంక్స్!"

ఫొటోలు, పేర్లు.. ప్రాథమిక సమాచారంతో గోపాల్‌థాపాకి చేరాయి. ఇద్దరు సీనియర్లను పిలిచి, కిరణ్, ప్రభల ఫొటో కాపీలనందించి వైద్య శిబిరాలకి వెళ్లి వెతికిరమ్మని పంపాడు.

గంటలో గోపాల్‌థాపాకి ఫోన్ వచ్చింది. కిరణ్ ఒక శిబిరంలో ఉన్నాడని చికిత్స పొందుతున్నాడని, మరికొన్ని వివరాలు ఇచ్చాడు.

"కిరణ్ మాట్లాడే స్థితిలో ఉన్నాడా?" గోపాల్‌థాపా అడిగాడు.

"బలహీనంగా ఉన్నాడు. ఎడమ చేయి తీసేశారు.. కోలుకుంటున్నాడు"

"నీవక్కడే ఉండు! నేను వస్తున్నాను" గోపాల్‌థాపా కార్లో బయలుదేరాడు. ఒక నిమిషం అయ్యిందో? లేదో? ఇంకో

> ## కొత్తగాలి...
>
> **సూర్యుడు అస్తమించాడా?**
> **లేదు... లేదు**
> **ఆ వైపు బిడ్డల్ని చూసి**
> **ఉదయానికల్లా రాడూ!**
>
> – అయినాల కనకరత్నాచారి,
> కొరిశపాడు, ప్రకాశం జిల్లా

కొలీగ్ నుండి మరో శుభవార్త! గొంతు సంతోషంగా వినిపిస్తోంది. ప్రభ బెడ్డు పక్కనుండే మాట్లాడుతున్నానని నిర్ధారిస్తూ తెలిపింది తారాశ్రేష్ఠ.

ఇంత తొందరగా పనవుతుందని గోపాల్‌థాపా అనుకోలేదు. ఇద్దరి జాడ తెలిసింది. ఎంతో సంతోషంగా ఉంది. ఎపుడెపుడు ఇద్దరినీ చూద్దామా? అని ఆయన మనసు ఉరకలు వేస్తోంది.

మొదట ప్రభ దగ్గరికి చేరుకుని పరిచయం చేసుకున్నాడు. హైద్రాబాద్ నుండి ఫోన్లు వచ్చిన సంగతి చెప్పాడు. కిరణ్ తన లాగే మరో శిబిరంలో ఉన్నాడన్న వార్తని ప్రభకి అందించాడు.

నోటమాట రాలేదు ప్రభకి.

"నిజంగానా? ? ఎంత కమ్మని వార్తని చెప్పారు!" చేతులు జోడిస్తూ కృతజ్ఞతాపూర్వకంగా గోపాల్‌థాపా వైపు నీళ్లు నిండిన కళ్లతో చూసింది. పెదిమలు వణుకుతున్నాయి. మాటలు వెలికిరావడానికి నానా అవస్థ పడుతున్నాయి. మనస్సులోనే దేవతలందరిని స్మరించుకుంది.

"బహెన్- జీ సంతోషించదగ్గ విషయం. ఏడవ వద్దు. మీరు ఎంతో అదృష్టవంతులు. వేలల్లో చనిపోయారిక్కడ.

మీరిద్దరు ప్రాణాలతో బయటపడడం చిత్రం కాదా? ఇక్కడ మేం మీకు అండగా

ఉన్నాం. ఇప్పుడు మీకేమీ కాదు. మిమ్మల్ని క్షేమంగా హైద్రాబాద్ పంపిస్తాం" ధైర్యాన్ని నింపాడు గోపాల్ థాపా.

ఎడమ కాలికున్న కట్టుని గమనించాడు. కొలీగ్ వైపు చూశాడు. ఆమె నేపాలీ భాషలో చెప్పింది.

కొలీగ్ వైపు చూపిస్తూ "ఈమె తారా శ్రేష్ఠ! మా సంస్థలో పనిచేస్తోంది. ఇంకా స్పేపు ఇక్కడే ఉంటుంది. నేను వెంటనే వెళ్లి కిరణ్‌భాయ్‌ని కలిసి అక్కడ నుండి మీ ఇద్దరినీ మాట్లాడిస్తాను. నేను భాయ్‌ని చూసి ఆయనతో మాట్లాడాలి. మళ్లీ కలుస్తాను" చేతులు జోడించి గోపాల్‌థాపా శిబిరం నుండి బయటకి అడుగులేశాడు. తారాశ్రేష్ఠ ప్రభ పక్కనే తోడుగా ఉంది.

గోపాల్‌థాపాకి ఎంతో ఆనందంగా ఉంది. కష్టాల్లో కూడా కొందరు అదృష్టవంతులు ఉంటారనటానికి ఈ ఇద్దరినీ ఉదాహరణగా చెప్పుకోవచ్చు. కొత్త జంట.. హనీమూన్‌కి వచ్చారు. అదృష్టమేమంటే? ఇద్దరూ బతికున్నారు. ఇంతకంటే గొప్ప అదృష్టం ఉంటుందా? ఇద్దరికీ ఆంప్యుటేషన్ అయ్యింది. అది దురదృష్టం. ఒకరికొకరు ఎక్కడున్నారో తెలియదు. వారి కుటుంబాలు హైద్రాబాద్‌లో అంధకారంలో ఉన్నాయి. తాను రంగంలో దిగిన రెండు గంటల్లో ఇద్దరూ ఎక్కడున్నారో గుర్తించడం తనకీ ఎంతో సంతోషంగా ఉంది.

మరో శిబిరంలో అడుగుపెట్టి తన కొలీగ్ కోసం చూశాడు గోపాల్‌థాపా. రామ్ బహదూర్ ఓ బెడ్డు పక్కన కూచొని కిరణ్‌తో ముచ్చటిస్తున్నాడు. గోపాల్‌థాపా



ఆ బెడ్డు దగ్గరికి చేరాడు.

"కిరణ్ భాయ్! నమస్తే!" చేతులు జోడించాడు.

"నమస్తే!" చిరునవ్వుతో కుడిచేత్తో సెల్యూట్ చేశాడు కిరణ్.

"ప్రభ బహెన్‌జీని కలసి వస్తున్నాను. నిన్ను కలసి, నీతో మాట్లాడాక, మీ ఇద్దరినీ మాట్లాడిస్తానని ప్రామిస్ చేశాను. మనసారా మాట్లాడుకోండి!" అని తన సెల్‌తో తారాశ్రేష్ఠ సెల్‌కి చేశాడు. తారాకి నేపాలీ భాషలో సలహా ఇచ్చి తన చేతిలోని సెల్‌ని కిరణ్ చేతిలో పెట్టాడు.

'హే! పశుపతినాథ్! వీరిద్దరికీ ఎలాటి కష్టాలు తెచ్చావ్! క్షేమంగా వీరిని హైద్రాబాద్ చేరేట్టు చూడు!' గోపాల్‌థాపా మెల్లగా తనలో తానే అనుకుంటూంటే కళ్లల్లో నీళ్లు నిండాయి. రామ్ బహదూర్ తన బాస్ ఉద్వేగాన్ని గమనించి దగ్గరగా జరిగి "చాలా మంచివాడిలా ఉన్నాడు. ఇంజనీరింగ్ చదివాడట. భార్య చార్టర్డ్ అకౌంటెన్సీ పూర్తిచేసిందట. హనీమూన్ కోసం మన దేశానికి వచ్చారట" సారాంశాన్ని అందించాడు.

"ప్రభా!" కట్టలు తెంచుకుని ఏడుపు దూసుకొచ్చింది.. కిరణ్ బోరున ఏడుస్తున్నాడు. కాస్త దూరంలో ఉన్న గోపాల్ థాపా, రామ్ బహదూర్ దగ్గరికి చేరి కిరణ్‌ని దగ్గరకు చేర్చుకుని ఓదార్చారు. కన్నీళ్లు తుడిచారు.

కిరణ్ ఏడుపు విన్న ప్రభకి కూడా ఒక్కసారిగా ఏడుపు వచ్చింది. తాను ఏడిస్తే కిరణ్ ఎక్కడ డీలాపడిపోతాడోనని ఆపు



కునే ప్రయత్నం చేసింది. ప్రభపై చేయి వేసి ఓదార్చి తారా దగ్గరికి చేర్చుకుంది.

ఇద్దరి ఏడుపు కొనసాగింది. పదాలు లేని సంభాషణ! పదాలకి అందని భావాలు! రోదన రూపంలో చెవినుండి మెదడులోకి చేరుకుంటున్నాయి. హృదయాలు కరిగించే కొత్త జుగల్‌బందీ!

"ఎలా ఉన్నావ్ కిరణ్?"

అతికష్టంతో ఏడుపు ఆపుకొని వేసిన ప్రశ్న అని కిరణ్ వెంటనే గ్రహించాడు.

"బాగున్నాను! నువ్వు..? నువ్వు ఎలా ఉన్నావ్? నీ శిబిరానికి దగ్గరలో వున్న మరో శిబిరంలో నేనున్నానట! ఎడమ చేతికి గాయం.. పెద్దగానే! నువ్వెలా ఉన్నావ్?"

"బాగున్నాను! ఆరోజు నువ్వు వెళ్లినప్పటి నుండి ఇప్పటికీ నీ రాక కోసమే ఎదురు చూస్తున్నాను. గంటలో వస్తానన్నావ్! రోజులు గడిచాయి. నాకు ఎడమ కాలికి పెద్ద గాయమే అయ్యింది. మనమెపుడు కలుసుకుంటాం?" గోముగా అడిగింది. గొల్లుమని మళ్లీ ఏడుపు.. కట్టలు తెంచుకుని తోసుకొస్తోంది.

"మనం వేర్వేరు శిబిరాల్లో ఉన్నాం. మూడురోజుల్లో నన్ను డిశ్చార్జ్ చేస్తారట. అంతవరకు ఎడబాటు తప్పదు ప్రభా!"

ప్రభ మెల్లిగా ఏడుస్తూనే ఉంది.

"ప్రభా! ఏడవకు. నేను గోపాల్‌థాపాతో మాట్లాడి మార్గం ఆలోచిస్తాను. ఆయన్ని రిక్వెస్ట్ చేసి నిన్ను తొందరగా కలిసే ప్రయత్నం చేస్తాను. నువ్వు ధైర్యంగా ఉండు. పెద్ద భూకంపం నుండి బతికి బయటపడ్డాం. ఇప్పుడు మనకేమీ కాదు. మనల్నెవ్వరూ విడదీయలేరు. హనీమూన్ లోని 'హనీ'.. 'హాని'గా మారింది అంతే!" ఓదారుస్తూ, తేలిక పరచడానికి చివరి వాక్యాన్ని ప్రభని నవ్వించడానికి అన్నాడు.

గోపాల్‌థాపా, తారాశ్రేష్ఠ, రామ్ బహదూర్ ఆనందంతో చూస్తున్నారు. తెలుగులో సంభాషణ జరుగుతోంది. అర్థం కాకున్నా, ఇద్దరినీ కలిపినందుకు వారు ఎంతో తృప్తిగా ఉన్నారు. రంగంలోకి దిగి రెండు గంటలే అయినా, ఇద్దరినీ కలిపిన ఫలితాలని కళ్లారా చూస్తున్నందుకు ఆనందపడిపోతున్నారు.

"మీ నాన్నగారికి మాటిచ్చాను! మీ ఆచూకీ తెలియగానే మాట్లాడిస్తానని.." అంటూ వెంటనే ఇండియాకు కనెక్ట్ చేసి "మీ అబ్బాయితో మాట్లాడండి!" అన్నాడు సూటిగా! అమితోత్సాహంతో సెల్‌ని కిరణ్ చేతిలో పెట్టాడు. మరో సెల్‌తో తారాశ్రేష్ఠతో మాట్లాడి ప్రభని కూడా తన కుటుంబ సభ్యులతో మాట్లాడించాడు.

"కిరణ్..! కిరణ్..! ఎలా ఉన్నావురా? ప్రభ ఎలా వుంది?" మాటలు ఆతురత, దుఃఖం మిళితం చేసుకుని వచ్చాయి.

కిరణ్‌కి ఏడుపు ఆగలేదు. బలవంతాన ఆపుకుంటూ, తండ్రిని అధైర్యపరచకూడదని, తాను ధైర్యాన్ని సమీకరించుకుని "బాగానే ఉన్నాను నాన్నా! ఎడమచేతికి గాయం అయ్యింది. రెస్క్యూ చేసి వైద్యశిబిరంలో ఉంచారు. చేతికి చికిత్స జరుగుతోంది. ప్రభ మరో శిబిరంలో ఉంది. తనకీ కాలికి పెద్ద గాయమట! నేనింకా ప్రభని కలవలేని స్థితిలో ఉన్నాను" దుఃఖం సునామీలా ఒక్కసారే వచ్చింది.

కిరణ్ తండ్రికి మాట రావడంలేదు. ఆయన్ని చూస్తూ చుట్టూతా ఉన్న కుటుంబ సభ్యులు కూడా గాభరా పడుతున్నారు. ఒకరినొకరు అయోమయంగా చూసుకుంటున్నారు. విషయాలు ఎవ్వరికీ అర్థం కావడం లేదు.

"నాన్నా కిరణ్! ధైర్యంగా ఉండరా! గోపాల్‌థాపాతో మాట్లాడాను. పౌర విమానాల రాకపోకలు మొదలయ్యాక మేం కాఠ్‌మండూ చేరుకుంటాం. మనకి అన్నివిధాలా అండగా ఉంటాడు!"

బరువైన గుండెలతో ఇద్దరూ సంభాషణ

ముగించారు.

హైద్రాబాద్‌లో అందరికీ పెద్ద రిలీఫ్. ప్రభా- కిరణ్‌లతో మట్లాడారు. స్థానికంగా గోపాల్ థాపా రంగంలోకి వచ్చాక పనులకి ఒక ఊపు వచ్చింది. కొన్ని గంటల్లో ఇద్దరినీ కలవడం, తానిచ్చిన మాట ప్రకారం, కుటుంబసభ్యులతో మాట్లాడించి భరోసా పెంచడం, కనెక్ట్ చేయడం గొప్ప ఊరట!

అనుకున్న మార్గాల్లో పనులు కదులుతూండటంతో శోకంలో ఉన్న కుటుంబ వాతావరణంలో కదలికలు! అన్నిరకాల పూజలు, మొక్కులు, ముడుపులు ఎవరి పరిధుల్లో వారు చేసుకుంటున్నారు, మొక్కుకుంటున్నారు.

"గోపాల్ భాయ్! మెనీథాంక్స్! అందరితో మాట్లాడించావు. ఈ రోజు మా అందరి జీవితాల్లో మరవలేని రోజు. నువ్వు దేవుడిలా వచ్చావు. మమ్మల్ని అందరినీ కనెక్ట్ చేశావు. నీ మేలు నిజంగా గొప్పది. రెండు చిన్న కోరికలని తీర్చమని నిన్ను అడగాలనిపిస్తోంది" కిరణ్ ఎంతో కృతజ్ఞతాభావంతో అడిగాడు.

"మొహమాటపడకు కిరణ్‌భాయ్! ఏంటో చెప్పు? "

"ఈ స్థితిలో మా ఇద్దరి ఫొటోలు తీసి నాన్నగారికి పంపకు. మమ్మల్ని చూసి భరించలేరు. తర్వాత మెల్లగా చెబుదాం. వారు అర్థం చేసుకుంటారు. రెండోది... నేను నడిచే స్థితిలో ఉన్నాను. నన్ను ఒకసారి ప్రభ దగ్గరికి తీసుకెళ్తావా? తనని చూడాలని మనసు పీకుతోంది! దగ్గర్లో ఉండీ చూడలేనందుకు గిల్టీగా ఉంది!"

"రెండూ చాలా సులభమైన పనులే! కిరణ్‌భాయ్ నీ ఫోనివ్వు! దాన్ని ఏక్టివేట్ చేసి ఇస్తాను. నువ్వే నేరుగా హైద్రాబాద్ మాట్లాడుకోవచ్చు. మేం వైద్యశిబిరం అధికారులతో మాట్లాడాం.. మీ ఇద్దరినీ కలపడానికి మార్గం ఎలా అని? బెడ్స్ అన్నీ ఫుల్! చూస్తున్నావుగా, గాయ పడినవారు వస్తూనే ఉన్నారు. మీ ఇద్దరినీ ఒకే శిబిరంలో ఉంచడానికి కూడా చర్చించాం! కొంచెం టైమ్ పడుతుంది. నువ్వు ప్రభని కలవడం రేపు కుదరవచ్చు. డాక్టర్ చెకప్ చేసి ఒక గంట అనుమతి ఇస్తే మేం నిన్ను ప్రభ ఉంటున్న శిబిరానికి తీసుకెళ్తాం" గోపాల్‌థాపా అన్ని పనులని సులభతరం చేస్తూ భరోసా ఇచ్చాడు.

గోపాల్‌థాపా, రామ్ బహదూర్ దగ్గరగా జరిగి కిరణ్ చేతిని ఆప్యాయంగా స్పృశించి సెలవు తీసుకున్నారు. ఆ

## మార్చి - 2017
## చతుర ప్రవేశిక విజేతలు వీరే!

డ్రాలో ఎంపికైన ఈ అయిదుగురికీ త్వరలో బహుమతులు అందుతాయి.



1. **పి. బాలు**
   - పుత్తూరు, చిత్తూరు జిల్లా
2. **గోటూరు చంద్రపద్మావతి**
   - ఒరుగంటివారి వీధి, విజయనగరం
3. **గరిమెళ్ల వెంకటలక్ష్మీ మాధవి**
   - గురజాడవారి వీధి, కాకినాడ
4. **జి. శైలూషి**
   - హైదర్‌నగర్, హైదరాబాద్
5. **వి. వెంకటరామనర్సయ్య**
   - కుమార్‌పల్లి, హన్మకొండ

## సరైన జవాబులు

| | |
|---|---|
| 1. హారిక | 6. కొడుకు |
| 2. మానస | 7. నూరున్నీసా |
| 3. బాసిద్ ఖాన్ | 8. కేకే (క్రిష్ణ కిషోర్) |
| 4. టీవీ 333 | 9. శ్రీధర |
| 5. అనోషా | 10. ఛార్లెస్ |

చేతుల స్పర్శ కిరణ్‌లో హిమాలయాలంత భరోసాని నింపింది. మాకిక ఎలాటి ఢోకా లేదన్న ఉపశమనం.. నమ్మకమూనూ!

తారాశ్రేష్ఠ ఉన్నంతలోనే ప్రభ జుత్తుని తన దగ్గరున్న దువ్వెనతో సవరించింది. ఒక 'బిందీ' తీసి నుదుట అంటించింది. మొహాన్ని కాస్త రిఫ్రెష్ చేసి ఓసారి చూసుకొమ్మని అద్దాన్ని చేతికిచ్చింది. చిన్ని అద్దంలో చితికిపోయిన మొహాన్ని చాలరోజుల తరువాత చూసుకొని చిన్నగా నవ్వుకుంది ప్రభ. కావలసిన అవసరాలేంటో ప్రభని మరీ మరీ అడిగింది తారాశ్రేష్ఠ.

“నీ ఆప్యాయతకి, సహకారానికి చాలా కృతజ్ఞతలు! నీ కుటుంబంతో కలిసి హైద్రాబాద్ రావాలి. మా ఆతిథ్యం స్వీకరించాలి. చుట్టుపక్కల ఉన్న ప్రదేశాలని చూపిస్తాం” చేతిలో చేయివేసి ప్రభ సన్నగా పలికింది. శరీరం బలహీనంగా నీరసంగా ఉంది. మాటలు పొడిగా ఒకటి ఒకటిగా వస్తున్నాయి.

“తప్పకుండా వస్తాం! మీరు మొదట కోలుకొని మామూలు మనుషులై చురుగ్గా తిరగాలి. అదే మా కోరిక” సెలవు తీసుకుంటూ ప్రభ చేతిని సున్నితంగా వదిలి తారాశ్రేష్ఠ శిబిరం నుండి బయటికి అడుగులేసింది. వస్తున్న దుఃఖాన్ని ఆపుకుంటూ కన్నీటిని రుమాలుతో తుడుచుకుంటూ 'హే భగవాన్! పశుపతినాథ్! వీళ్ళని కాపాడు! పడ్డ కష్టాలు చాలు! క్షేమంగా హైద్రాబాద్ చేర్చు భగవాన్!' మనస్సులోనే ప్రార్థించింది.

సీదాసాదాగా సాగిపోతున్న ఏప్రిల్ నెల. ఇరవై నాలుగో తేదీవరకు అమాయకంగా ఉండి మరునాడు ఘోరవిపత్తుతో మానవరక్తాన్ని కసిగా పులుముకుని కాలెండర్లో ఎరుపురంగుని సంతరించుకుంది. తొమ్మిదివేలమందికి పైగా చనిపోయారు. రెండింతలు గాయపడ్డారు. ఇళ్ళు, స్కూళ్ళు, ప్రభుత్వ సంపద, పశువులు, రోడ్లు, ఇంకా ఇంకా.. ఎన్నో.. ఎన్నెన్నో.. క్షణాల్లోనే! అన్నీ గాడి తప్పాయి.

సెకన్ల ముల్లు కదులుతూనే ఉంది. దాని కర్తవ్యాన్ని కక్ష్య తప్పకుండా చేస్తూనే ఉంది. మందకొడిగా కదిలే మరో రెండు ముళ్లని ఎద్దేవా చేస్తూ చక్కర్లు కొడుతూనే ఉంది.. మే నెల గడప దాటింది. మరో నెల.. కొత్త ఆశలు.. కొత్త సవాళ్లు..

శిబిరం వారు ఇచ్చిన డిన్నర్ చేసి కిరణ్ మాత్రలు మింగి కళ్ళు మూసుకున్నాడు. పగటిపూట జరిగిన ఘటనలు ఒక్కొక్కటి జ్ఞాపకానికి వస్తున్నాయి. 'ఎంత తియ్యని రోజు! ప్రభ బతికుంది. మాట్లాడాను. రేపు చూస్తాను. నాన్నతో మాట్లాడాను' మనస్సులో పదేపదే ఇవే మాటలు దొర్లుతున్నాయి.. సేద తీరుస్తున్నాయి.. ప్రశాంతత నింపుతున్నాయి.

'నేనెంత అదృష్టవంతుణ్ణి! కాదు కాదు.. మేమిద్దరం చాలా అదృష్టవంతులం! ఏ ఒక్కరు చనిపోయినా పర్యవసానాలు ఎలా ఉండేవి? అంతుపట్టని ముగింపు. ఇప్పుడు హనీమూన్ క్లైమాక్స్ ఎలా ముగుస్తుందో? ఎంత ఆశావాదిగా ఉందామన్నా ప్రభని ఎపుడెపుడు చూస్తానా? అన్న దిగులు పొడసూపుతోంది. చూడకుండానే చనిపోను కదా! అన్న పిరికితనమూ తొంగిచూస్తోంది. బుర్ర వేడెక్కుతోంది. ఇలాటి స్థితి కోలుకుంటున్న శరీరానికి అంత మంచిది కాదని మరోవైపు మనస్సు పీకుతోంది'

ఆలోచనలకి అడ్డుకట్ట వేసి, చూసిన ప్రదేశాలని ముఖ్యంగా ప్రభ చుట్టూతా అల్లుకున్న జ్ఞాపకాలని పదేపదే గుర్తుచేసుకుంటూ, సంతోషాన్ని మనసులో నింపుకుంటూ నిద్రలోకి జారిపోయాడు. మోచేయి పైవరకు తీసేసిన 'చేయి' కిరణ్ శరీరం పక్కన విశ్రాంతి తీసుకుంటోంది. తెల్ల బాండేజీతో అపుడే పుట్టిన శిశువులా పక్కనే నిద్రిస్తోందా అని దూరం నుండి

చూసేవారికి భ్రమ కలగక మానదు!

మరో శిబిరంలో ఉన్న ప్రభకీ నిద్రపట్టడం లేదు. ఆలోచనలు కిరణ్‌నీ చుట్టేస్తున్నాయి. ఉక్కిరిబిక్కిరి చేస్తున్నాయి.

'ఎంత సంతోషకరమైన రోజు. ఇద్దరమూ భూకంపపు దాడి నుండి ప్రాణాలతో బయటపడ్డాం. ఒకరితో ఒకరు మాట్లాడుకోవడంతో నిర్ధారణ కూడా అయ్యింది. ఇప్పుడు గొంతు చించుకుని చెప్పుకోవచ్చు 'మాది అదృష్టపు జంట' అని! సినిమా ప్రేమకథల్లో చూసే ట్రాజెడీ ముగింపు కాదు. భూకంపం నుండి బయటపడి హనీమూన్‌కి ఒక కొత్త ముగింపుని అందించబోతున్నాం' ఆలోచనలు అలా కొనసాగుతూనే ఉన్నాయి.

కిరణ్ గొంతు ఫోన్లో వినగానే తనకేమైంది? క్షణంపాటు ఎంతో ఆనందం కలిగినా ఉప్పెనలా ఏడుపు ఎందుకు తన్నుకొచ్చింది? ఇంటాబయటా జంటకవులవలె అంటుకొని యాత్ర సాగిస్తున్న తాము అకస్మాత్తుగా వేరైపోయి ఇన్నిరోజులు ఎలా ఉండగాలిగాం? మోకాలి నుండి కిందవైపు పూర్తిగా కత్తికోతకి గురైంది. అపుడపుడు విపరీతంగా నొప్పి.. భరిస్తోంది. 'బతికి బయటపడ్డాం' అన్న సంతోషం ముందు అంగవైకల్యం బాధ తేలికగా అనిపిస్తోంది. పెద్దగీత ముందు చిన్నగీతలా! తీపి ఆలోచనలతో కిరణ్ మొహాన్నే తలచుకుంటూ నిద్రలోకి జారుకుంది. మందులు, భరోసా మాటల ప్రభావాల వల్ల రాత్రంతా మెలకువ రానేలేదు.

'ఆఫ్టర్ షాక్స్' మే నెలలో కూడా తమ ప్రభావాలని చూపుతున్నాయి. బీరకాయ పీచు బంధుత్వంలా కదలికలు.. వరస కదలికలు.. అందరినీ కలవరపెడుతున్నాయి. నేపాల్ దేశాధ్యక్షుడు సైతం విలాస భవనం నుండి తాత్కాలికంగా ఏర్పాటు చేసిన సురక్షిత శిబిరానికి

# చతుర ప్రవేశిక

## ఏప్రిల్ చతుర చదివారా?

ఈ ప్రశ్నలకు ఒక్క మాటలో జవాబు రాసి బహుమతి పొందండి. ఎక్కువమంది సరైన జవాబులు రాస్తే డ్రా తీసి విజేతలను ఎంపికచేస్తాం. ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

| | |
|---|---|
| 1. కిరణ్ పూర్తి పేరు? | 6. అంతర అత్తగారి పేరు? |
| జ. | జ. |
| 2. ప్రభకి కిరణ్ ఏమవుతాడు? | 7. భూకంపం సంభవించిన నెల? |
| జ. | జ. |
| 3. కొత్తజంట దిల్లీలో ఎన్నిరోజులున్నారు? | 8. నేపాల్లో ప్రభకి సపర్యలు చేసిన స్త్రీ? |
| జ. | జ. |
| 4. తాజ్‌మహల్ కట్టించింది? | 9. 'చంఘిజ్‌ఖాన్' రచయిత? |
| జ. | జ. |
| 5. ఖజురహో ఏ రాష్ట్రంలో ఉంది? | 10. 'మలిపొద్దులో..' మూలరచయిత? |
| జ. | జ. |

పంపినవారి పేరు: ------------------------------------ వయసు ( )

చిరునామా: ------------------------------------------------

------------------------ పిన్‌కోడ్ : ఫోన్ నెం :

చిరునామా : సంపాదకులు, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజీగూడ, హైదరాబాద్- 82

ఫోన్ : 04023318181, Ex: 6658, 6532

ఈ కూపన్‌లోనే సమాధానాలు రాసి పంపాలి.

గడువు తేదీ 17

మారాడు. మామూలు మనుషులకి నిద్ర లేదు. 'ఆఫ్టర్ షాక్స్' ఎపుడు, ఎంత కాలం వస్తాయో తెలియదు. శాస్త్ర-సాంకేతిక నైపుణ్యం వాటి గురించి ముందుగా సూచనలిచ్చే స్థాయికి చేరుకోలేదు. 'ఆఫ్టర్ షాక్స్' ఎంత తీవ్రతతో భూమిని కదిలిస్తాయో కూడా తెలియదు. వరస కదలికలు ఆగేంత వరకు ప్రతిక్షణం అప్రమత్తంగా వుండాల్సిందే!

★ ★ ★

రాత్రి అస్తమించింది. పగలు జన్మించింది. రెండూను తమ తమ విధులని గతి తప్పకుండా చేస్తూనే ఉంటాయి. చీకటి కనుమరుగవ్వాలి. పగలు వెలుతురిని లోకంపైకి చల్లాలి! ఈ రెంటికీ బద్ధ వైరం! వేలసంవత్సరాల నుండి ఈ పోరాటం సాగుతూనే ఉంది. రెండింటి మధ్య ఒప్పందమే మానవాళికి లభించిన చీకటి వెలుగులు, జీవన పురోగమనానికి వారాల్లో, నెలల్లో, సంవత్సరాల్లో కొలబద్దలు.

"గుడ్ మార్నింగ్ కిరణ్‌భాయ్!" గోపాల్‌థాపా బెడ్డు దగ్గరికి చేరుకుని అన్నాడు.

"గుడ్ మార్నింగ్ గోపాల్‌భాయ్!" కిరణ్ చిరునవ్వుతో!

"మనం వెళ్లవచ్చు! మా కొలీగ్ తారా శ్రేష్ఠ కొన్ని నిమిషాల క్రితం ప్రభ బహెన్ దగ్గరికి చేరుకుంది"

కిరణ్ మొహంలో ఒక్కసారే ప్రకాశం! సంతోషంతో "నేను రెడీ!" అని బెడ్డుపై నుండి కదిలాడు.

"ఒక్క నిమిషం కిరణ్‌భాయ్! ఈ శాలువాని భుజాలపై నిండుగా కప్పుకో! ప్రభ బహెన్ మిమ్మల్ని చూసి షాక్ కావచ్చు!" అని తన శాలువాని కిరణ్ భుజాలపై పూర్తిగా కప్పాడు.

కిరణ్ కళ్ళనుండి నీళ్ళు జలజలా జారాయి. గోపాల్‌థాపా భుజంపై తలను మోపి మౌనంగా రోదించాడు.

# ఉత్తమ సమీక్షకు ఉన్నత సోపానం!

## (పాఠకులకు నూటపదార్లు బహుమానం)

ఈ నెల చతుర ఆసాంతం చదివారు కదా? నవల, నవలావలోకనం, పెద్దకథ ఇతరత్రా శీర్షికలు అన్నీ ఆస్వాదించారు కదా? ఇకనేం? మీకు నచ్చిన నవల/శీర్షికలు లేదా మొత్తం సంచికపై చతురలో అరపేజీ వచ్చేలా చక్కని సమీక్షను రాసి ఫొటోతో సహా పంపండి. ఉత్తమ సమీక్షకు రూ. 116/-లు బహుమానం అందుకోండి. సమీక్షతోపాటు మీ పూర్తి చిరునామా ఫోన్ నెంబరు తప్పనిసరి! మీ సమీక్షలు మాకు చేరాల్సిన గడువు తేదీ ఈ నెల 17.

– సంపాదకులు

నిబంధనలు : ఈ సమీక్షల ఎంపికలో తుదినిర్ణయం సంపాదకులదే. ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు. 'ఉత్తమ సమీక్ష'కు ఎంపిక కాని సమీక్షలకు వీలైతే 'మనసు ఉన్నదీ..' శీర్షికలో చోటు కల్పించే అవకాశం ఉంటుంది.

చిరునామా : సమీక్ష, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్- 82

ఫోన్ : 040 -23318181, Ex: 6658, 6532

e-mail: vipula.chatura@gmail.com

"థాంక్యూ సో మచ్! నీ ఆలోచనకి, సున్నితత్వానికి నిన్నెలా మెచ్చుకోను? "

"కిరణ్‌భాయ్! వద్దు! కన్నీరొద్దు! ధైర్యంగా ఉండాలి! ప్రభ బహెన్ దగ్గరికి వెళుతున్నావు. ఇది మీ ఇద్దరికీ పరీక్షా సమయం. ఎలా మానేజ్ చేస్తారో? మీరిద్దరూ ధైర్యంగా ఉండాలి. అలాటి శక్తిసామర్థ్యాలని మీకివ్వాలని పశుపతినాథ్‌ని ప్రార్థిస్తున్నాను. ఆయనే అందరినీ గట్టెక్కిస్తాడు" గోపాల్‌థాపా కళ్లలోనూ నీళ్లే!

"అదేగా మనిషికీ మనిషికీగల బంధం! ఆఁ! మరిచాను. నీ సెల్‌ఫోన్ని రిపేర్ చేయించాం ఇదిగో!" తలగడ కింద పెట్టాడు గోపాల్.

కిరణ్ కుడిచేతిని తన భుజంపై వేసుకొని మెల్లగా బయటకి కారువద్దకి నడిపించాడు తనే.

★ ★ ★

తారాశ్రేష్ఠ పక్కనే కూచొని, సంభాషణలతో ప్రభని ఉత్సాహపరిచే ప్రయత్నంలో ఉంది. చదువు గురించి, పెళ్లి గురించి ప్రశ్నల్ని అడుగుతూ గోపాల్‌థాపా, కిరణ్‌ల రాక కోసం ఉత్కంఠతో ఎదురుచూస్తోంది. తారా కలుపుగోలుతనంతో ప్రభ ఉత్సాహాన్ని తెచ్చుకుని క్షణాలని భారంగా గడుపుతూ కిరణ్ కోసం ఎదురుచూస్తోంది. నాలుగు నిమిషాలు గడిచాయో? లేదో? దూరంగా శిబిరంలోకి ప్రవేశిస్తున్న రెండు మానవాకారాలు.

ఒక వ్యక్తి రెండో మనిషి భుజంపై కుడి చేతిని వేసి అడుగులేస్తున్నాడు. మొదటి వ్యక్తికి అనుకూలంగా ఎలాటి ఇబ్బందులు కలుగకుండా రెండో వ్యక్తి నడుస్తున్నాడు. తారాశ్రేష్ఠ దూరం నుండే ఇద్దరిని గమనించి ప్రభకు చెప్పి నిరాసక్తంగా ఉన్న కళ్ళల్లో రెండు నానో-సూర్యుళ్లని నిలుపుకుంది. ప్రభ మొహంలో ఆకస్మికంగా వచ్చిన మార్పుని తారాశ్రేష్ఠ గమనించింది. ప్రభ కళ్లనుండి బయలుదేరిన శక్తిమంతమైన కాంతి పుంజాలు ఓ క్షణం పాటు తారాశ్రేష్ఠ మొహంపై ప్రసరించి ఆమెని 'సూర్యశ్రేష్ఠ'ని చేశాయి!

మెల్లగా అడుగులు వేస్తూ బెడ్డు వైపు వస్తున్న రెండు జతల కాళ్లపైనే రెండు జతల కళ్ళు దృష్టి కేంద్రీకరించాయి.

అడుగులు నిదానంగా పడుతున్నాయి!

ప్రభ రెప్ప వేయలేదు.

కిరణ్ చూపులూ ప్రభ వైపే..!

చూపులు కలిశాయి. వెంటనే గుండెల్లో సూదులు గుచ్చుకున్నాయి.

ప్రభేనా నా ముందుంది?

కిరణ్‌లో ప్రశ్నలు.

కిరణేనా? గడ్డంతో ఎలా అయ్యాడు? ప్రభలోనూ ప్రశ్నలు.

గోపాల్‌థాపా మెల్లిగా కిరణ్‌ని బెడ్డు దగ్గరకు తీసుకొచ్చాడు. కిరణ్ చేతిని మెల్లగా తన భుజంపై నుండి తీశాడు. శాలువా కిరణ్ భుజాల్ని కప్పే ఉంది.

తన పక్కనే కిరణ్.

తన ఎదుటే ప్రభ.. బెడ్డుపై..!

మౌనం ముచ్చటిస్తోంది. ఇలాటి క్షణాల్లో మాటల సంభాషణ చాలదు. శబ్దరత్నాకరంలోని పదాల్లో ఇమడని ఘడియలివి. హనీమూన్ కోసం వచ్చి భూకంప బాధితులై ఎడబాటుకి గురై కొన్నిరోజుల తరువాత కలుసుకున్న మధురక్షణాలు! పదాల రూపంలో బయటపడి పేలవమైన మాటలతో నవ్వులపాలు కాకూడదని పదాలే తప్పుకోవడంతో మౌనమే పెద్దపీట వేసుకొని కూచుందక్కడ.

ఒకరినొకరు కన్నార్పకుండా చూసుకుంటున్నారు!

"మీరు మాట్లాడుతూ ఉండండి! గంట వరకు మీరిలాగే గడపవచ్చు. ఇంతలో మేమొక చిన్నపని చేసుకొని వస్తాం" గోపాల్‌థాపా చెప్పి అక్కడి నుండి కదిలాడు. తారాశ్రేష్ఠ ఆయన్ని అనుసరించింది. వారిద్దరికి మాట్లాడుకోడానికి ఏకాంతం కల్పిం

చడానికి తన బాస్ 'చిన్న పని'ని కల్పించాడని తారకి అర్థమయ్యింది. ఆమె మనసూ కదిలిపోయింది. కళ్లనిండా నీరు. శిబిరం నుండి బయటపడగానే టపటపా రాలాయి. ఇద్దరినీ కలిపాక గోపాల్ థాపా పరిస్థితీ ఇంచుమించు అలాగే ఉంది.

కారుని స్టార్ట్ చేస్తూ "అదృష్టవంతులు! ప్రాణాలతో బయటపడ్డారు. ఏ ఒక్కరు చనిపోయినా రెండో వ్యక్తి జీవచ్ఛవమయే వారు. అయినా ఎలా వచ్చారో అలా వెళ్ళడం లేదనే నా బాధ! పశుపతినాథుడి లీలల్ని చూద్దాం!" అన్నాడు నేపాలీ భాషలో గోపాల్‌థాపా. తారా తనలాగే బాధలో ఉందని గ్రహించాడు.

వెంటనే మాట్లాడలేకపోయింది తారా శ్రేష్ఠ. బెడ్డు పక్కనే స్టూలుపై కిరణ్ కూర్చున్నాడు.

బెడ్డుపైన ప్రభ వెల్లకిలా! నడుము నుండి పాదాల వరకు కప్పేసి ఉంది.

ఒకరినొకరు ఏకాంతంలో కళ్ళ నిండా చూసుకుంటున్నారు.

మూగభాషే రాజ్యమేలుతోంది.

నువ్వు సరిపోవులే అంటూ మూడోభాష ముందుకొచ్చింది.

ఇద్దరూ వెక్కివెక్కి ఏడ్చారు.

కిరణ్ కుడిచేయి ప్రభ చేతిని పట్టుకొని ఉంది. తలని బెడ్డుపై ఆనించి ప్రభ చేతిని స్పృశిస్తూ అరచేతిని తన మొహానికి ఆనించుకున్నాడు. ఎన్నోరోజుల తరువాత శరీరాల అనుసంధానం!

ఇద్దరి కళ్ల నుండి ధారలు.. ఆగకుండా ప్రవాహాలు.. కట్టలు తెంచుకున్న ధారలతో మొహాలే కాదు.. మనసులు కూడా తడి. తడి.. తడి..!

ఓదార్చడానికి ఎవరూ లేరక్కడ! వైద్యశిబిరంలో ఉన్నవారందరూ ప్రాణాలతో బయటపడ్డవారే! అసమాన ధైర్యంతో భూకంప కోరల నుండి తప్పించుకున్నవారే! బదులుగా ప్రతిజీవీ తాము చిక్కుకున్న పరిస్థితులను బట్టి బహురూపాల్లో అవయవ త్యాగరాజులయ్యారు.

ఏడుపు హోరు తగ్గింది! కిరణ్ కుడి చేత్తో ప్రభ కళ్లని తుడిచాడు. తన చేతిని కూడా జోడించుకుని కళ్లని పూర్తిగా తుడిచేసుకుంది. తన రెండు చేతులతో కిరణ్ మొహాన్ని తుడిచింది. అస్తవ్యస్తంగా పెరిగిన గడ్డాన్ని చేతివేళ్ళతో సవరించింది.

ఒకరినొకరు తన్మయంగా చూసుకుంటున్నారు. కిరణ్‌కి ఇది మంచి సమయమని తోచింది. ఏ ఉపోద్ఘాతమూ లేకుండా కిరణ్ స్టూలుపై నుండి లేచి తనపైనున్న శాలువాని మెల్లగా తీశాడు!

ప్రభకి ఆ దృశ్యం ఒక్కసారే భయంకరంగా కనబడింది. చూడలేక తలని పక్కకి తిప్పుకొని "నో...నో..." అని గట్టిగా అరిచింది.

"ప్రభా! ఏడవకు. నువ్వు ఏడుస్తుంటే నేను భరించలేను!" ప్రభ ముఖాన్ని తన వైపుకి తిప్పుకొని దగ్గరగా జరిగాడు.

"ఒక్కసారి ఈ శిబిరంలో ఉన్నవారిని చూడు! చాలామందితో పోలిస్తే నాది చిన్నదేనేమో? ఎడమ చేయే కదా పోయింది! అని అనిపిస్తుంది. అదే కుడిచేయిని కోల్పోతే? అన్ని పనులు చేసే కుడి చేయి ఉండి, ఎడమచేయి పోతే బాగుండేదేమో అనుకుంటాం. కష్టాలని జీవితంలో చిన్న-పెద్ద గీతలని తలచుకొని భరించాలి, అప్పుడే మనిషికి ఊరట" తత్వాన్ని తర్కాన్ని జోడించి ప్రభని ఓదార్చే ప్రయత్నంలో కిరణ్. ఈ ఘడియలు చాలా క్లిష్టమైనవని కిరణ్‌కి బాగా తెలుసు.

కిరణ్ ఎడమచేతి బాండేజీని ప్రభ పరీక్షగా గమనిస్తోంది. మోచేయి నుండి కింది భాగం శూన్యం!

'భగవంతుడా! ఎంత పనిచేశావు? ఈ మనిషికి ఇంతటి క్రూరమైన శిక్షా? ' మనస్సులోనే అనుకుంది.

ప్రభ దృష్టి తన చేతిమీదే ఉండటం గ

రూ. 116/- గెలుచుకున్న

# ఉత్తమ సమీక్ష

# ఆహ్లాదకరమైన రచన




మార్చి నెల చతురలో ప్రచురించిన డా. జి. సురేష్‌బాబు 'వినాశాయ చ దుష్కృతాం' మామూలు రచనలకు భిన్నంగా వుండి ఆకట్టుకుంది. నిజం చెప్పాలంటే నవలను నేను చదవలేదు, అదే నాచేత చదివించింది. మన కథల్లో సాధారణంగా పాత్రల్ని అధ్యాపకులుగానో, ప్రభుత్వ కార్యాలయాల్లో చిరుద్యోగులుగానో లేదా ఓ పచారీకొట్టు వ్యాపారిగానో చిత్రీకరిస్తుంటారు. ఇవి సుపరిచితం కనుక, పెద్దగా కుతూహలం కలిగించవు! వివిధ రంగాలకు సంబంధించిన ఇతివృత్తాలతో రచనలు వచ్చినపుడు అవి ఆసక్తికరంగా, ఆలోచనాత్మకంగా వుంటాయి. ఈసారి చతుర నవల అలాంటిదే! ఇందులో పారిశ్రామికవేత్తలు, పోలీస్ అధికారులు, ఫొటోగ్రాఫర్లు, ఛానల్ ఎడిటరు, రిపోర్టరు, డాక్టరు, సినిమా డైరెక్టరు, ఎయిర్‌హోస్టెస్- ఇలా అనేక రంగాలవారిని చిత్రీకరించారు రచయిత. ఏ ఒక్క పాత్రా కృతకంగా, అసహజంగా లేక జవజీవాలతో కళ్ళముందు మెదిలేలా వుంది. బడా వ్యాపారుల వైఖరి దగ్గర్నుంచి మాఫియా మోసాలకు పాల్పడే ఏజెంట్ల వరకూ, కిడ్నీ మార్పిడిలో జరిగే అవకతవకలు, ఇన్‌ఫెర్టిలిటీ సెంటర్లు, అందాల పోటీలు లాంటి ఎన్నో సంగతులు కథలో భాగంగా సాగి అలరించాయి.

క్రైం రిపోర్టర్ కిడ్నాపవడంతో మొదలైన కథ ఆమె ఆచూకీ కనిపెట్టడంతో ముగుస్తుంది. కథగా చూస్తే అంతే! కానీ అసలా వార్తా చదువరిని ఎవరు కిడ్నాప్ చేశారు, ఆమె కనిపెట్టిన రహస్యాలేంటి, ప్రాణాలను పణంగా పెట్టి పులిబోను లాంటి నేరస్తుల స్థావరంలో ఎలా ప్రవేశించింది, శాస్త్రీయ పద్ధతిలో పిల్లల్ని పుట్టించి కిడ్నీలకోసం హతమార్చే కర్మాగారపు గుట్టు ఎలా కనిపెట్టింది- ఇలా ఆసాంతం జెట్టు స్పీడుతో నడిచింది. ఆయా సంఘటనలు, సన్నివేశాల్లో రచయిత మేధస్సు ప్రతిఫలించింది. కొన్నికొన్ని కథల్లో పాత్రలుగాక రచయితే కనిపించడం కద్దు. కానీ ఈ నవలలో ఎక్కడా రచయిత జోక్యంగానీ ఉపన్యాసాలుగానీ లేవు. పైగా ఉత్కంఠ కలిగించే అంశాలకు చక్కటి హాస్యాన్ని జోడించడంతో ఆహ్లాదకరమైన రచన చదివిన అనుభూతి కలిగింది. ఇంత మంచి నవలను రాసిన రచయితకు, ప్రచురించిన చతురకు అభినందనలు!

ఇంకా ఈ సంచికలో సి. బి. గిల్‌ఫోర్డ్ అమెరికా కథ 'ప్రేమకోసం చంపకు', నవలావలోకనంలో శ్రీధర 'రాగ విపంచి' నవలపై సమీక్ష ఆకట్టుకున్నాయి.

– లేఖా గుమ్మడి
హైదరాబాద్.

## కొత్తగాలి...

**సుఖం పొందాలంటే**
**డబ్బు పోగొట్టుకోవాలి!**
**డబ్బు పొందాలంటే**
**సుఖం పోగొట్టుకోవాలి!**

– మామిడి మహేంద్ర,
పుణే, మహారాష్ట్ర

మనించి మనస్సు నిలకడగా ఉండదని, శాలువాతో నిండుగా కప్పుకున్నాడు కిరణ్.

మూగభాష తాను ఎక్కడికీ వెళ్లలేదు, ఇంకా ఇక్కడే ఉన్నాను.. అని మళ్ళీ కొన్ని నిమిషాలు ముచ్చటించింది.

ప్రభలో 'ఇక తనవంతు' అనే ఆలోచనల కదలికలు. కొంచెం గాభరా కూడా పేరుకుంటోంది. కిరణ్ చెప్పిన ఉపమానం ఎంత బాగుంది. అది విన్నాక ప్రభకి తన పని చాలా సులభం అనిపించింది. గాభరా పోయి క్రమేణా ధైర్యం పెరిగింది.

"కిరణ్! కళ్ళు మూసుకో! ప్లీజ్!"

కిరణ్ ఆశ్చర్యంతో "ఏంటి ప్రభా? ఈ పరిస్థితుల్లో ఏంటిది? " అన్నాడు.

"ఒక్క నిమిషమే! ప్లీజ్.. ప్లీజ్..! ఐ లవ్ యూ!"

"ఓకే!" కళ్లు మూసుకున్నాడు కిరణ్.

తనపై కప్పి ఉన్న సన్నని బ్లాంకెట్ ని రెండు చేతులతో తొలగించింది.

"కీ..! కళ్ళు తెరువు!"

ప్రభ పూర్తి రూపం! వెల్లకిలా! ఒకటిన్నర కాలితో! ఎడమ కాలు అచ్చంగా తన ఎడమ చేయిలా..!

మూగభాష కాస్సేపు.. పదాల భాష కాస్సేపు.. చూపుల భాష కాస్సేపు.. ఏడుపు భాష కాస్సేపు.. నాలుగు భాషలు సమపాళ్లలో..

కళ్ల నుండి ధారలు.. మొహాలు తడిసిపోయాయి!

అన్నిభాషలని పక్కకి నెట్టి ఊరట వచ్చి ఇద్దరినీ ఓదార్చింది.

ఇద్దరు మనుషులు! ఒక జంట! కాళ్ళు మూడు! చేతులూ మూడే! ప్రకృతిలో కలిసిపోయిన ఓ హస్తం- ఓ కాలు!

కిరణ్ ఇంకా తేరుకోలేకపోతున్నాడు. ప్రభ కాళ్లని తడిమిచూశాడు. నిర్ధారించుకున్నాడు. అవును! ఎడమ కాలు. తనతో నడిచిన పాదం లేదు. మళ్ళీ ఎప్పుడూ కనబడదా? ఇంత జరిగినా ఎంత ధైర్యం? ఎంత గుండె నిబ్బరం ఈ అమ్మాయికి!

దుఃఖం ఆగలేదు. ప్రభ ఎదపై తలని వాల్చి మళ్ళీ కన్నీరు కార్చాడు. ప్రభ తన రెండు చేతులతో కిరణ్ తలపై ఓదార్పుగా నిమిరింది. కిరణ్ కన్నీరు ప్రభ ఛాతీని తడి చేసింది. ప్రభ కిరణ్ తలని సున్నితంగా పైకి లేపి నుదుట ముద్దుపెట్టింది.

"నువ్వేడవవద్దు! నేనూ ఏడవను! మనిద్దరం ఒకరికొకరం ప్రామిస్ చేసుకోవాలి!" ప్రభ కిరణ్ కళ్ళలోకి చూస్తూ.

తడిగా ఉన్న ప్రభ కళ్లని చూశాడు. ఇంతవరకు ఎప్పుడూ అలా అంత సూటిగా..గాఢంగా.. లోతుగా కలుసుకోలేదు. నిర్వచనానికి అందని క్షణాలు. అంతరాత్మలు కలుసుకున్న అద్భుత క్షణాలు.

"ప్రామిస్.." కిరణ్ అన్నాడు.

"ప్రామిస్.." ప్రభ కూడా అంది.

కిరణ్ అరచేయి ప్రభ అరచేయితో జత కలిపింది. వేళ్లమధ్యలో వేళ్లు ఇద్దరివి చక్కగా అల్లుకుపోయాయి.

ఏదో మహత్తరశక్తి ఇద్దరిలో వేగంగా ప్రవహించింది. నూతనోత్సాహం.. మొహాల్లో తేజస్సు.. శక్తి, సామర్థ్యాలు ఒక్కసారే ఎన్నోరెట్లు పెరిగిన వేళ! ఇద్దరిలో, ఇక తమని ఎవ్వరూ విడదీయలేరన్న ఆత్మవిశ్వాసం, ధీమా. ఆశయాలవైపు మెట్లు... నిచ్చెనలూనూ! ఇద్దరూ కలిసి కంటున్న స్వప్నం స్పష్టంగా కనబడింది!

"కీ..! ఆ రోజు నీ కోసం ప్రత్యేకంగా అలంకరించుకుని నీకిష్టమైన డ్రెస్సులో ఎదురుచూస్తూ సమయాన్ని గడిపా"

"సా..! నిన్ను సర్‌ప్రైజ్ చేద్దామని నీకు నచ్చిన జ్యుయలరీ కొనడానికి నేను ఆ షాప్‌కి వెళ్ళాను. ఆ రోజున మనిద్దరం విడిపోయాం! ఇన్ని రోజుల తరువాత.. ఈ రోజు మనం కలుసుకున్నాం. మనది విచిత్రమైన హనీమూన్ కదూ!"

"ఈ విషయాలన్నీ మనం హైద్రాబాద్ వెళ్ళాకే పంచుకుందాం! అనుభవాలన్నిటినీ పదిలంగా దాచుకుందాం!" ప్రభ తన మనసులోని మాటని తెలిపింది.

"వాటి గురించి ఇప్పుడు మాట్లాడుకోవద్దు! మనకు మరోజన్మ ఈ పరదేశంలో దొరికింది. కొత్త జీవనానికి నాంది. అయితే నాకొక చిత్రమైన కోరిక మనస్సులో కదులుతోంది. నీతో ఇప్పుడే పంచుకోవాలనిపిస్తోంది" కిరణ్ బుజ్జగిస్తూ.

"చెప్పు కీ..!" ఉత్సాహంగా ప్రభ.

"మన మొదటి వెడ్డింగ్ ఏనివర్సరీకి నేపాల్‌కే వద్దాం. మృత్యు కోరల నుండి ప్రాణాలతో బయటపడ్డాం. అసంపూర్తిగా అయినా మన ఈ మధురయాత్రని సంపూర్ణం చేసి పూర్తి అనుభూతిని పొందాలి. ఎంత బిజీగా ఉన్నా, మన వారిని కూడా తీసుకొనివద్దాం. అత్తయ్యకి పశుపతినాథ్ దేవాలయం చూడాలని ఎంతో కోరిక..!"

గోపాల్‌థాపా, తారాశ్రేష్ఠలు అంతలో వచ్చారు. ప్రసన్నంగా ఉన్న వారిద్దరి మొహాలని చూసి సంతోషించారు.

"కిరణ్‌భాయ్! ప్రభ బహెన్! మీకోసం, మీ సంపూర్ణ ఆరోగ్యం కోసం..." అని పెద్ద పుష్పగుచ్ఛాన్ని ఇద్దరి చేతుల్లో పెట్టాడు గోపాల్.

"గోపాల్‌భాయ్! మీరు మా పాలిట దేవతల్లా వచ్చారు. మీ సహాయానికి జీవితమంతా రుణపడే ఉంటాం. మీరందించే ప్రేమ అమూల్యమైంది!"

## కొత్తగాలి...

**ప్రేక్షకులు**
**నాటకాలకు స్టేజిముందు**
**సినిమాలకు తెర చివర్న**
**కవితాసభలకు తలుపు దగ్గర!**

– టి. హిరణ్యామూర్తి,
విశాఖపట్నం

"మా దేశస్థులు మీ దేశంలో లక్షల్లో ఉన్నారు. మన రెండు దేశాల మధ్య ఉన్న సంబంధాలు ఎంతో పురాతనమైనవి, బలమైనవి. మీరు అలా అనకూడదు. ఇది తోబుట్టువుల బంధం లాంటిది. విపత్తులో మీరు చిక్కుకోవడం, మీకు సహాయపడే అవకాశం మాకు కలగడం.. అన్నీ ఆ పశుపతినాథుడి మహిమలే కదా! ఇక మనం బయటపడాలి" టైమ్ చూస్తూ గోపాల్ థాపా అన్నాడు.

"బహెన్! మీరిద్దరూ కలుసుకున్నారు. మాకు ఎంతో సంతోషంగా ఉంది. రేపు శిబిర నిర్వాహకులతో మీ ఇద్దరి డిశ్చార్జి గురించి మాట్లాడతాను. ఇండియన్ ఎంబసీ వారు భారతీయులని పంపించడానికి ఎలాంటి ఏర్పాట్లు చేసుకున్నారో కూడా తెలుసుకుంటాను. మీ నాన్నగారితో మాట్లాడి వీలైనంత త్వరలో క్షేమంగా మిమ్మల్ని హైద్రాబాద్ చేర్పించే ప్రయత్నాలు చేస్తాం. మీరు నిశ్చింతగా, సంతోషంగా ఉండండి. మీరు ఎంత ఆనందంగా ఉంటే అంత తొందరగా ఈ గాయాలు మానుతాయి" చేతిని గాయాలవైపు చూపుతూ గోపాల్‌థాపా అన్నాడు.

తారాశ్రేష్ఠ కూడా నాలుగు ధైర్యపు మాటల్ని ప్రభకి చెప్పి సెలవు తీసుకుంది.

వారితో బయలుదేరాడు కిరణ్ కూడా!

వెళ్లిపోతున్న ముగ్గుర్నీ కళ్లార్పకుండా చూస్తూనే ఉంది ప్రభ. కిరణ్ పక్కన ఇద్దరు తోడు ఉండడంతో ప్రభకి ఏ భయమూ లేకపోయింది. ముగ్గురూ తన దృష్టి పరిధి నుండి అదృశ్యమవగానే ప్రభ కళ్లని భారంగా మూసుకుంది. ఎంత ఆపు కుందామనుకున్నా దుఃఖం ఆగలేదు. వర దలా రానే వచ్చింది. తనకి తెలియకుం డానే గట్టిగా అరుస్తానేమోనని పెదిమలని అదిమిపట్టి కడుపులోనే దాచుకుంది. ఒక రికొకరు ప్రామిస్ చేసుకున్న విషయం గుర్తొచ్చి దుఃఖాన్ని క్రమేణా తగ్గించు కుంది. మొహం ఎర్రబడింది. కళ్లు గోళాల పరిమాణం పెంచుకున్నాయి. మానవ జీవితంలోని 'ఆఫ్టర్ షాక్స్' ప్రభ మొహంపై స్పష్టంగా కనబడుతున్నాయి.

మనసంతా అలజడిగా ఉంది. ప్రశాం తత దూరంలో ఉంది. సత్వర ఉపశమనా నికి తామిద్దరు దిల్లీ, ఆగ్రా, ఖజురహోలో గడిపిన రోజులని, కిరణ్ చిలిపి చేష్టలని మననం చేసుకుంది ప్రభ.

నిమిషాల్లో ప్రభ మొహంపై ప్రశాంతత, ప్రసన్నత, పెదిమలపై చిరునవ్వు. ఆఫ్టర్ షాక్స్‌కి బలమైన విరుగుడు. అరమూసిన కళ్ళతో ముద్దుల లోకంలోకి నడిచి పుల కించిపోయింది.

జ్ఞాపకాల కదలికలు. కదిలివస్తున్న కద లికలు. కమ్మని కదలికలు. ప్రభ మరోలో కంలో విహరిస్తోంది.

కిరణ్ పరిస్థితీ అంతే! ప్రభ మనస్సు ఏ విధంగా బాధపడిందో అదే రహదారిపై కిరణ్ మనస్సూ కదిలింది. అదే రీతిలో గుండె కొట్టుకుంది. కళ్లనుంచి అదే మోతా దులో అశ్రువులు జారి వెలుతురు లోకా న్ని చూశాయి. ఎంత ఏడ్చినా కొలతల్లో కన్నీరు కొన్ని మిల్లీలీటర్లే! అవి కళ్ళ నుండి మొహంపై చేసే ప్రయణమూ సెంటీమీ టర్లే. అయినా ఒక్కోచుక్క గుండెలు పిండిన వేదనకి ప్ర తిరూపంగా బయటికి తోసుకొస్తున్నాయి.

కుడిచేత్తో రెండు కళ్ళని తుడుచుకు న్నాడు. మూగగా రోదించాడు.

తను చేయించిన ప్రామిస్ గుర్తుకొచ్చిం ది. ఛ..ఛ..! తనెందుకు ఏడుస్తున్నాడు? ఏడవకూడదు. ప్రభ కూడా ఏడుస్తుంది మరి..! నో..!నో..! అంటూ ఏడుపుకి ఠక్కున బ్రేక్ వేశాడు.

ప్రభకి తీసేసిన ఎడమకాలు మదిలో మెదిలింది. ఎంత ధైర్యంగా ఉంది! తనకి ఎంత ధైర్యాన్ని ఇచ్చింది. ఆత్మవిశ్వాసాన్ని పెంచింది. జీవితంలో అనుకున్నది సాధి స్తానన్న నమ్మకం పెరిగింది. పెడిక్యూ ర్‌తో ఎంతచక్కగా చూసుకునేది. పాదాల మృదుత్వం తననెంత ఆకర్షించిందో! ఆ రోజు ఖజురహోలో ప్రభకి కాలు బెణికితే తనతో చెప్పలేదు. హోటల్‌కి చేరుకున్నాక నడకలో తేడా కనబడి అడిగాడు. ఎడమ కాలిని చూపింది. చిన్న మెట్టుని గమనిం చక అడుగువేయడంతో పాదం బెణికింది. పాదాన్ని ఒళ్ళో పెట్టుకొని స్పృశిస్తూ నొ ప్పి ఉన్న స్థలాన్ని పట్టుకోడానికి ప్రయ త్నించాడు. అయినా ఫలితం శూన్యం.

"నీ రెండు చేతులు పాదాన్నంత ఆప్యా యంగా స్పృశిస్తుంటే నొప్పి అదృశ్యమవు తోంటే ఫలానా చోట నొప్పి అని నేనెలా చెప్పేది" అంది ప్రభ కొంటెగా నవ్వుతూ!

"జోకులు వెయ్యకు! రేపు కూడా మనం తిరిగే పనుంది. అందుకే ఇపుడు జాగ్రత్త తీసుకోవాలి. అవసరమైతే హోటల్ వారితో మాట్లాడి డాక్టర్ని కన్సల్ట్ చేద్దాం!" ముందు జాగ్రత్తగా కిరణ్ సూచన.

"ఏమీ వద్దు. రాత్రంతా విశ్రాంతే కదా! ప్రామిస్! ఇప్పుడు నొప్పి లేదు. డోంట్ వర్రీ!" అంటూ గోముగా తన రెండో కాలిని కూడా కిరణ్ ఒళ్ళో పెట్టింది ప్రభ.

ముచ్చటగా మృదువుగా కనపడే పాదాలు. రంగుతో గోళ్ళు అధునాతన షోకులని సంతరించుకున్నాయి.

పెళ్లయిన సూచికలుగా రెండు నాజూకు మెట్టెలు. కొత్తదనం ఇంకా పోలేదు. సన్నటి పట్టీలు. అంగుళానికో రంగుల రాయి. బరువెక్కువైతే పాదాలు తట్టుకోలేవేమోనని తర్జనభర్జనలు చేసి నిర్ణయించిన సైజులో రాళ్ళు!

రెండు పాదాల నాజూకుతనం తన రెండు అరచేతులకి అణువణువునా ఎంతో పరిచయమున్న స్పర్శ.

బెడ్డుపై పడుకొని ఉన్న కిరణ్ పెదిమలపై చిరునవ్వుల ప్రకంపనలు. హఠాత్తుగా.. 'నో.. నో..' గట్టిగా మనసులో కేకలు. తానిపుడు ఎడమ పాదాన్ని ఎన్నటికీ చూడలేడు. ప్రభ ఎంత బాధపడి ఉంటుందో? ఒంటరిగా ఇన్నిరోజులు ఎంతటి క్షోభకి గురయ్యిందో?

ఎంత ఆపుకుందామనుకున్నా కిరణ్‌కి దుఃఖం ఆగడం లేదు. తాను చేసిన ప్రామిస్ తనని అదేపనిగా హెచ్చరిస్తోంది. రెండు భిన్నమైన మానసిక స్థితుల్లో వ్యధకి గురవుతున్నాడు. బెడ్డుపై నుండి లేచి ప్రభ దగ్గరికి పరిగెత్తి ఒళ్ళో ఒదిగి బోరున ఏడవాలనిపిస్తోంది..




**అం**తర్జాతీయ విమానాశ్రయం.. శంషాబాద్ - హైద్రాబాద్. ప్రభా-కిరణ్‌ల బంధువులు, మిత్రులు, శ్రేయోభిలాషులు పెద్ద సంఖ్యలో ఎదురుచూస్తున్నారు. ఒక తెలుగు జంట భూకంపంలో చిక్కుకొని, నేపాల్ నుండి ప్రాణాలతో బయటపడ్డ సంగతి మీడియావారికీ ఎంతో ముఖ్యం! విలేకర్లు, టీవీ కెమేరాలు.. అందరూ పొజీషన్ తీసుకున్నారు. పేరున్న కార్పొరేట్ హాస్పిటల్‌కి చెందిన రెండు అంబులెన్స్‌లు సిద్ధంగా ఉన్నాయి.

భారత వైమానిక దళం విమానాల్లో భారతదేశ పౌరులని ఢిల్లీ వరకు సురక్షితంగా చేరుస్తున్నారు. అక్కడ నుండి వారిని తమతమ రాష్ట్రాలకి చేరుకోడానికి ఏర్పాటు చేసిన విమానాల్లో, రైళ్ళల్లో పంపుతున్నారు.

ఢిల్లీలో మకాం చేసిన కిరణ్-ప్రభల తల్లిదండ్రులు, దగ్గరి బంధువులు కిరణ్-ప్రభలని తరలిస్తున్న విమానంలోనే ప్రయాణించారు.

స్ట్రెచర్లపై ప్రభ-కిరణ్‌లని విమానం లోంచి మెల్లగా దించారు. భూమిపై మోపగానే తరలింపు మొదలయ్యింది. అంబులెన్స్‌లు తమ 'ఆలాప్'లని అందుకున్నాయి.

స్ట్రెచర్లు వడివడిగా కదులుతున్నాయి. ఆసక్తిగా ఎదురుచూస్తున్న వారిలోనూ కదలికలు. మీడియా పరుగుల కదలికలు. కెమేరాల ఫ్లాష్‌లు చిక్కని వెలుతురు వర్షాన్ని కుమ్మరించడానికి సిద్ధంగా ఉన్నాయి. టీవీ ఛానళ్ల మైక్రోఫోన్లు గురిపెట్టాయి.

స్ట్రెచర్ కదులుతోంటే కొన్ని అడుగుల దూరంలో కిరణ్‌కి సైన్‌బోర్డ్ కనబడింది. మొహంలో సంతోషపు కదలికలు. కనబడే మూడక్షరాలు జి.ఎం.ఆర్. సంతృప్తిగా చూశాడు. శరీరంలోకి కొత్తశక్తి ప్రవేశించింది. మనస్సులో ఆ మూడక్షరాలని రెండు-మూడుసార్లు అనుకున్నాడు. ప్రభకి కొంచెం అర్థమయ్యింది. నవ్వుకుంది.

ప్రభ-కిరణ్‌ల వైపు నుండి ఒక మనిషి మీడియాతో మాట్లాడడానికి స్ట్రెచర్లని కొన్ని నిమిషాలు ఆపారు. ఫ్లాష్‌లు కాంతి పుంజాలని కట్టలుకట్టలుగా నీరసంతో

ఉన్న వారిద్దరి మొహాలని ప్రకాశవంతం చేశాయి. ప్రశ్నల వర్షం - ఎన్నో దిక్కుల నుండి. ఏ ప్రశ్నా స్పష్టంగా వినబడటం లేదు. టీవీ కెమేరాలు మాత్రం నడుస్తున్న చరిత్రని తనలో నింపుకుంటున్నాయి.

కిరణ్ కుడిచేత్తో అందరికీ 'సెల్యూట్' చేశాడు. ప్రభ రెండు చేతులతో నమస్కరించింది.

"ప్రాణాలతో బయటపడి ఇంటికి చేరుకుంటున్నాం. మా ఇద్దరికీ అంగవైకల్యమైనా అందరి ప్రేమలని మళ్ళీ చూడబోతున్నాం.. మీతో మాట్లాడగలుగుతున్నాం.." కిరణ్ రెండు మాటలు పలికాడు.

"హనీమూన్ మాకు రెండు భిన్న ప్రపంచాలని చూపింది. మీ అందరితో కలవడానికి, పంచుకోడానికే మేమిద్దరం బతికామని అనిపిస్తోంది. మీ ప్రేమాభిమానాలకి కృతజ్ఞతలు. కోలుకోగానే మీకోసం ప్రత్యేక కాన్ఫరెన్స్ పెడతాం! అప్పుడు వివరాలని మీతో పంచుకుంటాం" ప్రభ మెల్లగా అనేసి సెలవంటూ మళ్ళీ నమస్కరించింది.

స్ట్రెచర్లకున్న చిన్ని చక్రాలు కదిలాయి.
అంబులెన్సుల పెద్ద చక్రాలు కదిలాయి.
హాస్పిటల్లో ఓగదిలో రెండు పడకలు.
పేషెంట్లుగా రిజిస్టరైన కిరణ్-ప్రభలు.

డాక్టర్ల బృందం వెంటనే రంగంలోకి దిగింది. నేపాల్ నుండి తెచ్చిన మెడికల్ రిపోర్ట్‌లని చకచకా చూశారు. ఇద్దరి శరీరాలపై మూసుకుపోతున్న గాయాలని పరీక్షగా చూశారు. డాక్టర్ల మొహాల్లో సంతృప్తి. కాంప్లికేషన్స్ ఏమీ లేవని నిర్ధారించారు. జంటని మామూలు మనుషులుగా చేసేందుకు స్థూలంగా ఓ 'ప్లాన్' తయారుచేశారు. కిరణ్-ప్రభల తల్లిదండ్రులతో చర్చించారు. ఫిజియోథెరపీ, ప్రాస్టేటిక్ అంగాలు, సైకలాజికల్ కౌన్సిలింగ్.. ఇంకా.. ఇంకా..

"వీలైనంత త్వరగా ఇద్దరినీ మామూలు మనుషుల్లా చేయాలి. డబ్బు గురించి ఆలోచించవద్దు. ఇది మీరు ఛాలెంజ్‌గా తీసుకోవాలి. బెస్ట్ సర్వీసెస్ అందించండి" తెలిసిన డాక్టర్లతో చొరవగా కిరణ్ తండ్రి.

"మా సేవల గురించి అపోహలొద్దు. బెస్ట్ డాక్టర్లకి ఈ రెండు కేసులిస్తున్నాం. మీరే చూస్తారుగా మూడు నెలల్లో రిజల్ట్.." డిపార్టుమెంట్ హెడ్డు భరోసా.

"థాంక్స్!"

డాక్టర్లు నిష్క్రమించారు.

గదిలో ఇద్దరు పేషెంట్లు. వారి పేరెంట్స్, సమీప బంధువులు. అప్పటి వరకూ వరసగా చేయాల్సిన పనుల వల్ల ఒకరినొకరు కళ్ళారా చూసుకోలేదు. మనసు విప్పి మాట్లాడుకోనూ లేదు.

అందరి చూపులు అయోమయంగా, అటూ ఇటూ పగ్గాల్లేకుండా అన్ని దిశల్లో కదులుతున్నాయి. వాతావరణం క్రమేణా గంభీరతని పెంచుకుంటోంది. దుఃఖసాగరాలు అందరిలో అలల్ని రేపుతున్నాయి.

"ప్రభా.." అంటూ తల్లి ప్రభపై తలని మోపి బోరుమంది. పక్కనే చూస్తున్న తండ్రి కళ్ళ నుండి నీరు టపటపా రాలుతోంది. ప్రభ కుడిచేతిని తండ్రి చేతిలో వేసి ఎడమ చేతిని తల్లి తలపై మోపింది. అందరి గుండెల్లో వేదన!

కిరణ్ పడుకొని ఉన్న బెడ్డు అంచున అతని తండ్రి కూచొని సగం చేయివైపు తదేకంగా చూస్తున్నాడు. తల్లి కిరణ్ కళ్ళలోకే చూస్తూ నిల్చుంది. కన్నీళ్ళు ధారలుగా ప్రవహిస్తున్నాయి. పొరలి వస్తున్న దుఃఖాన్ని కఠినంగా గుండె నిబ్బరం చేసుకొని బలవంతంగా ఆపుకుంటోంది.

కిరణ్ తన చేత్తో తండ్రి కళ్ళని తుడిచాడు. అదే చేత్తో తరువాత తల్లి కళ్ళనీ తుడిచాడు.

"నేనెంత ధైర్యంగా ఉన్నానో చూడండి! మీరేడిస్తే నేను బలహీనమవుతాను. గాభరా పడొద్దు. ధైర్యంగా ఉండాలని

చిన్నప్పటి నుండి మీరే నేర్పారు కదా! మీ ఇద్దర్ని తలచుకునే నేను నేపాల్లో భయపడకుండా ఉండగలిగాను. మీరిలా ఏడుస్తుంటే నేను చూడలేను.." కిరణ్ ఓదారుస్తూ, ప్రాధేయపూర్వకంగా అన్నాడు.

ప్రభ కూడా తన తల్లిదండ్రులకి ధైర్యం చెప్పింది.. ఓదార్చింది! "ఇద్దరం ప్రాణాలతో తిరిగి వచ్చినందుకు సంతోషిద్దాం! చూశారుగా..! ఈ భూకంపంలో వేల మంది చనిపోయారు"

దుఃఖం ఆపుకోలేకపోతున్నారు. ఒక్కసారే అందరూ బోరుమన్నారు.

"అమ్మా! నాన్నా..! మనిషి మనస్సు చాలా విచిత్రంగా ఆలోచిస్తుంది. దానికి లొంగక ప్రాక్టికల్‌గా ఆలోచించాలి.. కుడి చేయి పోతే.. ఎడమచేయి పోయి, ముఖ్యమైన పనులని చేసే కుడిచేయి ఉంటే బాగుండేదనిపిస్తుంది. ఏదైనా ప్రమాదం జరిగి బొటనవేలు తీసేస్తే, ఆ వేలు ఉండి, ఏ చిటికెన వేలో, ఉంగరం వేలో పోతే బాగుండేదనిపిస్తుంది. మా పెళ్ళికి ముందు జరిగిన బంధువుల కారు ప్రమాదం గురించి ఏమనుకున్నాం? ఇద్దరి పిల్లల్లో నార్మల్ పాప చనిపోయింది, అంగవైకల్యమున్న పాప బతికింది. బంధువులంతా ఏమన్నారు? ఈ పాప చనిపోయి నార్మల్ పాప బతికుంటే బాగుండేదని.. అంతపెద్ద భూకంపం నుండి బతికి బయటపడ్డాం. ఒకసారి మీరూహించండి. మా ఇద్దరిలో ఒకరు చనిపోయి మరొకరు ప్రాణాలతో తిరిగి వస్తే మీరంతా ఏమయ్యేవారో ఊహించండి. ఆ తలపే భయంకరంగా లేదూ? మనందరి జీవితాల్లో ఎన్ని అస్తవ్యస్త పరిస్థితులు ఏర్పడేవి!.." తన తల్లిదండ్రులకి ధైర్యం చెబుతూ, ఏడుపుని ఆపడానికి ప్రభ వివరించింది.

కిరణ్ తన తల్లిదండ్రులని ప్రభ బెడ్డుకి దగ్గరిగా వెళ్ళి ఆమె చెప్పే మాటలని వినమని సైగ చేశాడు. ఇద్దరూ అటువైపు కదిలారు. కిరణ్ కూడా తన చూపుల్ని ప్రభ వైపు సారించాడు ఇంకేం చెబుతుందో విందామని.

"అలా అనకమ్మా!" దుఃఖాన్ని దిగమింగుకుంటూ ప్రభ తండ్రి..

"మనందరి అదృష్టం బాగుంది. కాలు, చేయి పోయినా బతికి బయటపడ్డాం. మీ దగ్గరికి చేరుకున్నాం. మన దేశంలో లక్షల్లో పిల్లలు అంగవైకల్యంతో పుడుతున్నారు. మాకిది యుక్తవయస్సులో ప్రవేశించింది. మానసికంగా మేమిద్దరం సంసిద్ధంగా ఉన్నాం. మీ అందరి ఆశీస్సులే కావాలి. మీరు అధైర్య పడకండి. మాకు ధైర్యం చెబుతూ ఉండండి. అదే మీ నుండి మాకు కావాల్సింది"

కిరణ్‌కి ప్రభ మాటలు స్పష్టంగా వినబడుతున్నాయి. చెప్పే విధానమూ ఎంతో నచ్చింది. నచ్చిన సంగీతం విన్నట్లుగా ఉంది! ఇలాటి ఆలోచనాపరురాలితో తన జీవితం ముడిపడినందుకు గర్వించాడు.

"మన రెండు కుటుంబాలకీ టీం లీడర్‌గా ప్రభని ప్రకటిద్దాం! మీరంతా విన్నారుగా! మనస్సులకి హత్తుకునే పద్ధతిలో చెప్పి మన హృదయాలని దోచుకుంటూనే ఉంది. మీరెవ్వరూ కన్నీరు పెట్టొద్దు. మేమిద్దరం అస్సలే ఏడవకూడదని ఒకరికొకరం నేపాల్లోనే ప్రామిస్ చేసుకున్నాం. దీన్ని మీకు కూడా విస్తరిద్దాం. మీరు ఏడిస్తే మమ్మల్ని కూడా ఏడిపించినట్లే! మా ఇద్దరి ఒప్పందం బలహీనపడుతుంది. మనందరం సమిష్టిగా ఒప్పందం చేసుకుందాం" కిరణ్ తన ఆలోచనల్ని పెద్దల ముందుంచాడు.

సెకండ్లు నిమిషాలయ్యాయి. నిమిషాలు మరికొన్ని నిమిషాలయ్యాయి. అందరూ దీర్ఘాలోచనల్లో..!

"ఏరా కిరణ్! మీకు తెలియదురా! భూకంపం వచ్చినప్పటి నుండీ మేమెంత

నరకయాతనపడ్డామో ఒక్కొక్క నిమిషం! ఎంత భారంగా గడిపామో? మొదటి నాలుగు రోజులు ఏ సమాచారం లేక అందరం కుప్పకూలిపోయాం. ఏడ్చి ఏడ్చి కళ్ళు ఎండిపోయాయి. తిండి, నిద్ర లేక తల్లడిల్లిపోయాం. కనీసం ఇప్పుడు మిమ్మల్ని చూస్తూ సంతోషంగానైనా ఏడవనివ్వండిరా! ఇది కన్న ప్రేమరా" ఏడుస్తూ కిరణ్ చేయిని తీసుకుని మమేకంతో ముద్దులు పెట్టింది అతని తల్లి.

"వదినా! వదినా!" ప్రభ తల్లి కిరణ్ తల్లిని దగ్గరకి తీసుకుంది.

క్షణాలు దొర్లాయి. మాటలు ఆగిపోయాయి. నిశ్శబ్దంగా ఉంది!

"వన్..టూ...త్రీ..ప్రామిస్.. మనందరి మధ్య ఈ ప్రామిస్! మేమిద్దరం హాస్పటల్నుండి డిశ్చార్జి అయ్యి, ఇంటికి వచ్చేంతవరకు మనలో ఎవ్వరూ ఏడవద్దు" ప్రభ అభ్యర్థించింది.

అంగీకారంగా పెద్దలు ఏమీ పలకలేదు. అక్షరాలు కనబడని తీర్మానంపై చూపులతోనే అందరూ సంతకాలు చేశారు.

ఇద్దరినీ డాక్టర్ల చేతుల్లో పెట్టి ఉత్తమసేవలకీ పెద్ద చెల్లింపులకి నిలయమైన ఆస్పత్రి నుండి అంతా వెళ్ళిపోయారు.

గదిలో ఇపుడు ఇద్దరే! అలసిపోయిన మొహాలతో నీరసంగా కనపడుతున్నారు. కాఠ్మండూ నుండి హైద్రాబాద్‌లోని హాస్పటల్ వరకు దీర్ఘప్రయాణం. ఫార్మాలిటీస్ పనులు కూడా చాలా సమయమే తీసుకున్నాయి. శరీరాలకి, మనస్సులకి ఎంతో శ్రమ! శాంతంగా ఊపిరి తీసుకోడానికి సమయమిప్పుడే దొరికింది.

శరీరాలు వెల్లకిలా ఉన్నాయి. ప్రభ - కిరణ్ తమ తలలని పక్కకి తిప్పుకొని చూపుల వంతెన వేసుకున్నారు. ఆశాజ్యోతుల వెలుగులని ఒకరిలో ఇంకొకరు ప్రకాశవంతంగా చూసుకుంటున్నారు. ప్రసన్న వదనాలు. మనసుల సంభాషణ కొనసాగుతూనే ఉంది విరామం లేకుండా..!

## కొత్తగాలి...

**మా అల్లుడు ఎంత మంచాడో!**
**నా కూతురిని కాలుకింద పెట్టనీడు**
**మాట జవదాటడు!**
**నా కొడుకు ఎంత వెర్రిబాగులోడో!**
**పెళ్లాం మాటకు గంగిరెద్దులా**
**తల ఊపుతాడు!**

– కుంటముక్కల సత్యవాణి, కాకినాడ

కొన్ని నిమిషాల తరువాత చూపుల అవసరం లేదని రెప్పలు కళ్లని మెల్లగా కప్పేశాయి. శరీరాలని నిద్ర అద్దెకి తీసుకుంది.

మనస్సులు మాట్లాడుతూనే ఉన్నాయి. గాఢనిద్రలో కొత్త ప్రపంచంలో స్వేచ్ఛగా విహరించాయి.

అద్దె కాలం అయిపోవడంతో నిద్ర రెండు శరీరాలనూ ఖాళీ చేసి వెళ్ళింది. నాలుగు కళ్ళు మెల్లగా తెరుచుకున్నాయి. రెండు కళ్ళలో నిండుగా ప్రభ రూపం.

మరో రెండు కళ్ళలో కిరణ్ రూపం.

కిరణ్ మెల్లిగా బెడ్డుపైనుండి లేచివచ్చి ప్రభ బెడ్డుపై కూచున్నాడు. వాత్సల్యంగా మీద చేయి వేశాడు. ప్రభ తన చేతులతో కిరణ్‌ని చుట్టేసింది.

గడియారం ముళ్ళల్లో కదలికలు.

"ఎంతసేపు కూచుంటారిలా? నడుం వాల్చకూడదూ? " పక్కకి జరిగి స్థలాన్నిఇస్తూ ప్రభ.

సరేనని కిరణ్ ప్రభ పక్కనే ఒరిగాడు.

"వైద్యశిబిరం నుండి డిశ్చార్జి అయ్యే ముందు అక్కడి యాజమాన్యం ఇచ్చిన వస్తువులని చెప్పి గోపాల్‌థాపా ఈ పాకెట్‌ని నాకిచ్చాడు. కాఠ్మండూలో చూడలేకపోయాను. దీంట్లో నా సెల్ ఉందని చెప్పాడు. ఈ విషయం విని ఎంత సంతోషించానో కిరణ్! మన ఫొటోలు,

## కొత్తగాలి...

**నీ పసితనం బాధలు చూసి**
**కంటతడి పెట్టింది మీ అమ్మ**
**ఇపుడు నువ్వు పెట్టే బాధలకు**
**కంట తడిపెడుతున్నదీ మీ అమ్మే!**

– మోదు రాజేశ్వరరావు,
విశాఖ

ముఖ్యంగా శిథిలాల కింద మనం చిక్కుకున్నప్పుడు తీసుకున్నవి పోనందుకు నాకు చాలా సంతోషంగా ఉంది. చూడండి!" అని పాకెట్‌ని అతినికిచ్చింది.

కిరణ్ అందుకొని ఒంటిచేతితోనైనా సునాయాసంగా తెరిచాడు.

ప్రభ గుండెకి ఒక్కసారిగా కస్సున ముల్లు గుచ్చుకున్నట్లయింది. యాదృచ్ఛికంగా పాకెట్‌ని అందించింది. ఒక చేత్తో పాకెట్‌ని విప్పడాన్ని చూసింది. తానే రెండు చేతులతో విప్పి అందిస్తే బాగుండేదనుకునే సరికి కళ్లు చెమర్చాయి.

"యస్! సెల్ ఉంది. నీ మంగళ సూత్రం, గాజులు, కాలిపట్టాలు, ఇంకా ఇతర వస్తువులన్నీ ఉన్నాయి"

రెండు పట్టాలని చేత్తో పట్టుకొని ప్రభ ఒంటి కాలిని తదేకంగా చూశాడు. మాటలు రాలేదు. మౌనంగా ఉండిపోయాడు.

"ప్రభ! దీన్ని విప్పవా? " అందించాడు.

పడుకునే ఉన్న ప్రభ పొట్లాన్ని విప్పి చూడకుండానే కిరణ్ చేతిలో పెట్టింది.

రెండు మెట్టెలు.. వెండివి!

కిరణ్ గుండె బరువెక్కింది. మనస్సుని దృఢం చేసుకొని కాలికి పట్టాని పెట్టాడు. ఒక మెట్టెని తీసి కాలివేలికి తొడిగాడు. పాదంపైపై పరీక్షగా, ఉద్వేగంతో కొంతసేపటి వరకు చూశాడు.

ప్రభలో కూడా దుఃఖం పేరుకుంటోంది. అయినా తన బలహీనతని బయటికి రానివ్వదలచుకోలేదు. కిరణ్‌ని బలహీనపరచడం ఇష్టంలేదు.

"ప్రభా!" కిరణ్ దుఃఖంతో ప్రభచేతిని పట్టుకొని మొహానికి ఆనించుకున్నాడు.

"కిరణ్! ఏడుస్తున్నావా? మాట తప్పుతున్నావు! నో! నో! నీతో మాట్లాడను!" ప్రభ చనువుతో మిళితమైన అధికారంతో.

కిరణ్ ఠక్కున ఏడుపుని ఆపాడు.

"సారీ! సారీ!" పాదాన్ని ముద్దుపెట్టుకున్నాడు. మళ్ళీ మళ్ళీ పెట్టుకున్నాడు.

రెండు చేతులతో కిరణ్ మొహాన్ని దగ్గరికి తీసుకొని గట్టిగా ముద్దుపెట్టుకుంది.

కాఠ్‌మండూలో తెగిన ముద్దుల కనెక్టివిటీ తిరిగి హైద్రాబాద్‌లో జరిగింది!

రెండు శరీరాల కణకణంలోనూ కదలికలు.. చిన్ని ప్రకంపనలు.

గాయాలని మూసేయడానికి కప్పుకొస్తున్న కొత్త కణజాలానికి పులకరింత. మొదటిసారిగా శరీరమంతా పాకిపోయిన స్పందనలని కణాలు అనుభవిస్తున్నాయి. ఇంకా పచ్చిగా ఉన్న వారిద్దరి గాయాలు మూసుకోడానికి వేగిరపాటు!

"ప్రభా! నిన్న రాత్రి కాఠ్‌మండూలో విచిత్రమైన కలొకటి వచ్చింది. అజ్ఞాత ఆకారమొకటి నన్ను వరస ప్రశ్నలతో నిద్రాభంగం చేసింది. అవే ప్రశ్నల్ని పదేపదే అడగడంతో మెదడులో అవి బాగా నాటుకుపోయాయి"

"ఏం ప్రశ్నలవి? "

"నీవు సివిల్ ఇంజనీరువి! మీకెందుకిలా అయ్యిందో ఆలోచించావా? భూకంపంలో వేలమంది ఎందుకు చనిపోయారు? పేక మేడల్లా, ఇండ్లు భవనాలు ఎందుకు కూలిపోయాయి? ఆలోచించు! బాగా ఆలోచించు! నీకైతే సులభంగా అర్థం కావాలి!"

కిరణ్ తనకొచ్చిన కలలో పదేపదే అడిగిన ప్రశ్నల వరసని పేర్చాడు.

"చాలా ఆసక్తిగా ఉన్నాయి ప్రశ్నలు"

"కలలోకి వచ్చిన అనామక రూపం వెళ్లిపోతూ ఏమందో తెలుసా? మీ దేశంలో లాతూర్, కచ్- భుజ్, జమ్ము- కాశ్మీర్‌లలో పెద్ద భూకంపాలు వచ్చాయి కదా! వేలల్లో జనం చనిపోయారు. అంతకుమించి ఇండ్లు, భవనాలు ధ్వంసమయ్యాయి. ఎందుకిలా అయ్యిందో మూల కారణాలని వెతుకు! మీకిది రెండో జన్మ! అందరికీ ఉపయోగపడే పనిచేయండి! అదే మీకు మంచి పేరు తెస్తుంది! రెండు చేతులతో మనిద్దరినీ దీవిస్తూ అస్పష్టంగా ఉన్న ఆకారం క్రమంగా అదృశ్యమైపోయింది"

"హు! సీరియస్‌గా ఆలోచించాల్సిన విషయం! మీరిక పడుకోండి! రేపు డాక్టర్లు మనల్ని ఫుల్ చెకప్ చేస్తారు"

"డిన్నర్ చేయకుండానే!" ఆకలితో ఉన్న కిరణ్ ప్రశ్న.

"మాటల్లో పడి డిన్నర్ విషయం గుర్తుకే రాలేదు. టైమెంతవుతోంది?"

"సిస్టర్ చెప్పిన ప్రకారం ఇంకో పదినిమిషాల్లో రావాలి. ఏడున్నర కాబోతోంది"

★ ★ ★

మే నెల! పన్నెండో తేది. మరో మహా కదలిక. భూమి అంతర్భాగంలో మరో పులకింత. వింత ప్రవర్తన. నేపాల్ని మళ్ళీ ఒకసారి అతలాకుతలం చేసింది. 'ఆఫ్టర్ షాక్' అన్నారు. మామూలుగా అయితే 'ఆఫ్టర్ షాక్' బలహీనంగా ఉండాలి. జన - ఆస్తుల నష్టాల వివరాలు, తీవ్రత, విస్తరణలని చూస్తే ఈ కదలిక మరో భూకంపంగానే చెప్పాలి. తర్జనలు- భర్జనలూ..! మూలిగే నక్కపై తాటికాయ పడింది. నేపాల్ మరోసారి బిగ్గరగా రోదించింది. ఏప్రిల్ 25 గాయాలు మానకముందే అతి స్వల్పకాలంలో మరో పునరావృతకేళి! మానవాళి మరోసారి గజగజా వణికింది. చిన్నదేశానికి పెద్ద సవాలు! అయితేనేం? అండగా ఎన్నోదేశాలు! అంతర్జాతీయ సంస్థలు! ప్రపంచబ్యాంకు! ప్రజల సొమ్మునూ!

## కొత్తగాలి...

**చీరకట్టు**
**పంచెకట్టు**
**మాటకట్టు**
**మన సంస్కృతి గుట్టు!**

- కృష్ణ మాధవరపు,
కాకినాడ

పులి షికారుకి గురైన జింక ప్రాణాన్ని పూర్తిగా వదిలేముందు అంగాలు అపుడపుడు జర్క్ ఇచ్చినట్టుగా కదలుతాయి- తోక, చెవులు, కాళ్ళు! 'ఆఫ్టర్ షాక్స్' అచ్చంగా అలాగే! కొన్ని వారాలు, నెలల వరకు వస్తూనే ఉంటాయి. నేపాల్లో అప్పటికే ఆఫ్టర్ షాక్స్ వందల్లో రికార్డయ్యాయి. కొన్ని తెలుస్తున్నాయి. కొన్ని కదలికలు తెలియవు కానీ రికార్డుల్లో నమోదవుతూనే ఉన్నాయి.

మీటింగులు, కాన్ఫరెన్సులు, విశ్లేషణలు! ఏ దేశ సహాయమెంతో ప్రకటనలు.

ప్రభా- కిరణ్‌లకి నేపాల్ వార్తలపై ఆసక్తి పెరిగింది. ఆఫ్టర్ షాక్ వచ్చిన తరువాత వార్తలని రోజూ చదువుతున్నారు. ఎంతో చింతిస్తున్నారు. అక్కడి ప్రజలపై జాలి పెరిగింది. నిర్మాణాలకి సంబంధించిన కోణంలో ఎక్కువ దృష్టిని కేంద్రీకరిస్తున్నాడు కిరణ్.

ఎండాకాలం ఎండిపోయింది.

చిరుజల్లులని భూమిపై చిందిస్తూ మేఘాలు బరువుని తగ్గించుకుంటున్నాయి. కుండపోతగా ధారలు.. అతివృష్టి! మరికొన్నిచోట్ల బక్కచిక్కిన మేఘాలు. పోషకాహారం లోపించి శుష్కించి దూది పింజల్లా! బి.పి.ఎల్. కార్డులని కూడా మోసే శక్తి లేక చలనహీనమై ఆకాశం

లోనే స్థాపితమయ్యాయి. అనావృష్టి!

వానాకాలం మెల్లగా వాడిపోయింది.

చలికాలం చిగురు తొడిగింది.

దసరా, దీపావళిలు ముస్తాబవడానికి ఆశగా ఎదురుచూస్తున్నాయి.

"కిరణ్... తొందరగా రా!" ప్రభ సంతోషంతో పిలిచింది.

వేగంగా అడుగులేసి బెడ్డు పక్కకి చేరుకున్నాడు కిరణ్. ప్రభ వెల్లకిలా పడుకొనుంది. మొహంలో కళ కాపురం పెట్టింది. ఆనందం ఆవరించుకుని మరీ అందంగా కనబడుతోంది.

"నిన్న నీకు చెప్పాను చూడు! కదలికలు మొదలయ్యాయని" తెరచిన కళ్లని మెల్లగా మూసి అనుభూతుల్ని గ్రోలుతూ ప్రభ.

కిరణ్ అరచేతి కింద ప్రభ గర్భంలో చిరు కదలికలు. తన అరచేతి కణజాలమంతా తియ్యని అనుభూతి! వింత స్పర్శ!!

చిన్ని చిన్ని కదలికలు. కిరణ్ కళ్ళు మూసుకొని శిశు కదలికలని సంపూర్ణంగా ఆస్వాదిస్తున్నాడు. తండ్రిగా తమ సంతానంతో ఇది మొట్టమొదటి సంధానం. జీవ సంధానం. ముగ్గురి మధ్య భావావేశ సంగమం. త్రివేణీ సంగమం!

అపూర్వ బంధానికి శ్రీకారం. కొన్ని నిమిషాల్లో అమూల్య క్షణాలు తనని కొత్త లోకానికి తీసుకెళ్ళాయి. నిర్వచించలేని తన్మయత్వం. చేతిని అలాగే ఉంచాడు. కళ్ళు మూసుకునే ఉన్నాయి. మనస్సుని కేంద్రీకరించి ఉద్వేగానికి గురవుతున్నాడు.

కదలికలు.. మెల్లగా తగ్గుతూ విశ్రమించాయి. కళ్ళు తెరచి ప్రభవైపు చూశాడు. ఆమె కళ్లు మూసుకునే ఉన్నాయి.

"ప్రభా!" పిలుపుతో కళ్ళు తెరిచింది.

ముందుకు వంగి ప్రభ నుదిటిపై, మూసుకున్న కళ్లపై, చెక్కిళ్లపై, పెదిమలపై ముద్దుల జల్లు.

"థాంక్స్! తండ్రిగా అనుభూతిని పొందే మధురఘడియలని ప్రసాదించావు"

రెండు చేతులతో కిరణ్ తలని దగ్గరగా తీసుకొని పెదిమలని జోడించింది.

శిశువు కదలికలు వేగాన్ని పెంచాయి!

ప్రభ గ్రహించి కిరణ్ చేతిని మళ్ళీ పొట్టపైన ఉంచుకుంది. అదే స్థాయిలో అతనూ అనుభూతి పొందాలన్న ఉత్సుకత!

చురుగ్గా కదలికలు. మొదటి కదలికలకి ఇప్పుడు కొనసాగుతున్న కదలికలకీ స్పిన్-ఫాస్ట్ బౌలింగ్ బంతులు విసురులలో ఉన్నంత తేడా. కిరణ్ సంతోషం హిమాలయ శిఖరాలని తాకింది. చేయి తీసి తన చెవిని ఆనించాడు. కళ్లు తెరుస్తూ.. మూస్తూ ఒక లోకంలో విహరించాడు. రెండో చెవికీ హక్కుంది! అన్యాయం జరగకూడదని మార్చాడు. ఆ చెవి కూడా వింత పులకరింతలని మధుర సంగీతంతో నింపుకుంది.

ముసిముసిగా నవ్వింది ప్రభ.

"కడుపులోని కదలికలు నీ శరీరానికే పరిమితం. తమాషా చూడు! నేను నా రెండు చెవులని ఆనించి పొందిన అనుభవం నాకే పరిమితం. ఈ మధురానుభూతిని నువ్వు పొందలేవు. పొందితే నువ్వెంతో ఆనందించేదానివి"

"నాకు ఎంతో సంతోషంగా ఉంది. నాకు వీలుకాని అనుభవాన్ని కేవలం నువ్వే పొందుతున్నావు. నేనెలాగూ డెలివరీ అయ్యేంతవరకు ప్రతిక్షణాన్ని అనుభవిస్తూనే ఉంటాను కదా!"

"నేనో చిన్న ప్రయోగం చేస్తానిప్పుడు! నువ్వు చూడాలి!"

"నీ బుర్రలోకి ఎప్పుడూ గొప్ప ఆలోచనలు వస్తూనే ఉంటాయి! ఇకనేం మొదలెట్టు.. డియర్!" ప్రోత్సహిస్తూ ప్రభ.

"జీవితంలో ఇవి అపూర్వక్షణాలు. మ్యాజిక్ మూవ్‌మెంట్స్! అంగంలో అంగమై నా శరీరంలో సమైక్యమై స్పర్శకి నోచుకోని ఈ కృత్రిమ చేతికి కూడా అద్భుత అవకాశం కల్పిస్తున్నాను. దీన్నెం

దుకు రిక్తపరచాలి" అంటూ రెండు చేతుల్ని ప్రభ పొట్టపైన పెట్టాడు కిరణ్.

కుడిచేతిలో నిండుగా జీవకణజాలం.

ఎడమచేతి కింది సగభాగం నిర్జీవకణ జాలం. కృత్రిమంగా అమర్చిన చెయ్యి!

ప్రభ ఒక్కసారిగా ఉద్వేగభరితమయ్యింది. "కిరణ్!" అంటూ తన రెండు చేతులని కిరణ్ చేతులపై మోపింది.

బాహ్యప్రపంచంతో సంబంధం లేకుండా నాలుగు చేతుల ఛత్రం కింద క్షణక్షణం పెరుగుతున్న శిశువు చురుగ్గా కదిలింది.



ఇద్దరూ సంతోషంగా నవ్వుకున్నారు.

"పద! ఆకలేస్తోంది! దీనికోసం నేను సమయానికి తింటుండాలి. ఇప్పటికే ఆలస్యమయ్యింది..." పొట్టవైపు చూపుతూ బెడ్డుపై నుండి లేచింది ప్రభ.

పక్కనున్న కృత్రిమ కాలిని ప్రభ దగ్గరిగా జరిపాడు కిరణ్. మోకాలి కింద దాన్ని అమర్చాడు. బెడ్డు దిగుతున్న ప్రభకి చేతినందించి డైనింగ్ టేబుల్‌వైపు అడుగులేశారు.

నాలుగు కాళ్ళ కదలికల్లో లయ. నాలుగు చేతుల కదలికల్లోనూ అంతే! అడుగుల్లో బలం ఉంది. చేతుల్లో పుష్టి ఉంది. క్రియల్లో సృజనాత్మకత దండిగా ఉంది. ఇద్దరిలో ఆత్మవిశ్వాసం పొరలుతోంది.




ప్రెస్‌కాన్ఫరెన్స్. ఖరీదైన హోటల్లో ఒక హాలు, దాని ముందరి లాబీ బాగా ముస్తాబై ఉన్నాయి. గృహనిర్మాణ రంగంలో ఎంతో పేరు ప్రఖ్యాతులు సంపాదించుకున్న ఓ వ్యక్తి కాన్ఫరెన్స్‌కి ముఖ్య అతిథి.

లాబీలో ప్రభా-కిరణ్‌ల పెద్దసైజు కటౌట్లు, నేపాల్లో భూకంపాన్ని చూపే ఫొటోలూ, శిథిలాల మధ్య ఇరుక్కుపోయిన ప్రభా-కిరణ్, తాము తీసుకున్న సెల్ఫీ ఫొటోలు, మీడియాలో ఇద్దరి గురించి వచ్చిన క్లిప్పింగులు, హైద్రాబాద్ చేరుకొని హాస్పిటల్లో ప్రవేశించేవరకు.. వరస క్రమంలో ఆడంబరంగా అమర్చారు. ప్రతిఫొటో వెలుగులో తడిసిపోతూ మరింత ప్రకాశంగా కనబడుతూ వచ్చేవారందరి దృష్టిని ఆకర్షిస్తున్నాయి. హాల్లోకి వెళ్లేవారందరు ప్రతి ఫొటోని చూస్తూ కాన్ఫరెన్స్ హాల్లోకి ప్రవేశిస్తున్నారు. ఒక పద్ధతి ప్రకారంగా అమర్చి, సృజనాత్మకరీతిలో కార్యక్రమాన్ని రూపొందించారు.

కాన్ఫరెన్స్ సమయం దగ్గర పడుతోంది. వచ్చేవారి సంఖ్య పెరుగుతోంది. నిమిషాల్లో హాలు నిండింది. వేదికపై ముఖ్య అతిథి. కుడివైపు ప్రభ, ఎడమవైపు కిరణ్. వెనక పెద్దక్షరాల్లో బ్యానర్. కింద ఆకర్షణీయమైన అక్షరాల్లో 'పంచ్' పదాలు- ఇంగ్లీషులో, తెలుగులోనూ!

పీ. కే. హౌజ్ మేకర్స్
సీస్మికల్లి రెసిస్టెంట్ -
లాస్ట్ వజ్ టు ఫాల్
(భూకంపాలని బుజ్జగించు!
ఆఖరి వరకు నిలబడు)

మృదువుగా, హాయిగా శాస్త్రీయ సంగీతం వినబడుతోంది. హాల్లో కూచున్న వారిలో క్రమశిక్షణ తనంతట తానే చోటుచేసుకుంటోంది. సెల్ ఫోన్ల స్పీకర్లకి తాళాలు పడుతున్నాయి. ప్రకంపనలకి తాళాలు తెరుస్తున్నాయి. కార్యక్రమానికి కౌంట్ డౌన్..5..4..3..2..1.

ప్రభ స్వాగతం పలికింది.

"...మీడియా మిత్రులకి మేమిద్దరం హైద్రాబాద్ విమానాశ్రయంలో స్ట్రెచర్లపై పడుకొని హాస్పిటల్‌కి వెళుతూ కొన్ని నెల్లక్రితం వాగ్దానం చేశాం. ఇపుడు మా ఆరోగ్యాలు మెరుగయ్యాయి. పనులన్నీ చక్కబడ్డాక మీతో మా నేపాల్ అనుభవాలని వివరంగా పంచుకుంటామని అన్నాం. గడిచిన నెలల్లో మేమిరువురం ఎన్నో సవాళ్లని ఎదుర్కొన్నాం! మీరు ఫొటోల ప్రదర్శనని లాబీలో చూశారు కదూ! ఈ రోజు మేమిద్దరం మీ ముందు నిల్చున్నాం! అది మా

అదృష్టం. మీ అందరి ఆశీస్సులు, పెద్దల ఆశీర్వచనాలు!" చప్పట్లు మోగాయి. కొన్ని సెకన్ల పాటు చేతులు లయలో శబ్దాల్ని పుట్టించాయి.

"ఇపుడు కిరణ్ పవర్ పాయింట్ ప్రజెంటేషన్‌తో మిమ్మల్ని నేపాల్‌కి తీసుకెళతారు. ఆయన మాటల్లోనే వినండి" అని ప్రకటించి కిరణ్‌ని ఆహ్వానించింది.

ముఖ్య అతిథిగా, ప్రభ వేదిక దిగి ప్రజెంటేషన్ చూడటానికి ముందు వరుసలో కూచుంది. కిరణ్ స్మార్ట్‌గా కార్పొరేట్ స్థాయి చీఫ్ ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌లా హుందాగా, ఆత్మవిశ్వాసంతో కనబడుతున్నాడు. నడిజీవితంలో వచ్చిన 'డిజెబిలిటీ' తాలూకు బలహీనతలు కనబడనీయకుండా సాధారణంగా కదులుతున్నాడు.

"మీ అందరికీ నేను రెండు చేతులతో నమస్కరించలేను. క్షమించాలి! ఒక చేతిలో జీవం లేదు. అందుకే నా శరీరాన్ని వంచి మీ అందరికీ సగౌరవంగా నమస్కరిస్తున్నాను"

అందరూ 'హుక్' అయిపోయారు. చప్పట్లు కొనసాగాయి.

"..ప్రభ చెప్పినట్టుగా ఈ రోజు మా వాగ్దానాన్ని పూర్తిచేస్తున్నాం. ముప్పై సంవత్సరాలు కూడా నిండని మాకు రెండు జన్మలు. మొదటిజన్మ మన దేశంలో, తెలుగు గడ్డపై, రెండో జన్మ నేపాల్లో! భూకంప శిథిలాల్లో ఇరుక్కున్న మేం బతికి తిరిగి ఇండియా వస్తామన్న ఆశలు తగ్గడం మొదలయ్యాయి. కొన ఊపిరి వరకు పోరాడాం. గొంతులని తడి చేసుకోడానికి నానా కష్టాలు పడ్డాం. ఎలాగో ప్రాణాలని నిలుపుకున్నాం. సమయానికి రెస్క్యూ బృందాలు వచ్చి బయటకు తీశారు. అది మా ఇద్దరి రెండో జన్మ! శిథిలాలు కప్పుకున్న గర్భం నుండి సహాయ బృందాల ద్వారా మా ఇద్దరికీ మరోసారి 'డెలివరీ'లు అయ్యాయి!" ప్రభవైపు చూస్తూ కిరణ్ భావోద్వేగంతో అన్నాడు.

కొన్ని క్షణాలు సంపూర్ణ నిశ్శబ్దం!

"అమ్మ గర్భంలో మనమంతా ఎంత సుఖాన్ని అనుభవించామో నెమరు వేసుకోలేం! మనకి తెలియదది. అది అసాధ్యం! కానీ మనందరికి తెలుసు- అదొక స్వర్గసీమ! పెరుగుతున్న పిండం.. శరీరాంగాలు.. రూపాల్ని దిద్దుకుంటున్న దశలు. మనసారా పంచుకోలేని మధుర ఘడియలవి! అయితే శిథిలాల మధ్య మా అనుభవాలు పూర్తిగా వ్యతిరేకం. మన జ్ఞానేంద్రియాలు సజీవంగా ఉంటాయి. అమ్మ కడుపు తీపి అస్సలే ఉండదు. దుర్బలమైన పరిస్థితులు!

ప్రింట్ మీడియా వారి చేతుల్లో పెన్నులు గజిబిజి రాతలతో పేజీలను నింపుతున్నాయి. మరునాడు రేఖలు ముద్దుగా మేకప్‌తో లక్షలమంది పాఠకులకు దర్శనమిస్తాయి. టీవీ, డిజిటల్ కెమెరాలు ఎక్కుపెట్టిన వైపు నుండి సంపూర్ణంగా 'డిపాజిట్' చేసుకుంటున్నాయి. కార్యక్రమమైన గంటలో బుల్లితెరలపై అన్ని ఛానెళ్లలో ప్రభ-కిరణ్‌లు ప్రత్యక్షమవుతారు. వార్త ఒక్కటే! రూపాలు వేరు!!

ప్రింట్ మీడియా కాచిన కాఫీ అనుకుంటే ఎలక్ట్రానిక్ మీడియా ఇన్‌స్టంట్ కాఫీ.

పవర్ పాయింట్ ప్రజెంటేషన్ మొదలైంది. ఒక్కో స్లైడ్ చూపుతూ హృదయాలని వశపరుచుకుంటూ కిరణ్ ధారాళంగా మాట్లాడాడు. తామిద్దరినీ శిథిలాలు ఎలా కప్పేశాయో, తల్లి గర్భంలోని శిశువుల్లా ఎలా రోజులు గడపాల్సి వచ్చిందో, తాము తీసిన ఫొటోల ఆధారంగా చూపాడు.

ఉత్కంఠ ఆవరిస్తోంది. అందరి మొహాల్లో ఆసక్తి పెరుగుతోంది.

ప్రభ కొన్ని నిమిషాలు తన అనుభవాలని తెలిపింది. ఒక స్త్రీగా తాను పడ్డ అవస్థలని నొక్కి చెప్పింది.

నిశ్శబ్దం.. చప్పట్లు.. ఇద్దరిపై సాను

భూతి.. వారి ధైర్యసాహసాలకి అందరూ ప్రశంసగా చూపులు!

"ఇప్పుడు మీ అందరినీ కొన్ని క్లిష్టమైన ప్రశ్నల్ని అడుగుతాం. ఆలోచించండి! గంభీరంగా ఆలోచించాలి సుమా! ప్రతి భూకంపంలో ఎందుకు అమాయక ప్రజలు చనిపోతారు? అంతకు మించి వికలాంగులెందుకవుతారు? ఇళ్ళెందుకు పేకముక్కల కట్టడాల్లా చిన్న కదలికలకే పడిపోతాయి? బిల్డింగ్ కోడ్స్ భూకంప ప్రభావాలని తగ్గించే భవన నిర్మాణ టెక్నాలజీ అందుబాటులో ఉన్నా ఎందుకు ఉపయోగించడంలేదు? ప్రభుత్వం ఎందుకు, ఎక్కడ విఫలమవుతోంది? " ఆవేశపూరితంగా కిరణ్ ప్రశ్నలని అందరి ముందు విసిరాడు. "కొన్ని నిమిషాలు మీరంతా సీరియస్‌గా ఆలోచించండి! గత ముప్పై సంవత్సరాల్లో మనదేశంలో, మన ఇరుగు పొరుగు దేశాల్లో వచ్చిన భూకంపాలని.. పెద్ద సంఖ్యలో చనిపోయిన మన తోటివారిని స్మరించుకోండి!

లాతూర్ (మహారాష్ట్ర)లో పదివేల వరకు! కచ్ - భుజ్ (గుజరాత్)లో ఇరవై వేలకి పైగా! నేపాల్లో పదివేల వరకు! పాకిస్థాన్, చైనా దేశాల్లో వేలల్లో!"

స్క్రీన్‌పై గణాంకాలు రంగురంగుల్లో కనబడుతున్నాయి. ఎరుపు రంగు బీమ్ లైట్ పాయింటర్‌తో ప్రతి దేశపు మృతుల సంఖ్యని చూపుతూ నొక్కి చెప్పాడు.

హాలంతా దీర్ఘాలోచనలో పడ్డారు.

ముఖ్యఅతిథి ప్రశంసాపూర్వకంగా కిరణ్ - ప్రభల వైపు చూశాడు. అంశాలని కిరణ్ హైలైట్ చేసిన విధానం, ప్రశ్నల ద్వారా అక్కడున్న వారిలో ఆసక్తి రేకెత్తించడం తనకి చాలా నచ్చింది.

నిశ్శబ్దాన్ని ఛేదిస్తూ "మన భవనాలని, ఇళ్ళని కోడ్స్ ప్రకారంగా కడితే బహుశా నేపాల్లో మేం బసచేసిన హోటల్ భవనం కానీ, కిరణ్ షాపింగ్‌కి వెళ్ళిన బిల్డింగ్ కానీ కూలిపోయేవి కావు. రక్షణ కోసం కట్టుకున్న ఇళ్ళే కూలి మనం చావులకి, వినాశనాలకి గురవుతున్నాం. ప్రభుత్వ యంత్రాంగం పట్టించుకోదు. బిల్డర్స్‌కి కోడ్స్ నిర్మాణ రంగపు టెక్నాలజీ గురించి అవగాహన లేక అధికారులతో కుమ్మక్కయి నిబంధనలని ఉల్లంఘించి ఇళ్ళని మొక్కుబడిగా నిర్మించి మనందరిని మృత్యుగృహాల్లోకి తోస్తున్నారు! మనమంతా చైతన్యవంతులం కావాలి. బిల్డర్స్‌ని టెక్నికల్ ప్రశ్నలడగడం నేర్చుకోవాలి" దేశంలో జరుగుతున్న వాస్తవాల గురించి, అక్రమాల గురించి ప్రభ అక్కడి వారిలో ఆలోచనా బీజాలని నాటింది.

కాస్సేపు నిశ్శబ్దం! మెదళ్ళలో మథనం. నిర్మాణ టెక్నాలజీ గురించి పట్టించుకునే వారిలో కొత్తదిశలో ఆలోచనలు. ఎప్పుడూ ఏరియా, బెడ్రూముల సంఖ్య, ప్రైవసీలే తప్ప కొనేముందు మరోపార్శ్వం గురించి కూడా ఆలోచించాలన్న సంగతి ఇప్పుడు తెలుస్తోంది.

మెల్లగా ఉత్సాహంతో ప్రశ్నల పరంపర! శాస్త్ర-సాంకేతికపరంగా జవాబులు. అందరికీ అర్థమయ్యేట్టు చెప్పడంలో ఇద్దరి ప్రావీణ్యతని అందరూ మెచ్చుకున్నారు.

ముఖ్య అతిథి తరపు నుండి రెండు అనుభవాలని నింపుకున్న ప్రశ్నలు. ప్రసన్నంగా ఇచ్చిన జవాబులని ముచ్చటగా విన్నాడు. 'ఔట్ ఆఫ్ బాక్స్' ఆలోచనా విధానం ఆయన్ని ఎంతో ఆకట్టుకుంది.

పది నిమిషాల విరామం.

టీ-కాఫీల సరఫరా, తోడుగా రకరకాల అల్పాహారాలు!

లాబీలోని ప్రదర్శనని పూర్తిగా చూడని వారు బయటకి కదిలారు.

ప్రభ రెండో ప్రజెంటేషన్‌కి సిద్ధమవుతోంది. కిరణ్ ముఖ్య అతిథి పక్కకి చేరాడు. ప్రభ లేచి ఏ మాత్రమూ తేడా లేని నడకతో లాప్‌టాప్ ముందరికి

అక్షరం

**జీ**వితం నీటి బుడగలాంటిది
కానీ రెండు విషయాలు శాశ్వతం
అవి.. ఇతరుల కష్టాలకు చలించడం,
ఆత్మవిశ్వాసంతో చరించడం

– డయానా



చేరింది. ఫార్మాలిటీస్ పూర్తిచేసింది.

"మా కుటుంబంలో ఈ రోజు మరొకటి మీ అందరి ముందు జన్మిస్తోంది. పేరుని పుట్టక ముందే పెట్టాల్సి వచ్చింది!"

అందరి మొహాలపై ప్రశ్నార్థకాలు.

అర నిమిషం నిశ్శబ్దం! ప్రభ అందరిని వేగంగా విహంగ దృష్టితో చూసింది. మృదువుగా నవ్వింది. "ఒకసారి మా బ్యానర్ని చూడండి. వినూత్న రీతిలో 'పీకే హౌజ్ మేకర్స్'ని ఈ రోజే ప్రారంభిస్తున్నాం" చప్పట్లు! నిమిషం దాటింది. ఇంకా కొనసాగి క్రమంగా తగ్గుతూ నిశ్శబ్దంలో కలిసిపోయాయి.

స్లైడ్లని చూపుతూ.. వివరిస్తూ.. వాక్చాతుర్యంతో అందరినీ కట్టేసింది ప్రభ. రియల్ ఎస్టేట్ వ్యాపారపు దీర్ఘలక్ష్యం ఒక స్లైడులో.. చక్కగా రూపొందించిన ఆరు ఉద్దేశ్యాలు మరో స్లైడులో!

ఇంకా.. ఇంకా..!

హఠాత్తుగా ప్రకంపనలు. హాల్లో షాండ్లియర్ అటూ ఇటూ ఊగుతోంది. మరి కొన్ని వస్తువుల్లో స్వల్ప కదలికలు.

హాల్లో కూచున్న వారందరూ క్షణాల్లో లేచి బయటికి పరుగులు.

అనుమానం లేదు. భూకంపమే!

అస్తవ్యస్తమైన రీతిలో అక్కడివారు బయటపడే ప్రయత్నంలో ఉన్నారు. చిన్న సైజు తొక్కిసలాట! హోటల్ స్టాఫ్ వారి 'ఎవాక్యుయేషన్ టీం' రంగ ప్రవేశం చేసింది. ఆచరణ కరువయ్యింది. తమకు తోచిన ప్రకారం మార్గాలని చేసుకుంటూ బిల్డింగ్ నుండి బయటపడాలనే ఆతురత.. ఆరాటం!

నలుగురైదుగురు అడుగులు తప్పారు.. పడిపోయారు! వారిపై కాళ్లని మోపి గంతులతో బయటకి పరుగులు. కాన్ఫరెన్స్ వాలెంటీర్లు పడిపోయిన వారిని సురక్షిత స్థలానికి చేర్చారు.

ముప్పై సెకండ్ల మైల్డ్ ప్రకంపనల్లో ఎన్నో చర్యలు.. ఎంతో హడావుడి.. ఎంతో అస్తవ్యస్తం..!

సద్దుమణిగింది! అందరిలో ఊరట! షాండ్లియర్ క్రమేణా నిలకడకి చేరుకుంటోంది. కిరణ్ అప్పటికే 'బ్రేకింగ్ న్యూస్' చూసి వివరాలు సేకరించి 'స్వల్ప ట్రెమర్స్' అని ప్రకటించాడు.

హోటల్ స్టాఫ్ పావుగంటలో విశాలమైన లాన్లో వేగంగా తాత్కాలిక అమరికలు చేసింది. కాన్ఫరెన్స్ శేషభాగం అవాంతరాలు లేకుండా కొనసాగింది.

కాన్ఫరెన్స్ జరుగుతున్నప్పుడే ట్రెమర్స్ రావడం 'విషయ ప్రాముఖ్యతని ప్రభావితం చేసింది' అని అనుకున్నారు.

చివర్లో మార్కెట్లో ఉన్న బిల్డర్స్ అందిస్తున్న సేవలకి, తమ సంస్థ అందించే సేవలకి తేడాలు.. విశిష్టతలు.. అతి ముఖ్యంగా 'భద్రత' విషయానికి నిర్మాణ రంగంలో వస్తున్న నూతన టెక్నాలజీ అనుసంధానం.. విషయాలని విడమరచి చెప్పింది. టెక్నికల్ విషయాలని అరటిపండు ఒలిచినంత సులభం చేసింది. రెండు భాషల్లో రంగరించిన తూటా వాక్యాలని పదే పదే తన ప్రసంగంలో, వివరణలో, ప్రశ్నలకిచ్చే సమాధానాల్లో

తీసుకొచ్చింది. అందరి నాల్కలపై ఆ రెండు లఘు వాక్యాలని చెదిరిపోని పచ్చ బొట్లలా రాసింది.

'సీస్మికల్లి రెసిస్టెంట్-
లాస్ట్ వన్ టు ఫాల్'
(భూకంపాలని బుజ్జగించు-
ఆఖరి వరకు నిలబడు)

మెల్లగా మొదలైన చప్పట్లు.. గట్టిగా మారాయి.. మరింత ఊపందుకొన్నాయి! ఒక్కసారే బ్యానర్‌పై నున్న అక్షరాలు వెలుతురిని వెదజల్లే అక్షరాల్లోకి మారాయి. రంగురంగుల్లో అక్షరాలు క్రమేణా వస్తూ పోతున్నాయి! చూడ్డానికి ఇంపుగా ఉంది. పంచ్ లైన్లు మరీ మరీ ఆకర్షిస్తున్నాయి.

ముఖ్య అతిథి కరపత్రాన్ని, తరచుగా అడిగే ప్రశ్నలు- సమాధానాల చిరుపుస్త కాన్ని విడుదల చేశారు. "నిర్మాణ రంగంలో సుదీర్ఘ అనుభవాన్ని గడించినా, పేరు సంపాదించినా ఈ రోజుటి కార్య క్రమం నాకొక అద్దాన్నిచ్చింది- నన్ను నేను మరోసారి జాగ్రత్తగా చూసుకోడానికి. ఈ సమావేశం నుండి విలువైన ఉత్తేజాన్ని పొందాను. నిర్మాణ రంగంలో ఉత్తమ సేవలందించడానికి వీరు కంకణం కట్టుకో వడం ఎంతో మెచ్చుకోదగ్గ విషయం. నూతన శకానికి రూపకర్తలైన వీరిద్దరికీ అన్నిరకాల విజయాలు అందాలని మన సారా కోరుతున్నాను, ఆశీర్వదిస్తున్నాను"

ముగింపు మాటలతో ముఖ్య అతిథి కార్యక్రమానికి తగ్గని స్థాయిలో అలరిం చారు. ప్రభ- కిరణ్‌లని అభినందించారు. ఇద్దరితో చేతులని కలిపి శుభాకాంక్షలని అందించి పెద్ద తరహాలో తలలపై తన రెండు చేతులుంచి ఆశీర్వదించారు.

శ్రోతలు మెల్లగా కదులుతున్నారు. కొందరు మరోసారి ఫొటోలని పరీక్షగా చూస్తూ కదిలారు. గృహ నిర్మాణ రంగంలో కొత్త వంగడం మొలకెత్తుతోంది!

★ ★ ★

కదలికలు.. చిన్న కదలికలు.. మధ్యమ కదలికలు.. ఉధృత కదలికలు.. చిరుగా లికి ఆకుల్లో కదలికలు.. ఆకాశంలో మేఘాల కదలికలు.. గర్భాశయాల్లో శిశు వుల కదలికలు.. చీమల్లో కదలికలు.. దోమల్లో కదలికలు.. మనుషుల గుండెల్లో కదలికలు.. రక్తప్రసరణలో కణాల కదలి కలు.. అండాన్ని చేరడానికి వీర్యకణాల్లో కదలికలు.. టీవీ తెరపై బొమ్మల కదలి కలు.. నదుల్లో నీటి కదలికలు.. సము ద్రాల అలల్లో కదలికలు.. పార్లమెంటులో రాజకీయ నాయకుల కదలికలు.. జడ్జిల కదలికలు... పోలీసు లాఠీలో కదలిక లు.. సరిహద్దుల్లో జవాన్ల కదలికలు.. పెద్ద కంపనీల సి.ఈ.ఓ.ల ఆలోచనల్లో కదలికలు.. నోళ్లల్లో నాల్కల కదలికలు.. కంప్యూటర్ల స్క్రీన్లపై అక్షరాల కదలికలు.. నీలో కదలికలు.. నాలో కదలికలు.. భూ గర్భంలో నిద్రాణమై ఉన్న అన్నిరకాల ఫల కాల్లో కదలికలు.. ఈ కదలికలతో భూ మిపై పెద్దఎత్తున కదలికలు.. సమస్త జీ వ నిర్జీవాల్లో కదలికలు.. మీ చేతుల్లో ఉ న్న 'చతుర' పుటల్లో కదలికలు.. పంక్తుల ని చదువుతున్న మీ కన్నుల్లో కదలికలు!!

అనగనగా ఒక రాజు, ఒక రాణి లాంటి కథ కానే కాదు! వినగా వినగా వింటూనే ఉండాలనిపించే సమకాలీన కథలెన్నో!

విపత్తుల ఛాయల్లో హాయిగా నిద్రి స్తున్న మనందరి కథలు!

కదలికలతో అందరినీ కదిలించే కథ లెన్నో! ఎన్నెన్నో!! 

*నేపాల్లో భయంకరమైన భూకంపం సంభ వించి ఈ ఏప్రిల్‌కి సరిగ్గా రెండేళ్లు! ఆ మహా విషాదంలో 9 వేలమందికి పైగా చనిపోయారు. 22 వేలమందికి పైగా గాయపడ్డారు. ఆ పెను విపత్తులో మృత్యుంజయులైనవారికీ విగతజీవు లకు, క్షతగాత్రులకూ ఈ నవల అంకితం.*

*- రచయిత*

*ఒత్తిడి అవగాహనా మాసమిది!*

# ఆందోళన మటుమాయం!



ఇవాళ్టిరోజున ఎందరినో వేధిస్తున్న సమస్య డిప్రెషన్! సానుకూల దృక్పథం లేకపోవడం, మితిమీరిన పనులు, అభద్రత, లేనిపోని రాజకీయాలు, శ్రమకుతగ్గ ఫలితం లేకపోవడం, అర్జంట్ డెడ్‌లైన్లు, అదనపు పని వేళలు లాంటివెన్నో డిప్రెషన్‌కు దారి తీస్తాయనేది నిపుణుల థియరీ! నిజానికి మన శరీరం కంప్యూటర్ని మించిన మహాయంత్రం. అదెప్పుడూ అప్రమత్తంగానే వుంటూ హాని చేసే ప్రతి దాన్నీ మనసు, మెదడు తిరస్కరిస్తాయి. కానీ ఆ అలారాలూ అలర్ట్‌లను పట్టించుకోక చిక్కుల్లో పడుతుంటాం. అందుకే దిగుళ్ళు డిప్రెషన్ స్థాయికి చేరకముందే జాగ్రత్త పడమంటున్నారు సైకియాట్రిస్టులు.

ఏవో అడ్డంకులు, అవరోధాలు ఎదురైనంతలో ఆందోళనసంద్రంలో మునిగి ఒత్తిడి ఓటమిలో కొట్టుకుపోవాల్సిన పనిలేదని ఎందరో మేధావులు నొక్కివక్కాణించారు. 'మెలకువలో కనే కల ఆశ' అన్నారు అరిస్టాటిల్. అంతకంటే గొప్ప తత్వమేముంది? సానుకూలత, ఆశావహ దృక్పథాలతో ఆశలు, ఆశయాలను నెరవేర్చుకోవచ్చు. 'శక్తిసామర్థ్యాలను పెంచుకుంటే పని సులువవుతుంది. ఒకేసారి అనేక బాధ్యతలు గాక క్రమాన్ని అనుసరించడంవల్ల ఒత్తిడి వుండద'ని తేల్చారు అమెరికన్ సైకాలజిస్టు విలియం జేమ్స్. 'పనిని ఇష్టంగా చేయడంవల్ల విసుగు, అసహనం తలెత్తవ'ని బెంజ్‌మన్ ఫ్రాంక్లిన్ చెప్తే, 'పనిలో వేగంవల్ల మరింత సాధించవచ్చ'ని ఆస్కార్‌వైల్డ్ సూచించారు. 'గతము-భవిష్యత్తుల బెంగల్లేకుండా వర్తమానంలో జీవిస్తే ప్రశాంతంగా వుంటుంద'నేది భారత తత్వవేత్త అమిత్‌రే ఉవాచ. 'జీవితం అన్నాక ఒత్తిడి తప్పదు. ఆ ఒత్తిడి ముందుకు నడపాలే తప్ప అవరోధం కాకూడదు' అన్నారు స్టాన్లీ వి. జాన్సన్ 'స్ట్రెస్ అండ్ పీస్' ఉద్గ్రంథంలో. 'శ్రమించక ఏదీ లభ్యంకాదు. కష్టాలను ఇష్టంగా స్వీకరిస్తూ సాగినపుడు శ్రమకు తగిన ఫలితం దొరికితీరుతుంది' ఇది గ్రీకు తత్వవేత్త అరిస్టాటిల్ నేర్పిన పాఠం. ఇక ప్రపంచ ప్రఖ్యాత హాస్యనటుడు చార్లీచాప్లిన్ 'ఈ దుష్ట ప్రపంచంలో ఏదీ శాశ్వతం కాదు.. ఆఖరికి మన కష్టాలు కూడా' అంటూ ఆందోళనకెన్నడూ చోటివ్వొద్దనే విలువైన సందేశమిచ్చారు. అదీ సంగతి! జీవితమన్నాక సవాళ్ళను ఎదుర్కోవాల్సిందే! సానుకూలత, సామర్థ్యాలతో సాగితే ఒత్తిడీ డిప్రెషన్లు లేకపోగా ఆత్మస్థైర్యం పెరిగి అభివృద్ధి సాధిస్తామన్నమాట!

ఇక శారీరక, మానసిక ఆరోగ్యాలకు పెద్దలు చెప్పే చిట్కాలు చూడండి:

★ తలకు మర్దన చేసుకోవడంవల్ల ఒత్తిడి తగ్గుతుంది.

★ తగిన పని, వ్యాయామం, సాత్వికాహారం, ధ్యానాలతో జీవనశకటం సాఫీగా సాగిపోతుంది.

★ అన్నిటినీ మించి కడుపునిండా తిని, కంటినిండా నిద్రపోతే ఆనందమే తప్ప ఆందోళనే దరిచేరదట.

ఎంత సులువైన విలువైన మాటలివి!

– *నాగరత్న*

# అవార్డులు - ఆవిష్కరణలు



మార్చి1న శ్రీమానస ఆర్ట్ థియేటర్స్ ఆధ్వర్యంలో హైదరాబాద్‌లోని నేషనల్ బుక్‌ట్రస్ట్ కళావేదికపై రవ్వా శ్రీహరికి ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం స్మారక పురస్కారాన్ని కసిరెడ్డి వెంకటరెడ్డి ప్రదానం చేస్తున్న దృశ్యం. చిత్రంలో బి. రామచంద్రరావు, డా. నోరి రాజేశ్వర రావు, అంబల్ల జనార్దన్, డా. పత్తిపాక మోహన్, రఘుశ్రీ, కడియాల ప్రభాకర్ ఉన్నారు.



విశాఖపట్నం జర్నలిస్టు సంఘం ఆడిటోరియంలో ఫిబ్రవరి 16న 'కావేరీ నీవెక్కడ?' నవలను పద్మశ్రీ యార్లగడ్డ లక్ష్మీప్రసాద్ ఆవిష్కరించి రచయిత బి.పి.యస్. పట్నాయక్, ఆయన సతీమణి కళావతిలను సత్కరిస్తున్న దృశ్యం.

## ముఖ్య గమనిక :

ప్రతినెల 17 నుంచి తరువాతి నెల 16 తేదీ లోపల జరిగిన సాహిత్య కార్యక్రమాల ఫొటోలను ఈ శీర్షికకు పంపవచ్చు. ఫొటోలో ఉన్న వ్యక్తులందరి పేర్లు ఎడమ నుంచి కుడికి స్పష్టంగా రాయాలి. కార్యక్రమం ఎప్పుడు? ఎక్కడ? జరిగిందో పేర్కొనాలి. ఏ అవార్డు, ఎందుకు ఇచ్చారో వివరంగా ఉండాలి. ఏ గ్రంథం, ఎవరు ఆవిష్కరించారు? రచయిత ఎవరు? తెలపాలి. (నిర్వాహకుల ఫోన్ నెంబరు ఇస్తే అవసరాన్ని బట్టి సంప్రదించడానికి వీలుంటుంది) ఫొటోల స్థాయి, నాణ్యతలను బట్టి ప్రచురణకు పరిశీలిస్తాం.

# సింగపూర్‌లో లిటిల్ ఇండియా

సింగపూర్ రోడ్లపై పర్యటిస్తున్న మనం ఒక్కసారిగా హైదరాబాద్‌లోని కోఠి లేదా మద్రాసులోని పాండిబాజర్‌లో ఉన్నట్లు అనిపిస్తే అది కచ్చితంగా సింగపూర్‌లోని లిటిల్ ఇండియా ప్రాంతమని చెప్పొచ్చు. డిల్లీ వాసులైతే ఇది చాందినిచౌకా అని, ముంబయివాళ్లయితే ఝువేరి బజారుకొచ్చామా! అని ఆశ్చర్యపోతారు.

సింగపూర్ వెళ్ళిన ఏ భారతీయుడైనా మెర్‌లైన్(సగం సింహం సగం చేప బొమ్మ) పర్యాటక ప్రదేశాన్ని చూడటం ఎంత సహజమో 'లిటిల్ ఇండియా' ప్రాంతాన్ని చూడటం అంతే సహజం.

ఒక విధంగా చెప్పాలంటే లిటిల్ ఇండియా ప్రాంతాన్ని 'మోడల్ ఇండియా' అని పిలిస్తే బాగుంటుందేమో అనిపిస్తుంది. లిటిల్ ఇండియా బజార్‌కి వెళ్ళగానే హిందీ, తమిళం, తెలుగు వంటి భారతీయ భాషలు గుప్పుమంటాయి. మన దేశంలోలాగే ఒకరినొకరు నెట్టుకుంటూ తోసుకుంటూ వెళ్ళటం కనిపిస్తుంది. కార్ల హారన్లతో పాటు సైకిల్ గంటల శబ్దాలూ వినిపిస్తాయి. ప్లాట్‌ఫారాలు రకరకాల వస్తువులతో నిండిపోయి ఉంటాయి. ఇంకా కొనుగోళ్ల కోసం రాతపూర్వక ఆహ్వాన బోర్డులే కాదు 'రండి - ఆవో బాయీ' అంటూ ప్రార్థనా పూర్వకమైన గొంతులు వినిపిస్తాయి.

సింగపూర్‌లోని సెరంగూన్ ప్రాంతంలో లిటిల్ ఇండియా ఉంది. ఇది అక్కడి ఇతర ప్రాంతాలకంటే సందడిగా ఉండటమే కాదు సాంస్కృతిక వైవిధ్యం కూడా ఉట్టిపడుతుంది. షార్టులు, జీన్సులే కాదు లుంగీలు, దోవతీలు, చీరలు ధరించిన వారు దర్శనమిస్తారు. ముఖ్యంగా అక్కడ మన వంటశాలల ఘుమఘుమలు బహిరంగంగానే వెదజల్లుతూ ఉంటాయి. మన మల్లెలు, సంపెంగలు, అరటి ఆకులు, వేరుశనగ గంపలు, కిళ్ళీలు, అటుకుల మిక్చర్ తోపుడు బళ్ళు, ఖర్జూరం బళ్ళు కనిపిస్తాయి. దినపత్రికలు అమ్మే కుర్రాళ్ళు, రోడ్డుపక్కన చౌకరకం రెడిమేడ్ వస్త్రాలు అమ్మేవాళ్ళు, చివరకు తాయిత్తులు కట్టేవారు, వాచీలు తాళాలు రిపేరు చేసేవాళ్లు కూడా కనిపిస్తారు. కూరగాయల్లో ములక్కాడలే కాదు ములగాకు, కరివేపాకు, చింతచిగురు దర్శనమిస్తాయి. వెండి, రోల్‌గోల్డ్ ఆభరణాలు, మసాలా దినుసుల అమ్మకం గురించి చెప్పనే అక్కరలేదు. అగరబత్తులు, సెంట్ల సువాసనలు ముక్కులను తాకుతుంటాయి. ఇలా లిటిల్ ఇండియాలో అన్ని రకాల భారతీయ వస్తువులూ దొరుకుతాయి.




టెకామార్కెట్ ఫుడ్ సెంటర్‌లోని తోపుడు బండ్లపై భారతీయ భోజనం.. ముఖ్యంగా మటన్, చికెన్, రొయ్యల బిర్యానీ దొరుకుతుంది. సింగపూర్‌లో పెద్దసంఖ్యలో ఉండే అల్పాదాయ కార్మికులకు చౌక భోజనాలు దొరికేది అక్కడే. చౌక భోజనాలు, టిఫిన్లే కాదు కాస్త ఖరీదైన భారతీయ వంటకాలు లభించే ఇండియన్ రెస్టారెంట్లు ఎన్నో ఉన్నాయి. వాటి ముందు డిస్‌ప్లే బోర్డులు వేలాడుతుంటాయి. కాస్త ధర ఎక్కువైనా జోజీఆవోఫుడ్ సెంటర్‌కి తప్పక వెళ్ళాలి. కోమలా విలాస్ రెస్టారెంట్‌లో అచ్చమైన భారతీయ సంప్రదాయ భోజనం లభిస్తుంది. లోయర్ సెరంగూన్ రోడ్డు నుండి కిచనేర్ రోడ్డు వరకు ఎన్నో ఆలయాలు, షాపింగ్‌మాళ్లు ఉన్నాయి. బఫెల్లో రోడ్, కెరంబూ రోడ్, బలీలియో రోడ్, కరైకొడి సెంటర్, డన్‌లప్ స్ట్రీట్, క్యాంప్ బెల్ లైన్, హెండర్సన్ రోడ్, చందర్ రోడ్, కాంసోగ్‌కాపూర్ రోడ్‌లలో షాపింగ్ చేయవచ్చు

నెహ్రూ 1950లో శంఖుస్థాపన చేసిన గాంధీ మెమోరియల్ హాల్ కూడా అక్కడే ఉంది. ముఖ్యంగా ఆ ప్రాంతంలోని శ్రీలక్ష్మి మందిరం, కలియమ్మన్ మందిరం, శ్రీనివాస పెరుమాళ్ అనే వెంకటేశ్వర స్వామి ఆలయాల కారణంగా కూడా లిటిల్ ఇండియా రద్దీ ప్రాంతంగా మారిందని చెప్పొచ్చు. లిటిల్ ఇండియా ప్రాంతానికి అండర్ గ్రౌండ్ రైలు మార్గం ఉంది. స్టేషన్ నుండి బయటకు రాగానే సెంటర్ కనిపిస్తుంది. లిటిల్ ఇండియాకి అతి సమీపంలోని ముస్తఫా సెంటర్ గురించి ప్రత్యేకంగా చెప్పుకోవాలి. అది 24 గంటలూ తెరచి ఉండే అతిపెద్ద షాపింగ్‌మాల్! సింగపూర్ టూర్‌లో గైడ్లు ఆ షాపింగ్ కోసమే పది పన్నెండు గంటలు కేటాయిస్తారు. అక్కడ గుండుసూది మొదలుకొని దొరకని వస్తువంటూ ఉండదు. భారతీయులు ఎలక్ట్రానిక్స్, బంగారు వస్తువులు ఎక్కువగా కొనేది అక్కడే. సింగపూర్‌లో సుందరమైన భవనంగా కీర్తించే లినోంగ్ సేన్ బౌద్ధమందిరం లిటిల్ ఇండియా ప్రాంతానికి కూతవేటు దూరంలో ఉంది.

– పుట్టా సోమన్నచౌదరి

పెద్దకథ

# మలి పొద్దులో..

ఆమె పేరు అంతర. ఇవాళ ఎందుకో ఆమె కింశుక్ మీది కోపంతో ఆపాదమస్తకం రగిలిపోతున్నది. అవసరమైన సమయానికి అతడు ఏనాడూ అందుబాటులో ఉండడు. ఇవాళ అంతర జీవితంలో చాలా ముఖ్యమైన రోజు. కింశుక్ వున్నట్లయితే ఎంత సౌకర్యంగా ఉండేది! కానీ ఆయన ఈ దేశం వదిలి ఉన్నట్టుండి ఏడేడు సముద్రాలకు అవతలి తీరంలో, మ్యాన్‌హట్టనో వాషింగ్‌టనో.. ఎక్కడో ఓ చోట ఉండిపోయాడు. ప్రపంచంలోని హృద్రోగులకు అతడు మేలైన చికిత్స అందిస్తున్నాడు. డాక్టర్ కింశుక్‌కు పిలుపు వస్తే చాలు అప్పటికప్పుడు అన్నీ వదిలేసి రోగుల దగ్గరికి పరుగుతీస్తాడు. ఇంతటి పేరు ప్రఖ్యాతులు వున్న ఒక కార్డియాక్ సర్జన్ విదేశాల్లో ఉండిపోయినప్పుడు అతను ఇక్కడికి ఎలా రాగలడు? ఇండియాకు రావడం లేదుగానీ ఇంగ్లండు, అమెరికా వంటి దేశాల్ని ఏడాదికి కనీసం పద్నాలుగు సార్లు చుట్టివస్తున్నాడు. అటువంటి బిజీ షెడ్యూల్‌లో అంతరను విదేశానికి తీసికెళ్ళలేకపోయాడు. పెళ్ళి అవగానే ఇంగ్లండుకు వెళ్ళిపోయాడు. అంతర అదృష్టం బాగుంది. అప్పటికి ఆమె అమ్మా నాన్న, అందరూ వున్నారు కనుక పుట్టింట్లోనే వుండిపోయింది. ఇంగ్లండులోని హాస్పిటల్ కాంట్రాక్టు ముగియడంతోనే కింశుక్ ఓమారు ఇండియా వచ్చి మళ్లీ ఒక్కడే వెళ్ళిపోయాడు.

నుదుటిరాత! లలాట లిఖితం!! అంతా అంతర నొసటి రాత!!! ఎన్ని మంచి మంచి పెళ్ళి సంబంధాలు వచ్చాయి! అన్నింటినీ వదులుకొని ఈ కింశుక్‌తో పెళ్ళి.. నిజం! కింశుక్‌ది అందమైన ముఖం. చిన్న వయస్సులోనే పెద్ద పేరు ప్రఖ్యాతులు! ఇవన్నీ చూసి అంతర అమ్మానాన్నలు పెళ్ళికి ఒప్పుకున్నారు. అంతర కూడా ఈ దిక్కుమాలిన దేశం వదిలి కింశుక్‌తో అమెరికా వెళ్ళిపోవచ్చునని అంతరాంతరాల్లో ఎంతో సంతోషపడింది. కానీ జరిగిందేంటి? కింశుక్ గురించి ముందే తెలిసినట్లయితే ఈ పెళ్ళికి ఒప్పుకునేదే కాదు.

ఇవాల్టి ఈ డిన్నర్‌ను ఏర్పాటు చేయడానికి అంతర ఎంత కష్టపడాల్సి వచ్చిందో ఆమెకే తెలుసు. ఏ కాస్త పొరపాటు జరిగినా ఆమె శ్రమ అంతా బూడిదలో పోసిన పన్నీరు అవుతుంది. కింశుక్ వుంటే వైన్ వంటి మద్యం విషయాలు బాగా మేనేజ్ చేసేవాడు. అటువంటివి ఆయనకు చక్కగా తెలుసు. ఇన్నేళ్ళుగా విదేశాల్లో ఉండీ ఉండి కింశుక్ వీటి గురించి బాగా తెలుసుకున్నాడు. ఏ మద్యంతో ఏ తిండి తీసుకోవచ్చుననే విషయంలో అంతర అప్పుడప్పుడూ తప్పులు చేస్తుంది. చేపలతోపాటు వైట్ లేదా రెడ్, మాంసంతో సహా డ్రై లేక స్వీట్.. ఇటువంటివి అంతరకు అవగతం కాలేదు. ఎట్లా అర్థమవుతాయి? పెళ్ళికి ముందు అంతరకు ఇటువంటివి ఏవీ తెలియదు. కింశుక్ వల్లనే ఆమెకు ఈ సమాజంలో గుర్తింపు. కింశుక్‌కి, తనకు మధ్య ఎన్ని గొడవలున్నా అతని వల్లే తనకు గౌరవం

లభిస్తోంది.

అంతర చదివిన స్కూల్ పేరుకు మాత్రమే ఇంగ్లీషు మాధ్యమంతో ఉన్నది. ఫలితంగా గడగడా ఇంగ్లీషులో మాట్లాడగ లదు. కానీ చాలా తప్పులు దొర్లుతాయి. ఆ స్కూల్లో అంతకన్నా ఎక్కువ నేర్చుకోలే కపోయింది. కాలేజీలో చేరి ఎలాగో గ్రాడ్యుయేట్ అయ్యింది. నిజం చెప్పా లంటే ఆమెకు ఈ చదువు సంధ్యల్లో పెద్దగా ఆసక్తి లేదు. ఆమె అసలు లక్ష్యం ఏంటంటే తగిన భర్తను చూసుకోవడం. కళ్ళు జిగేల్‌మనిపించే గొప్ప రూపాన్ని ఇచ్చాడు దేవుడు. కింశుక్ ఈ అందాన్ని చూసే పడిపోయాడు. పెళ్ళి తర్వాత తనను ఒక మంచి కోచింగ్ సెంటర్లో జాయిన్ చేయవలసిందిగా కింశుక్‌ను ఎన్నో మార్లు అడిగింది. అతడు చిరున వ్వుతో ఆ కోరికను కొట్టేశాడు. ఎక్కువగా ఆరడి పెడితే కోపానికొస్తాడు.

ఇవాల్టి డిన్నర్‌కి రేణు బెంగాలి మెనూ అనగానే ఆనందించింది. ఫ్లోరా సైతం లోకల్ ఫుడ్ తినాలని అనుకుంది. ఇవాళ అందరి లక్ష్యమూ, గురి ఫ్లోరా పైనే!

మరి ఈ ఫ్లోరా ఎవరు? ఈమెను సం తోషింపజేయాలనే తలంపు అంతరకు ఎం దుకొచ్చింది? ఇవన్నీ తెల్సుకోవాలనుకుంటే ఇవాల్టి డిన్నర్ ఏర్పాట్ల నేపథ్యానికి సంబం ధించిన చరిత్ర తెలియడం తప్పనిసరి.

వుమెన్ ఫర్ ఎక్సలెన్స్ పొడి అక్షరాలను వుయ్ (డబ్ల్యు.ఈ) పేరుతో ఒక అమెరి కన్ సంస్థ ఉంది. ఆ సంస్థవాళ్ళు ప్రత్యే కించి తృతీయ ప్రపంచ దేశాల్లోని స్త్రీల ఆర్థిక వున్నతి కోసం పని చేస్తారు. రకర కాలైన వాళ్ళ పనుల్లో నిస్సహాయులైన ఆడ వాళ్ళ కోసం పనిచేయడం కూడా ఒకటి. స్త్రీలను గ్రూపులుగా చేయడం, వాళ్ళకు ఆర్థిక సహాయం అందించడం, వాళ్ళు తయారుచేసిన వస్తువుల్ని అమ్మడం.. ఫ్లోరా ఈ సంస్థ తరపున ఇండియాకు వచ్చి మూణ్ణాలుగు నెలలు అవుతోంది. ఢిల్లీ, జంషెడ్‌పూర్, కచ్ ప్రాంతాలు తిరిగి తన పర్యటనలో చివరి తలంకంగా ఇప్పుడు కలకత్తాకు వచ్చింది.

ఇక ఇక్కడే రేణు రంగప్రవేశం చేసింది. 'సహేలీ' పేరుతో ఆమెకి ఒక ఎన్జీఓ ఉం ది. పేరుకే ఎన్జీఓ, నిజానికి బిజినెస్. తల్లి దండ్రులు లేని, భర్తలు వదిలేసిన అస హాయ స్త్రీలతో ఎంబ్రాయిడరి చేయించి త యారైన వస్తువులతో ఆమె ఒక హ్యాండి క్రాఫ్ట్ ఎక్స్‌పోర్టు వ్యాపారం చేస్తోంది, ఈ వ్యాపారాన్ని అభివృద్ధి చేయాలన్నది ఆమె ఆలోచన. పుణ్యమూ, పురుషార్థమూ అన్నట్లు అటు సమాజ సేవా చేయవచ్చు, ఇటు వ్యాపారమూ జరుగుతుంది.

హెడ్ ఆఫీస్ కాకుండా రేణువి కలక త్తాలో మరో మూడు యూనిట్లు బ్రహ్మాం డంగా నడుస్తున్నాయి. కలకత్తాకు బయట కూడా మరిన్ని యూనిట్లు నెలకొల్పితే ఎందరో స్త్రీలకు ఉపాధి దొరుకుతుంది. ఆమెకు పేరూ వస్తుంది. ముఖ్యంగా బ్యాంక్ బ్యాలెన్సు దినదిన ప్రవర్థమానం అవుతుంది. ఫ్లోరాను ప్రభావితం చేయ ల్గితే ఒకింత బల్క్ ఆర్డర్ సంపాదించ వచ్చు. ముఖ్యంగా కొంత గ్రాంటు లేదా స్పాన్సర్‌షిప్ పొందవచ్చు.

ఈ భగీరథ ప్రయత్నంలో ఒక భాగమే ఇవాళ అంతర ఇంట్లో డిన్నర్ ఏర్పాటు చేయడం. అంతర కలకత్తాలోని బాలే గంజ్ యూనిట్ చూస్తోంది. పూజ సాల్ట్ లేక్ వ్యవహారాలు చూస్తోంది. ఆమలతా యూనిట్ నిర్వహణ స్వయంగా రేణు పెద్ద కోడలు దేవిక చేతిలో ఉంది. ఎంత కాదన్నా ఇవాళ అతిథుల సంఖ్య పది దాకా వుంటుంది. ఇవాల్టి వ్యవహారం సజావుగా సాగితే ఒక్క దెబ్బతో అనేక పక్షుల్ని కొట్టవచ్చు. రేణుకి కుడిభుజం కావడానికి పూజ ఎన్నాళ్ళనుంచో ప్రయత్నం చేస్తున్నది. ఆ ప్రయత్నాన్ని



సమూలంగా నాశనం చేయవచ్చు. తనే రెండో నంబర్‌కి ఎదిగి బాలేగంజ్ యూనిట్‌కి ఎన్నెన్నో ఆర్డర్లు చేజిక్కించుకోవచ్చును. దేవిక చేతిలో వున్న ఆమలతా యూనిట్‌ను కూడా లాగిపారేసి తనకే అప్పగించవచ్చు. ఏమైనా జరగొచ్చు. చెప్పలేం కదా! ఫ్లోరాకి డిన్నర్ యిచ్చే ప్రసక్తి వచ్చినప్పుడు అందరికన్నా ముందే అంతర "ఫైవ్‌స్టార్‌లోనైతే ఎప్పటిలాగే రెగ్యులర్ మెనూ వుంటుంది మేడమ్! కాస్త హోమ్‌లీ టచ్ వుంటే బావుంటుంది అని నా భావన" అంది.

## కొత్తగాలి...

**అవసరాలకన్నీ అందిస్తున్న ప్రకృతి భేషజాలకు పోదు!**
**అన్నీ అనుభవిస్తున్న మనిషి మాత్రం ఎగిరెగిరి పడతాడు!**

– పి.వి. సుబ్బారాయుడు,
సైనిక్‌పురి, సికింద్రాబాద్

రేణు సైతం ఆ మాటల్ని కాదనలేకపోవడంతో అంతర మరింత ఉత్సాహంతో 'ఎస్ మేడమ్! ఎకాయెకి హోమ్‌లీ అంటే ఇన్ఫార్మల్ గ్యాదరింగ్, లోకల్ ఫ్లేవర్ ఉంటుంది. అందరమూ హాయిగా పిచ్చాపాటీ పెట్టుకోవచ్చు. మీరు ఫ్లోరాను ఒప్పించగలిగితే బాధ్యత అంతా నాదే మేడమ్' అంది. అంతర ఒక కంట పూజను కనిపెడుతూనే ఉంది. ఆమె ముఖం వెలవెలపోవడమూ గమనించింది.

"ఐడియా చాలా బాగుంది. ఓ సారి ఆమెతో కదిపి చూస్తాను" అంది రేణు.

రొట్టె విరిగి నేతిలో పట్టట్లు అయ్యింది అంతరకు. కారణం ఫ్లోరా కూడా డిన్నర్ అనేది అథెంటిక్ బెంగాలీలా ఉండాలని కోరుకుంది.

"ఇన్నాళ్ళ నుండీ ఇండియాలో వున్నా. నార్త్ ఇండియన్ ఫుడ్ తిన్నా, గుజరాతీ ఫుడ్ తిన్నా. ఈసారి బెంగాలీ రుచిని ఆస్వాదించాలని అనుకుంటున్నా. స్పైస్ ఇండియన్ ఫుడ్ మరీఇష్టం" అంది ఫ్లోరా.

ఆమె కోరికను విని అంతర లోపల్లోపల ఎంతో సంతోషించింది. ఆ సంతోషాన్ని బయటకు కన్పించకుండా కప్పిపుచ్చింది. ఇంట్లో కుక్ శోభాది ఎలాగూ వుంది. ఆమె అద్భుతమైన వంటలు చేస్తుంది.

"సబ్ ఘర్ మే తయారీ! కుక్‌డ్ ఫ్రమ్ స్క్రాచ్. కుక్‌డ్ ఎట్ హోమ్" అంది అంతర.

మూడు రోజులుగా అంతర ఇంట్లో ఈ ఏర్పాట్ల పర్వమే కొనసాగుతున్నది. నిమిష నిమిషానికి వంటమనిషి శోభాదీనీ, పనిమనిషి ఛాయనీ ఇంటి యజమానురాలి హోదాలో పనులకు పురమాయిస్తున్నది.

ఇంటిలో కొత్తగా ఏదీ చేయవలసిన అవసరం లేదు. అదృష్టవశాత్తూ గత మాసంలోనే ఇంటికి రంగులు వేశారు. ఇపుడు కొత్తగా కర్టెన్లు కొనేంత సమయం లేదు. సరిగ్గా ఒక వారం క్రితమే కర్టెన్లు డ్రై వాష్ చేయించారు. అవి బాగానే వున్నాయి. చక్కగా తోమిన ఇత్తడి పాత్రలు తళతళా మెరుస్తున్నాయి. రెండు రోజులుగా అంతర స్వయంగా నించుని పనిమనిషి ఛాయతో డైనింగ్ టేబుల్ తుడిపిస్తున్నది. ఇంట్లో బూజు దులిపిస్తున్నది. ఎక్కడా దుమ్మూధూళీ లేకుండా శుభ్రం చేయిస్తున్నది. నీళ్ళలో కిరోసిన్ కలిపి ఇతర టేబుళ్ళను తుడిపిస్తున్నది. అన్నీ అద్దంలా మెరుస్తున్నాయిపుడు.

ఇంతవరకూ ఏర్పాట్లన్నీ సవ్యంగానే వున్నాయి. కానీ అంతరకు వున్న అసలు సమస్య మరొకటి.. లోపలి వరండాకు అవతలి వైపు గది దిక్కు చూపు పడితే చాలు ఆమె అందమైన పల్చని నుదుటి మీద తెలియకుండానే ముడుతలు పడతాయి. వెగటు కల్గుతుంది. ఆ గదిలో అత్తగారు వుంటుంది. మళ్లీ కింశుక్ మీద కోపంతో అంతర మండిపోతున్నది.

చాలాకాలం అత్తయ్య బావగారి దగ్గరే వుండేది. చిన్న కొడుకైన కింశుక్‌కు హఠాత్తుగా విధి నిర్వహణ గుర్తుకొచ్చింది. తన వంతు పాత్ర స్ఫురణకు వచ్చింది. "వద్దు వద్దు! ఇన్నాళ్ళు అమ్మను అన్నయ్య పోషించాడు. అప్పుడు నేను ఏమీ చేయలేకపోయాను. ఇప్పుడు మా క్కూడా మంచి ఇల్లు వుంది. ఇప్పట్నించి అమ్మ మా దగ్గరే వుంటుంది" అనేశాడు కింశుక్.

ఆయనకేం మహారాజు, రిస్క్ అంతా అంతరదే!

కింశుక్ అలా అన్నాడో లేదో వాళ్ళ అన్నయ్య ఇలా ఒప్పేసుకున్నాడు. అతను తన భారం దింపుకోవాలని అనుకున్నాడు. ఇంక తోటికోడలు బావగారి కన్నా ఒక ఆకు ఎక్కువే చదువుకుంది. ఎప్పుడు చూసినా తియతీయని మాటలు, ఎల్లవేళలా చిరుదరహాసాలు, నిజానికి రిమోట్ కంట్రోల్ ఉంది తోటికోడలు చేతిలోనే! ఇవన్నీ అంతరకు బాగా తెలుసు.

జంషెడ్‌పూర్లోని తమ బావగారి ఇంటి నుండి అత్తయ్యను తీసుకురావడానికి కింశుక్‌తో పాటు అంతర కూడా వెళ్ళింది. బావగారువాళ్ళు ఎంత గొప్పగా నటించారో! ప్రాణప్రదమైన అత్తగారికి వీడ్కోలు పల్కుతున్నప్పుడు ఏడుపు ముఖాలు... సజల నేత్రాలు.. నటన చూస్తే అరికాలి మంట నెత్తికెక్కింది. అయినా అంతర ఏం చేయగలదు?

అంతర తాలూకు పండంటి కాపురంలో అత్తయ్య ఒక అపశ్రుతి! అంతర అత్తగారిని పెద్దగా గౌరవించదు. పాపం ఆ ముసలావిడ కోడలు విషయంలో అసలే జోక్యం చేసుకోదు, ఎప్పుడూ చేతిలో కుట్లూ అల్లికలకు సంబంధించిన వస్తువులే! పిల్లో కవర్లకు పోతలు పోయడం టేబుల్ క్లాతులపై అల్లికలు అల్లడం..! అత్తగారు ఏం కుడుతున్నదో అంతరకు అవసరమేలేదు.

ఆ ముసలావిడను అంతర సరిగా అర్థం చేసుకోలేదు. మామగారు ఉన్నతమైన ఉద్యోగం చేసేవాడని విన్నది. ఉద్యోగ ధర్మంతో మొత్తం భారతదేశమంతా తిరిగారు. అతగాడు మోస్ట్ అన్‌స్మార్టుగా వుండేవాడు. టిపికల్ బెంగాలీ వంటి హావభావాలు. ఇక అత్తగారేమో బెంగాలీ పుస్తకాలతో, పత్రికలతో కాలయాపన చేసేది. ఇప్పుడైతే కుట్లూ అల్లికలూ. అత్తగారు బెంగాలీ భాష తప్ప మరొకటి ఎప్పుడూ మాట్లాడ్డం అంతర చూసి వుండలేదు. కింశుక్‌కి మధ్యతరగతి మనస్తత్వం ఎలా వచ్చిందో అత్తగారిని చూసాకే తెలిసి వచ్చింది. మరి ఇవాళ అత్తగారిని ఎక్కడ వుంచాలనేది అంతర అసలు సమస్య. నాగర్‌బజార్లో వున్న పెద్దత్తయ్య దగ్గరికి పంపించాలని అనుకుంది. రేపు పొద్దునే అంతెందుకు ఈ సాయంత్రమే కారులో పంపించాలనుకుని మళ్ళీ వద్దనుకుంది. అలా పంపడం తనకే రిస్క్ అనుకున్నది. ఈ మధ్య పెద్దత్తయ్య ఇటువైపు రావడమే లేదు. అలా రాకపోవడమే హాయిగా వుంది. ఇప్పుడు అత్తగారిని పంపిస్తే మళ్ళీ రాకపోకలు మొదలవుతాయి. పైగా అక్కడికి పంపిస్తే అత్తగారు వాళ్ళ అక్కగారికి తన గురించి వున్నవీ లేనివీ కల్పించి చెబు

బెంగాలీ మూలం :

**అదితి సర్కార్**

---

అనువాదం :

**డా. నలిమెల భాస్కర్**

తుంది. ఇది తనకు నష్టం కల్గించే చర్య. ఇక్కడే వుండనీ అనుకుంది అంతర. ఈ వ్యవహారం గాలికి పోయే కంపను కాలికి తగిలించుకున్నట్లు వుంటుంది కదా!

అత్తగారి పేరు ప్రతిమ. ఆమె తన గది నుంచే జరుగుతున్న ఏర్పాట్లను కొంత తెల్సుకోగల్గింది. వివరాల కోసం పనిమనిషి ఛాయను అడుగుదామని అనుకుంది. కానీ పనిమనిషిని ప్రశ్నించి తెల్సుకోవడం ఆత్మగౌరవానికి హాని అని భావించి మానేసింది. తన కొడుకు ఉంటే పరిస్థితి యిలా వుండేది కాదు. అన్నీ వాణ్ణి అడిగి తెల్సుకునేది. ఇప్పుడతను విదేశాల్లో వున్నాడు,



చిన్న కోడలికి తనంటే గౌరవం లేదని ప్రతిమకు తెలుసు. కోడలిని తప్పు పట్టడం లేదు ప్రతిమ. పెళ్ళి అయినప్పటి నుంచి అంతర తనదైన యింటిలో తనదైన రీతిలో సంసారం చేస్తున్నది. ఇన్నేళ్ళ తర్వాత హఠాత్తుగా అత్తగారి భారం పడడంతో ఆమెకు మరోలా వుంది.

పెద్దకొడుకు దగ్గర ప్రతిమ చాలా చక్కగానే వుండేది. కింశుక్ అక్కణ్ణుంచి ఇక్కడికి ఎందుకు తీసుకొచ్చినట్లు? అక్కడ వున్నట్లయితే ఇంత ఉదాసీనంగా వుండవలసి వచ్చేది కాదు. పెద్ద కోడలిది నవ్వు మొహం. ఆమె ఓ బాలికల పాఠశాలలో గణితోపాధ్యాయినిగా పనిచేస్తున్నది. లెక్కలు నేర్చుకోవడానికి కొంతమంది పిల్లలు ఇంటికి కూడా వచ్చేవాళ్ళు. ఆ పిల్లల అల్లరితో పరిసరాలు ఆహ్లాదకరంగా ఉండేవి. ప్రతిమను వాళ్ళంతా నానమ్మ, అమ్మమ్మ అంటూ పిలిచేవాళ్ళు. ఒకే ఒక్క మనుమరాలు. కానీ ఆ పిల్ల వందమందితో సమానం. వాళ్ళందరి సమక్షంలో సమయం హాయిగా గడిచేది. పెద్ద కోడలి ఫ్రెండ్స్ కూడా చక్కగా మాట్లాడేవాళ్ళు. ఇరుగుపొరుగు వాళ్ళతోనూ మంచి సంబంధాలుండేవి. ఇక్కడన్నీ పెద్ద పెద్ద

వ్యవహారాలు. ఈ ఇంటికి ఒక్క పురుగూ రాదు. అంతర స్నేహ సంబంధాలన్నీ క్లబ్బులూ, రెస్టారెంట్ల లోనే! పాపం! ప్రతిమ ఇంక ఎవరితో మాట్లాడుతుంది? ఒకవేళ మాట్లా డినా ఆచితూచి మాట్లాడాలి. అంత కన్నా గమ్మున వుండిపోవడమే మేలు. అంతర వాళ్ళకు కూడా ఓ అబ్బాయి వున్నాడు. కానీ ఆ పిల్లవాణ్ణి చిన్నతనం లోనే ఓ సుదూర ప్రాంతంలోని హాస్ట ల్‌లో వేశారు. ఇలా చిన్నపిల్లల్ని బాల్యం లోనే తల్లిదండ్రులకు దూరంగా వుంచడం ప్రతిమకు నచ్చదు.

ఇప్పటినుంచే క్రమశిక్షణ, సంస్కారం నేర్పించనట్లయితే తర్వాత సాధ్యం కాదని అంతర అభిప్రాయం. కింశుక్ ఇలాంటి



విషయాల్లో అసలే తలదూర్చడు. కుటుంబ బాధ్యతలన్నీ అంతరకు అప్పగించి హాయిగా విదేశాల్లో వుంటున్నాడు. చాలా బాగుంది ఈ వ్యవహారం. తల్లిదండ్రుల వద్ద క్రమశిక్షణ నేర్చుకోలేరా పిల్లలు? విద్యావంతులైన ఆధునిక యుగంలోని తల్లిదండ్రులు కన్నపిల్లలకు సంస్కారం నేర్పించకపోవడం ఏంటి? ఏం ప్రపంచం యిది? ఏకైక సంతానం! పిల్లాడికి విద్యా బుద్ధులు గరపాలని అంత దూరంలో వుంచడమా? ఇట్లా ఆలోచించసాగింది ప్రతిమ. అయినా ఆ ముసలావిడ నోరు విప్పదు. సాధ్యమైనంతవరకు తన గది లోనే వుండిపోతుంది. ఈ పరిస్థితికి ఎవ రిని మాత్రం నిందించగల్గుతుంది? అంతా తన తలరాత! తన భర్త చనిపోయిన ప్పుడు పెద్దబ్బాయి శౌభిక్ ఇంజనీరింగ్ ఫైనల్‌లో వున్నాడు. చిన్నవాడు కింశుక్ డాక్టర్ అయ్యి బయటకు రావడానికి ఇంకా రెండున్నర ఏళ్ళు పడుతుంది. భర్తకు ఎప్పుడూ బదిలీలు జరిగేవి. జీవితమంతా దేశంలోని పలుప్రాంతాల్లో పనిచేయాల్సి వచ్చింది. చివరికి కలకత్తాకు వచ్చారు. ఈ తిరుగుళ్ళ కారణంగా భర్త మహీతోష్ పెద్దబ్బాయిని హాస్టల్లో వేద్దామన్నాడు, అలా వేయడం వల్ల ఆ అబ్బాయి చదు వుకు ఏ ఆటంకమూ రాదు. ఆ విష యాన్ని ప్రతిమతో కదిపి చూశాడు. ఆమె ఒప్పుకోలేదు, మహీతోష్ మరీ బలవంతపె ట్టలేదు. ప్రతిమ నిరక్షరాస్యురాలు కాదు. పెళ్ళి నాటికి ఆమె బి.ఏ. మొదటి సంవ త్సరంలో వుంది. తర్వాత అది పూర్తి చేయలేకపోయింది. వాళ్ళ పిల్లలిద్దరూ తల్లిదండ్రులతో పాటు ఒక నగరం నుండి



ఆత్మవిశ్వాసంగలవాడే
బలవంతుడు
సందేహాలతో సతమతమయ్యేవాడు
బలహీనుడు

– ఫ్రీమాన్ క్లార్క్

అ
క్ష
రం

మరో నగరానికీ, ఒక స్కూలు నుండి మరో స్కూలుకూ మారవవలసి వచ్చింది. ఏడు, ఎనిమిది తరగతుల వరకు గణితం తప్ప మిగిలిన సబ్జెక్టులన్నీ ప్రతిమే చదివించింది. మహీతోష్‌కు వీలు చిక్కినప్పుడల్లా పిల్లలతో పాటు తనూ కూర్చునేవాడు, అయినా ఆయనకు సమయం తక్కువ. నిజానికి పిల్లలకు మొ దటి గురువు మాతృమూర్తి అనేది వాస్త వం. పిల్లలిద్దరూ తమతమ పాఠశాల వి ద్యాభ్యాసం ముగించుకున్నాక వాళ్ళను హా స్టల్లో వేశారు. పెద్దవాడు ఐఐటి ఖరగ్‌పూ ర్ వెళ్ళాడు. చిన్నవాడు ఎయిమ్స్ ఢిల్లీ వెళ్ళాడు. పిల్లలిద్దరూ చదువుల్లో చురుకైన వాళ్లని ప్రత్యేకించి చెప్పాల్సిన పనేలేదు.

కలకత్తాకు బదిలీ అయ్యి వచ్చినప్పుడు ప్రతిమ, మహీతోష్ ఇద్దరే వున్నారు. అంతటా వున్నట్లుగానే ఇక్కడ కూడా అద్దె యింట్లోనే వున్నారు. వీలు చిక్కినప్పుడు ఓ చిన్నపాటి యిల్లు కొనుక్కోవాలని అనుకున్నారు. కానిపక్షంలో స్థలం కొని ఇల్లయినా కట్టుకోవాలన్నది వాళ్ళ ఆలోచన. కానీ రిటైర్ అయిన రెండు నెలల తరువాత హఠాత్తుగా ఓ రోజు మహితోష్ ఈ లోకం నుండి వెళ్ళిపోయాడు! ఆ రోజు కూడా ఎప్పటిలాగే భోజనం చేసి పడుకోవడానికి వెళ్ళిన అతను తెల్లవారి మళ్ళీ లేవలేదు. ఫలితంగా సొంత ఇల్లు కలగానే మిగిలింది. దాంతో ప్రతిమ తన వృద్ధాప్యంలో ఇలా పెద్దబ్బాయి ఇంటికీ, చిన్నవాడి యింటికీ తిరగవలసి వస్తోంది.

నిజమే! అందరూ ప్రతిమను బాగానే చూస్తారు. కానీ అంతకన్నా ఇది కూడా వాస్తవమే!! అందరికీ వాళ్ళవాళ్ళ ప్రపంచాలు వున్నాయి. పనిలేని ముసలి మనిషికి సొంత ప్రపంచం ఎక్కడిది? 'బాగున్నారా? అక్కడే వుండండి!' ఇంతవరకే పలకరింపులు. మరీ ఎక్కువ అంటే 'షుగర్, బి.పి. ఏమైనా వచ్చాయా? సమయానికి మందులు వేసుకోండి! అవసరం పడితే మన లోకాల్టీలో వున్న డాక్టర్‌కు చూపిద్దాం, తగ్గకుండా వుంటే నర్సింగ్‌హోమ్‌కు వెళ్దాం, ఇంకా ఏం కావాలి?' వంటి సంభాషణలే జరుగుతాయి. 'కాస్త దగ్గరికొచ్చి పక్కన కూర్చోండి, హాయిగా మాట్లాడండి' వంటి సల్లాపాలుగానీ, ఆలాపాలుగానీ ప్రతిమ జీవితంలో అసలే లేవు. 'మేం బిజీగా వుంటాం, మాకు ఏ మాత్రం సమయం లేదు మీతో ముచ్చటించడానికి' అని ముఖమ్మీదే అనేస్తుంది అంతర.

ప్రతిమ అసలు సమస్య కాలక్షేపం లేకపోవడం. ఆమెకు పుష్కలమైన సమయం వుంది. మరి పొద్దుపుచ్చడం ఎలా? ఆమె గదిలో ఓ టీవీ వుంది. కానీ దాన్ని ఎన్ని గంటలు చూడగల్గుతుంది? నిజానికి ఆ యంత్రంలో ఏ దృశ్యాలైతే చూపిస్తున్నారో వాటిని చూడకపోవడమే హాయి. రాజకీయ నాయకుల వాదోపవాదాలు, యువతీయువకుల ప్రేమ ముసుగులో భౌతిక ఆకర్షణలు, ఇంకా అక్రమసంబంధాలు, భార్య తన భర్తను వదలి మరో వ్యక్తితో వెళ్ళిపోవడాలు.. ఇవీ నిత్యం టీవీలో కన్పించేవి. ఇది వినోద సాధనమా? కాస్త మంచిని చూపిద్దామనే ఆలోచనే లేదు

టీవీ వాళ్ళకి. ఈ అశ్లీలాన్ని ఆరోగ్యవంతులు ఎంతవరకు భరిస్తారు? ఇక టీవీల్లో వచ్చే సీరియల్స్ అనే వింత ఎపిసోడ్స్‌ను ఎందాక సహిస్తారు? ప్రతిమ రాత్రి పడుకునేముందు వచ్చే వార్తలు వింటుంది, అంతే! మరి కాలక్షేపం ఎలా? ఇంటికి ఓ బెంగాలీ వార్తపత్రిక వస్తుంది. అది వార్తలకు బదులు ఎడ్వర్‌టైజ్‌మెంట్లని మోసుకొస్తుంది. ఆ పత్రికను అటు తిప్పి, ఇటు తిప్పీ కొంతసేపు చదువుతుంది. ఇప్పటికీ ఆమెను ఆరోగ్యంగా వుంచిందీ, కాలక్షేపం చేస్తున్నదీ కుట్లూ అల్లికలూ అనే అలవాటు మాత్రమే! దేవుడి దయవల్ల ప్రతిమ కళ్ళు బాగానే వున్నాయి. ఈ అలవాటు లేకపోతే ముద్దలింగంలాగా ఓ చోట పడివుండవలసి వచ్చేది. ఇప్పుడూ చేతినిండా కుట్ల పని వుంది. అందువల్లే హాయిగా పొద్దుగడుస్తూ వుంది. ప్రతిమ తన పెద్దకోడలు శ్రీవర్ణ యింటిలో వుండగా టస్సర్ పట్టు మీద అద్భుతమైన పోతలు పోసి యిచ్చింది. నిజానికి ఆమె మనస్సులో వున్నది ఏంటంటే కోడళ్ళు యిద్దరికీ యిటువంటి పోత చీరలు ఇవ్వాలనే! కానీ అంతర మనస్తత్వాన్ని అంతో ఇంతో అవగతం చేసుకున్న ప్రతిమ అటువంటి సాహసం చేయలేకపోయింది. ఆమెకు ఇప్పుడనిపిస్తున్నది ఏంటంటే ఆ పని చేయకపోవడమే మంచిదైంది అని. పెద్ద కోడలికి పోత పోసి యిచ్చిన చీరను చూసి ఆమె కొలీగ్ బయాలజీ టీచర్ నందిత ఆశ్చర్యపోయింది. తనకూ అలాంటిది కావాలని ప్రాధేయపడింది.

"ఆంటీజీ! మీరు ఎంతైనా సమయం తీసుకోండి!! నాకు అచ్చం అలాగే వుండాలి. తొందరేం లేదు" అంది నందిత.

ప్రతిమ ఇదీ తన అదృష్టమే అనుకుంది, లేకపోతే రోజంతా ఒక్కతే కూచుని కూచుని ఆమెకు విసుగెత్తిపోతుంది.

ఇక్కడ అంటే కలకత్తాలో నాగర్ బజార్లో ప్రతిమకు తన మామగారి చెల్లెలు అరుణ వుంటుంది. ఆమె అప్పుడప్పుడు ప్రతిమను చూడ్డానికి వచ్చేది, బాతాఖానీ పెట్టేది. అట్లా కొంత సమయం గడిచేది. ఈ మధ్య ఎందువల్లో ఆమె కూడా ఇటు రావడం లేదు. ప్రతిమ ఆమె రాకపోవడానికి కారణం ఏంటని అడగలేదు. అరుణ కూడా ముసలిదయ్యింది కనుక రాలేకపోతున్నదని ప్రతిమ అర్థం చేసుకోగల్గింది. అప్పుడప్పుడు ఫోన్లోనే మాట్లాడుతున్నది.

ఆ రోజు పొద్దునే తన గదిలోని కిటికీ దగ్గర కూర్చుని ప్రతిమ ఈ విషయాలన్నింటినీ నెమరువేసుకుంటున్నది. చాలాసేపు ఏదో కుట్టింది. కళ్ళు కొద్దిగా మండుతున్నాయి. బయటి నుండి వెల్తురు కూడా తక్కువ వస్తున్నది. చూడ్డం కష్టంగానే వుంది. తనున్న చోటునుండి లేవడానికి యత్నించింది. బద్ధకంతో లేవలేకపోయింది. ఇంతసేపూ కాళ్ళు ముడుచుకుని వుండడం వల్ల పాదాలు మొరాయిస్తున్నాయి. ఎలాగోలాగా కాళ్ళు చాచి కుట్టు పని ఆపి బయటకు చూస్తూ కూర్చుంది. మనస్సు ఎక్కడికి వెళ్ళిపోయిందో ఆమెకు తెలియడం లేదు. హఠాత్తుగా గది తలుపుల దగ్గర అంతర గొంతు విన్పించింది. ప్రతిమ ఉలిక్కిపడింది. ఆ ఉలికిపాటు అసహజం ఏమీ కాదు. ప్రతిమను ఈ గదిలోకి తీసుకొచ్చిన తర్వాత అంతర అలా అత్తగారి గదికి.. రావడం వేళ్ళమీద లెక్కించవచ్చు. ప్రతిమ తన కళ్ళద్దాలను తీసుకుని పెట్టుకుంది. బహుశ అంతర అత్తగారిని ఏమో ప్రశ్నించినట్లున్నది.

"అంతరా! ఏమైనా అడిగావా?" అంది ప్రతిమ.

అంతర తన గొంతులో వున్న విసుగును కప్పిపుచ్చాలని ప్రయత్నించలేదు. "ఇవాళ రాత్రికి యింట్లో పార్టీ వుందని తెలుసు కదా?" అంది అంతర.

పార్టీ విషయం ప్రతిమకు వివరంగా తెలీదు. ఉందేమోనని కొంత వూహించింది, అంతే! అంతర ప్రతిమను ఏనాడూ 'అత్తయ్యా' అని పిలవని విషయం ఆ ముసలావిడకు బాగా తెలుసు. ఏ రకమైన సంబోధనా లేకుండా అంతర అకస్మాత్తుగా విషయం కదుపుతుంది.

"ఇవాళ మీకు భోజనం తొందరగా పెట్టమని వంటమనిషితో చెప్పాను. రాత్రికి వంటింట్లో కాకుండా గదిలోనే తినండి!" అని వూరుకుంది అంతర.

అంగీకార సూచకంగా ప్రతిమ తల పంకించింది.

ఆమెకు ఎక్కడైతే ఏంటి? ఎక్కడ పెడితే అక్కడే తింటుంది. శాకాహారమా, మాంసాహారమా? అన్న విషయం కూడా పట్టింపు లేదు. భర్త ఉన్నప్పుడు శాకాహారమే తీసుకుంటాను అని ప్రతిమ అంటే ఆయన ఒప్పుకోలేదు. ఆయన పోయాక ఒకటి రెండు సార్లు తన పిల్లల దగ్గర మాంసాహారం తినను అన్నప్పుడు వాళ్లా తల్లిని వ్యతిరేకించారు. తల్లి తినకపోతే తామూ మానేస్తాం అన్నారు. పిల్లలు మానేస్తే ఎలా? ఇంకా పెరగాల్సినవాళ్లు కదా! ఇప్పుడే మానేస్తే వాళ్ళ శరీరదారుఢ్యం ఏమవుతుంది? అందుకని ప్రతిమ పిల్లల కోసం తన కోరికను పక్కన పెట్టేసింది.

ఇవాళ వంటింట్లో ఎన్నో ఏర్పాట్లు జరుగుతున్నాయి. డైనింగ్ హాల్లోనూ ఏర్పాట్లే ఏర్పాట్లు! అటువంటప్పుడు ప్రతిమను తన పడగ్గదిలోనే తినమని అంతర ఆదేశించడంలో తప్పులేదు.

అంతర మళ్ళీ అందుకుంది "అచ్ఛా! ఎప్పుడు చూసినా రంగు వెలిసిన ఈ పాతచీరలే ఎందుకు కడుతున్నారు? మీకు మంచి చీరలు లేవా? చెప్పండి! మీ కొడుకు మీకు మంచి గుడ్డలు కొనివ్వడం లేదా? జనాలు చూసి ఏమనుకుంటారు? డాక్టర్ కింశుక్ తల్లిగుడ్డల విషయం అసలే పట్టించుకోడు అని అనుకోరా? ఛీఛీ!"

"ఇంట్లోనే వుంటున్నాను కదా రోజంతా. అందుకని.." అనబోయింది ప్రతిమ.

అత్తగారి మాటల్ని మధ్యలోనే తుంచి "ఇంట్లోనే వుంటున్నాను అంటే ఏంటి? మేం మిమ్మల్ని ఇంట్లో బంధించి వుంచామా? కారు ఉంది. డ్రైవర్ వున్నాడు. ఎక్కడికి వెళ్ళాలనుంటే అక్కడికి హాయిగా వెళ్ళండి! మీరు మీ గది నుండి బయటకు రారు, పైగా మమ్మల్ని తప్పు పడుతున్నారు. బావుంది వ్యవహారం" అంది అంతర కోపంతో.

"అలా అనలేదు తల్లీ.." ఇంకా ఏదో చెప్పబోతుండగానే ప్రతిమ మాటలకు అంతర అడ్డు తగిలి "మీరేం అనబోతున్నారో నాకు తెలుస్తూనే వుంది. నన్ను అంత అమాయకురాలిగా లెక్కించకండి! మాట్లాడితే చాలు ఏదో ఒక తప్పు వెతుకుతారు. ఇంట్లోనే వుండిపోతే పనిమనిషిలా వుంటారా? కాస్త మంచి చీరలు కట్టుకుంటే పోలా. ఆ చేతులకు కనీసం గాజులు.. మీకంటే సెన్సు లేదు. కానీ మీ కొడుక్కి సమాజంలో ఓ స్టేటస్ వుంది. జంషెడ్‌పూర్లో పెద్దకొడుకు దగ్గర వున్నట్లు ఇక్కడ వుంటే కుదరదు. అర్థమైందా? " అని గద్దించింది.

ప్రతిమ గమ్మున వుండిపోవడమే మేలనుకుంది. గాజుల విషయంలో ఏదో చెప్పాలనుకుంది. కానీ మానుకుంది. ఏం మాట్లాడినా మరోసారి దక్షయజ్ఞ విధ్వంసం జరిగిపోతుంది యింట్లో.

ప్రతిమ భర్త మహీతోష్ పొదుపరి కాదు. డబ్బును మంచినీళ్ళ ప్రాయంలా ఖర్చుచేసేవాడు. షోకులరాయుడు. ఉద్యోగం బాగానే చేసేవాడు. కానీ జీతంలో చాలా భాగం ఖర్చయిపోయేది. మంచి సంపాదనో, డిపాజిటో ఎప్పుడూ లేదు. అతను ఎవరికీ చెప్పా పెట్టకుండా వెళ్ళిపోయాక మొదటిసారి ప్రతిమ జీవి

సింహభాగం పిల్లల చదువులకే ఖర్చయి పోయింది. ఆ విషయంలో భార్యాభర్తల మధ్య ఏ రకమైన గొడవలూ లేవు. ఆ ఆలుమగల్లో పరస్పరం ఎవరికీ ఎటువంటి ఆరోపణలు లేవు. పిల్లల చదువులే ప్రధానం. పిల్లల సుఖమే తమ సుఖంగా భావించారు. మహీతోష్ ఆకస్మిక మరణం గురించి కలలోనైనా అనుకోలేదు. అందు



తంలో చీకట్లు అలముకున్నాయి. ఇద్దరు పిల్లల్లో ఏ ఒక్కరూ తనకాళ్ళమీద తాను నిలబడని దుస్థితి. సంపాదించిన దాంట్లో

కొత్తగాలి...

**అమ్మా! అన్న పిలుపే**
**అనురాగం!**
**నేడు ఆ పిలుపే**
**కడు దూరం!**

– పెయ్యాల శ్రీనివాసరావు,
అలికాం, శ్రీకాకుళం జిల్లా

కని పెద్దగా భవిష్యత్తు గురించి ఆలోచించలేకపోయారు. ఉన్నట్టుండి ప్రతిమ అగాథమైన సముద్రంలో పడిపోయింది.

మహీతోష్ పెన్షన్ వుంది నిజమే! కానీ అది ఏ ముక్కులోకి సరిపోతుంది? అది వుండడం వల్లనే ఇవాళ ప్రతిమకు ఎవరినీ యాచించవలసిన అవసరంలేదు. మందులూ మాకులూ వంటి ఖర్చులు వుండనే వుంటాయి. పెద్ద కొడుక్కి జంషెడ్‌పూర్లో క్వార్టర్ దొరకనప్పుడు, యింటి కిరాయి ప్రతిమే చెల్లించింది. ఆ కొడుకు దగ్గర ఏదీ అడిగేది కాదు.

"సాయంకాలవేళ కాస్త మంచి బట్టలు కట్టుకోండి! అర్థమైందా? ఇటువైపు కూడా పార్టీకి వచ్చినవాళ్ళు రావచ్చు. చెప్పలేం కదా!" పురమాయించి అంతర వెళ్ళిపోయింది. ఆమె చాలా బిజీగా వుంది.

సాయంత్రమైంది. పూజ హతాశురాలు అయినట్లు కన్పిస్తున్నది. అంతరకు సంతోషంగా వున్నది. పూజ ఇట్లా అంతర చేతిలో ఓడిపోతుందని కలలో కూడా అనుకోలేదు. లోకల్ బెంగాలీ డిన్నర్ అయితే బావుంటుందనే ఆలోచన అంతరకు ఎంత చక్కగా వచ్చింది. అంతర మనస్సులోనే దేవునికి ధన్యవాదాలు చెప్పుకుంది.

అవును.. ఇవాల్టి డిన్నర్ విజయవంతం అయ్యిందనే చెప్పాలి. ఫ్లోరా చాలా సంతోషంగా వుందని తెలుస్తూనే వుంది. పనిలో పనిగా రేణు కూడా సంతోషంగా వుంది. పైగా రేణుని ప్రసన్నం చేసుకుంటేనే కాగల కార్యం సుగమం అవుతుంది. వచ్చే నెల నుంచి వంటమనిషి శోభాదీకి జీతం పెంచవచ్చు. ఫ్లోరాకు అచ్చం బెంగాలీ ఆలూ పోస్త నచ్చినట్లుంది. మీగడ కలిపిన రొయ్యల కూరనూ ఆమె మెచ్చినట్లున్నది. ఫ్లోరా వంటి అమెరికన్ స్త్రీలు భోజనంలోని క్యాలరీల విషయంలో చాలా జాగ్రత్తగా వుంటారని అంతర అనుకుంది. కానీ ఈమెను చూస్తుంటే అలా అన్పించడం లేదు. అచ్చం బెంగాలీ ఆంటీల్లా వుంది. ఏది వడ్డిస్తే అది తినేసింది. మధ్య మధ్య అది కావాలి ఇది కావాలి అంటూ రెండు రెట్లు లాగించింది. భోజనాలూ గీజనాలూ అయిపోయాయి. చివరికి వంటమనిషి చేసిన బెల్లం పాయసం తాగారు. మొదట ఫ్లోరా స్వీట్ తింటుందో లేదోనని అంతర భయపడింది. పాయసం అద్భుతంగా వుండడంతో ఫ్లోరా గటగటా తాగేసింది. ఆ తర్వాత అందరూ డైనింగ్ టేబుల్ వదిలి లివింగ్ రూములోకి వచ్చేశారు.

ఫ్లోరా, రేణు ఏదో మాట్లాడుకుంటున్నారు. పూజ చాలా సేపట్నించి మౌనంగా వుంది. ఆ గదిలో ఓ మూలన ఒక్కతే ఓ కుర్చీలో కూలబడి తల దించుకుంది. అంతర అప్పుడప్పుడూ ఓ కంట కనిపెడుతూనే వుంది. లోపల్లోపల నవ్వుకొంటున్నది. ఆ తర్వాత అటువైపు చూళ్ళేదు. వ్యాపారంలో ఇక పూజ తనను మించిపోలేదు. ఇప్పట్నుంచి పూజ పాస్ట్ టెన్స్. ఆమె గురించి తల బద్దలు కొట్టుకోవాల్సిన అవసరమే లేదు. ముందు ముందు ఇక అన్నీ అంతర రోజులే! 'ఉందిలే మంచి కాలం ముందూముందునా' పాడుకుంది అంతర. ఉజ్వలమైన భవిష్యత్తే అంతా!

పూజ అంతరను అనేకసార్లు అవమానించింది. హేళన చేసింది. నిర్లక్ష్యం చేసింది. అయితే పూజ ఈ అవమానాలు,

హేళనలూ, నిర్లక్ష్యాలూ బయటకు కనిపించేలా చేయలేదు. పూజ చాలా చతురురాలు. అంతర ఎదుట అవమానించకపోయేది. ఆమె పరోక్షంలో యథేచ్ఛగా ఎగతాళి చేసేది. అంతర తనతో ఏ విషయంలోనూ సాటికాదని అంటుండేది పూజ తన స్నేహితులతో. కేవలం డాక్టర్ కింశుక్ భార్య హోదాలోనే అంతరకు ఈ అవకాశం రేణు కల్పించిందని పూజ ఆలోచన. అంతరకు సొంత వ్యక్తిత్వం లేదనీ, వ్యాపార విషయాల్లో సామర్థ్యం లేదనీ పూజ అభిప్రాయం. అంతర వీటిని ఏమాత్రం మరిచిపోలేదు. అందుకనే ఇవాళ ప్రతీకారం తీర్చుకోవడానికి అవకాశం చిక్కింది. ఇది అంతం కాదు, ఆరంభం మాత్రమే అని పూజ త్వరలోనే తెల్సుకుంటుంది.

"అరే మేడమ్! ఏక్ బార్ ఆయియేతో యహాం! వుయ్ మస్ట్ సీ దిస్ వుమన్" పూజ గట్టిగా అరిచింది. ఆ అరుపులే అంతర భవిష్యత్తు చిత్ర పటాన్ని ముక్కలుముక్కలుగా చించిపారేశాయి. సర్వనాశనం జరిగిపోయింది. పూజ అత్తగారి గది వైపు ఎందుకు వెళ్ళింది? ఎప్పుడు వెళ్ళింది? టాయిలెట్ అయితే ఇటువైపు కూడా ఒకటి వుంది కదా! పూజ అందరినీ ఏం చూడాలని కేక వేస్తున్నది? కొంపదీసి అత్తగారి గదిలోకి వెళ్ళలేదు కదా!

అంతర ఏమీ జరగనట్లుగానే "ఏం జరిగింది పూజా, ఫ్లోరా మేడమ్‌ని లోపలికి రమ్మని పిలుస్తున్నావు? జరిగిందేంటో ఇక్కడికొచ్చి చెప్పరాదూ" అంది.

అంతరకు ఏం జరిగిందో స్పష్టంగా తెలియకపోయినప్పటికీ జరగరానిది ఏదో జరిగిపోయిందనేది కచ్చితంగా తెలియవచ్చింది. రేణు తక్షణమే లేచి నిల్చుంది. ఫ్లోరాకు ఏం జరిగిందో తేటతెల్లం కాలేదు. అయినా రేణు లోపలి దిక్కు వెళ్తూ వుండడంతో ఆమె కూడా కాస్త తటపటాయిస్తూనే లేచి నిల్చుంది. గదికి మరోవైపు

> ## కొత్తగాలి...
>
> **అప్పు లేనివాడు**
> **అధిక శ్రీమంతుడు**
> **శత్రువు లేనివాడు**
> **గొప్ప సుఖవంతుడు!**
>
> – లోగిశ లక్ష్మీనాయుడు,
> సింహాచలం

తన క్యాషియర్ జీవన్‌బాబు భార్యతో దేవిక ఏదో మాట్లాడుతోంది కనుక అటువైపు ఆమె దృష్టి పడలేదు. ఒక్కొక్కరే లేచి ప్రతిమ గదివైపు వెళుతుండడం వల్ల దేవిక అవాక్కయి సంభాషణ ఆపేసింది.

★ ★ ★

రాత్రి బాగా పొద్దుపోయింది. ఇల్లంతా నిశ్శబ్దంగా వుంది. ప్రతిమ తన మంచమ్మీద కదలకుండా మెదలకుండా పడుకుంది. బోలెడంత అల్లరీ, పెద్దగా ఏడ్పులూ పెడబొబ్బలూ అయ్యాక ఇప్పుడు ఇల్లు ప్రశాంతంగా వుంది. అంతర నిద్రపోతున్నదా? అయితే శోభాది, ఛాయ.. ఇద్దరూ బహుశ పగిలిపోయిన గాజుముక్కల్ని అవతల పారేసి గదిని శుభ్రం చేసి వుంచారు. వంట పాత్రలూ, పింగాణీ గిన్నెలూ, పూలతొట్లూ... ఏది తన చేతికి అందితే అది పుచ్చుకుని పిచ్చిదానిలా నేలకేసి కొట్టింది అంతర. ప్రతిమ తన గదిలోంచి బయటికి రాకపోయినా ఆ శబ్దాలు అన్నింటినీ చక్కగా విన్నది. అంతరకు హిస్టీరియా సోకినట్లు ప్రవర్తించింది. ఆ ఉన్మాదంలో ఏం కేకలు వేసిందో అవన్నీ ప్రతిమకు వినపడ్డాయి.

అదే.. ఆ అందమైన అమ్మాయి తన గది గుమ్మం ముందుకొచ్చి ఎందుకు నిల్చుందో ప్రతిమకు తెలియదు. ఆ



మీ సమయాన్నీ సామర్థ్యాన్నీ మీరే నిర్లక్ష్యం చేస్తే
ఇతరులూ లెక్కచేయరు
మీ సమయాన్ని, సమర్థతను గుర్తించి
మిమ్మల్ని మీరు మరింత పదును పెట్టుకోవాలి

– కిమ్ గార్ట్స్

అక్షరం

అమ్మాయి పేరు కూడా తెలియదు. తర్వాత పూజ అని విన్నది.

అంతర మాట ప్రకారమే వంటమనిషి ప్రతిమకు రాత్రి భోజనం అత్తగారి గది లోకే తీసుకొచ్చింది. ప్రతిమ చక్కగానే తినేసింది. కానీ నిద్ర పట్టలేదు. ఇంత త్వరగా పడుకునే అలవాటు లేదు. ఏం చేయాలో తోచక మళ్ళీ కుట్లూ అల్లికలు చేస్తూ కూర్చుంది. ఏకాగ్రతతో గుడ్డల గుండెల్లోకి సూది గుచ్చుతూ తన పని తను చేసుకుపోతోంది.

హఠాత్తుగా తన గదిలో తనొక్కతే కాక మరెవరో ఉన్నట్లు అనిపించింది. తల ఎత్తి చూస్తే గది గుమ్మం ముందు ఒక అపరిచిత స్త్రీ. బహుశ! అంతర అంత వయస్సే వుంటుందేమో! ఆమె ప్రతిమ వైపే చూస్తున్నది.

ప్రతిమ అవాక్కయ్యి ఏమీ మాట్లాడ లేదు. సహజంగానే లేని చిరునవ్వుని పెదాల మీదికి తెచ్చుకుంది ఆ అమ్మాయి. బహుశ ప్రతిమ ప్రతిస్పందన కోసమే ఎదురుచూస్తున్నట్లుంది. ఆమె కూడా చిన్నగా నవ్వి గదిలోకి ప్రవేశించింది.

"ఏం చేస్తున్నారు ఆంటీ జీ? " అంది.

ప్రతిమ జవాబివ్వకుండా నవ్వు మొహం తో కుట్లూ అల్లికల తవైపు చూపింది.

అమ్మాయి తక్షణమే ప్రతిమ చెంత వచ్చి వాలింది.

"ఇదేంటి? చీరనా? ఓ మై గాడ్! ఎంబ్రాయిడరీ!! మీరే స్వయంగా పోత పోస్తున్నారా ఆంటీ జీ? సచ్ మే? " అంటూనే గట్టిగా అరిచింది పూజ. చూస్తూ వుండగానే అందరూ ప్రతిమ గదిలో పోగయ్యారు. ఫ్లోరా కూడా వచ్చే సింది. వచ్చినవాళ్ళలో ఏ ఒక్కరినీ ప్రతిమ ఇంతకు ముందు చూసి ఎరుగదు. అందరి వెనుక అంతర వుంది, అనుకోనిది ఏదో జరిగిపోయినట్లు ఆమె ముఖకవళి కలు! వాళ్ళల్లో ఒకరు మాట్లాడుతుంటే ప్రతిమకు అర్థమైంది, తన గదికి మొదట వచ్చిన అమ్మాయి పేరు పూజ అని.

"ఏమైంది పూజా? అలా గట్టిగా అరిచా వెందుకు? " అంది ఫ్లోరా.

"మేడమ్! ఆప్ ఏక్ బార్ ఇన్‌కా కామ్ దేఖియేతో సహీ"

ప్రతిమ ఏమీ మాట్లాడడం లేదు. పూజ మాటలు విని అందరూ ఆమె ఏం కుడు తున్నదో గమనించసాగారు. ప్రతిమను అందరూ అద్భుతంగా పొగుడుతున్నారు. ప్రతిమ ఓసారి అంతరవైపు చూసింది. కోపాన్ని ఎంత బిగబట్టుకున్నా ఆమె ముఖం వణికిపోతున్నది. అంతరను చూస్తూనే ప్రతిమ తల దించుకుంది. తను చేస్తున్న పనిని చూసి వాళ్ళంతా ఎందుకంతగా ప్రశంసిస్తున్నారో ప్రతిమకు అర్థం కావడంలేదు.

ఫ్లోరా మేడమ్ ప్రతిమ పోత పోస్తున్న చీరను చూసింది. తల ఎత్తి ఏదో మాట్లా డింది కూడాను. ఇంగ్లీషు భాషను, ఆ యాక్సెంటునూ ప్రతిమ అర్థం చేసుకోలేక పోయింది. ఇంకో మహిళ ప్రతిమకు ఆ మాటల సారం ఏంటో చెప్పింది.

"ఓ యస్! ట్రూలీ వండర్‌ఫుల్ వర్క్! హూ ఈజ్ దిస్ లేడీ అంతరా? " ఫ్లోరా

ప్రశ్నించింది.

జవాబు చెప్పడానికి అంతర ఒక నిముషం పాటు సమయం తీసుకుంది. ఒక కంట ప్రతిమని గమనిస్తూనే లోగొంతుకతో ఏదో జవాబు చెప్పింది.

"ఓ రియల్లీ! హౌ వండర్‌ఫుల్ అంతరా? సో నైస్ ఆఫ్ యూ"

అంతర చెప్పిన జవాబు వినిపించుకున్న వాళ్ళు అందరూ ప్రతిమను తమకు తోచిన రీతిలో పొగుడుతున్నారు. ఆ పొగడ్తలు ఏమీ ప్రతిమకు విన్పించలేదు. కానీ అంతర చెప్పిన జవాబు మాత్రం ప్రతిమ చెవిలో కరిగించి పోసిన లోహద్రవంలాగా పోటెత్తుతున్నది. అంతర ఎంత మెల్లగా చెప్పినప్పటికీ ఆ మాటలు ప్రతిమకు సుబ్బరంగా వినవచ్చాయి.

మొదట ఎటువంటి ప్రతిక్రియా చూపించవద్దనుకుంది ప్రతిమ. నిజమో, అబద్ధమో తన గురించి ఏమైనా చెప్పనీ అనుకుంది. బహుశ ఇంతమంది ముందు ప్రతిమను అత్తగారిలా పరిచయం చేయడం తన అంతస్తుకు భంగం కల్గుతుందని అంతర భావించినట్లుంది. నిజమే కదా! ప్రతిమ వీళ్ళందరిలా చక్కగా ముస్తాబు చేసుకోలేదు కదా!!

ప్రతిమ చాలా సింపుల్‌గా వుంటుంది. అంతర ఏమైనా చెప్పనీ! కానీ ఆ తర్వాత ప్రతిమకు చప్పున గుర్తుకొచ్చింది. ఏమిటది? ఆత్మగౌరవం! అది కేవలం ప్రతిమ ఆత్మగౌరవ సమస్యే అయివుంటే ఆమె కిమ్మనకుండా వుండిపోయేది. కానీ అది చనిపోయిన తన భర్తగారి ఆత్మగౌరవ సమస్య. తన ఇద్దరి పిల్లల ఇజ్జత్ కా సవాల్, అంతర మాటల్ని అంగీకరిస్తే వాళ్ళ పరువు కూడా పోతుంది. అందువల్లే తన గదినిండా వున్న అపరిచిత స్త్రీలతో గొంతు తగ్గించినా స్పష్టంగా చెప్పిందిలా.

"క్షమించండి! అంతర నన్ను తప్పుగా పరిచయం చేసింది మీకు. నేను దిక్కూమొక్కూ లేని అనాథ స్త్రీని కాదు. ఇది నా కొడుకు ఇల్లు. డాక్టర్ కింశుక్ నా బిడ్డే! ఈ మహిళ అంటే.. అంతర నా కోడలు. ఇంతే! ధన్యవాదాలు"

గదిలో గుండుసూది పడినా వినపడేంత నిశ్శబ్దం. అంతర గుసగుసగా ఫ్లోరా చెవిలో ఏదో చెప్పింది. ఒక్కొక్కరుగా ప్రతిమ గదిలోంచి వెళ్ళిపోయారు. అంతర వైపు ఎవరూ చూడడం లేదు. అతిథులందరూ ఇల్లు వదలి ఎప్పుడు వెళ్ళిపోయారో ప్రతిమకు తెలియదు. డైనింగ్ హాల్లోంచి వస్తువులూ, పాత్రలూ పగిలిపోతున్న చప్పుడు విని మొదట ప్రతిమ గజగజ వణికిపోయింది. తర్వాత అంతర అంతరంగంలోని నిరాశకు ప్రతిధ్వనులే ఈ శబ్దాలు అని ప్రతిమ సరిపెట్టుకుంది. కోపంలోనూ, శోకంలోనూ అంతర గొంతు రుద్ధమైపోతోంది. వికృతంగా మారిపోతోంది. అంతర చేసిన ప్రళయ తాండవం చాలాసేపు కొనసాగింది. ప్రతిమ తన గదిలోంచి బయటకు రాలేదు. కానీ విన్పిస్తున్నాయి. రేపు పొద్దున ఏమవుతుందో ప్రతిమకు తెలియదు. బహుశ ఈ యింటి నుంచి తను బహిష్కృతురాలు కావచ్చు. అంతర తనను తీసుకొచ్చి వృద్ధాశ్రమంలో వుంచవచ్చు. పిల్లలకు కూడా తను చేసింది తప్పుగా తోచవచ్చు. ఏది అయితే అది కానీ! ఏమైనా జరగనీ!! రేపటి విషయం రేపే చూసుకోవచ్చు. తెల్లవారితే చాలు జీవితంలో మరో కొత్తరోజు. ఇవ్వాళైతే దాదాపు రాత్రి గడిచిపోతున్నది. అన్ని రాత్రులూ గడిచిపోతాయి. మళ్ళీ పొద్దు పొడుస్తుంది. బాల భానుని బంగారు కిరణాలతో చీకట్లు తొలగిపోతాయి. ఇవ్వాల్టి ఈ సుదీర్ఘమైన రాత్రి సైతం ముగుస్తుంది. ఎప్పటిలాగే భళ్ళున తెల్లవారుతుంది. రేపటి ప్రభాతం ఎలా వుండబోతున్నదో చూద్దాం అనుకుంది ప్రతిమ. ©




## తెన్నేటి సూరి

# చెంఘిజ్‌ఖాన్

నిర్వహణ :
**వి. రాజారామమోహనరావు**

**నరరూప రాక్షసుడిగా పేరు పొందిన వ్యక్తి అంతరంగంలోని మానవతాచ్ఛాయని అద్భుతంగా ఆవిష్కరించిన నవల 'చెంఘిజ్‌ఖాన్'. స్వతంత్ర జీవన కాంక్షని, తన జాతికి నిర్భయ జీవితాన్ని అందించటానికి ఆ వ్యక్తి అహోరాత్ర కృషిని తెన్నేటి సూరిగారు అక్షరీకరించిన తీరు శ్లాఘనీయం. 1956లో తొలిసారి ముద్రితమైన ఈ నవల పునర్ముద్రణలు ఇప్పటికీ జరుగుతూనే వున్నాయి. అర వయ్యేళ్ళుగా నవల విలువ ఏ మాత్రం తగ్గలేదనడానికి ఇదే సాక్ష్యం!**

చెంఘిజ్ ఖాన్.. ఓ మంచి సమ్మిళితం! చరిత్ర సారాన్ని వస్తువుగా చేసుకుని రూపొందిన నవల. చరిత్రాంశాలకి రక్తమాంసాలు ప్రోదిచేసి, ఆ కాలాన్ని, అందులోని వ్యక్తుల్ని నవరస భరితంగా తీర్చిదిద్ది చెంఘిజ్ ఖాన్ నవలకు ప్రాణప్రతిష్ట చేశారు తెన్నేటి సూరి.

యాసుకై యెక్కా మంగోల్ ఖాన్, యూలన్, గూయగ్జూషామాన్, కరాచర్ టెంగ్రీబట్, టెమూజిన్, ఖగత్తూకి- ఇవి వ్యక్తుల పేర్లు. మెర్కిట్, తార్‌తార్- జాతులపేర్లు. ఇలాంటి పేర్లతో దాదాపు నాలుగు వందల పేజీల ఈ నవల ఆద్యంతం ఉత్కంఠగా సాగడం విశేషం. నిర్దిష్ట ప్రణాళికతో ఈ నవల రాశారు రచయిత. చెంఘిజ్ ఖాన్ వ్యక్తిత్వం పట్ల విభిన్నమైన దృష్టి వుంది ఆయనకు. ముందుమాటలో ఆ విషయాన్ని ఇలా స్పష్టంగా రాశారు. 'చెంఘిజ్ ఖాన్ నా ఆదర్శ వీరుడు అని నెహ్రూ తన జీవితచరిత్రలో అన్నారు. నెహ్రూ దృష్టిలో ఉన్న చెంఘిజ్ ఖాన్ పాశ్చాత్య నాయకుల దృష్టిలో ఉన్న రాక్షసుడు కాదు, గోబీ ప్రజలకు ప్రేమపాత్రమైన మానవుడు. చెంఘిజ్ ఖాన్ గురించి పాశ్చాత్య రచయితలు చాలా గ్రంథాలు రాశారు. చెంఘిజ్ ఖాన్ రాక్షసుడని నిరూపించడానికి ఆయా రచయితలు పడ్డ తాపత్రయం విపరీతం. ఆసియా గడ్డపై కూడా ఓ మహాపురుషుడు పుట్టాడని అంగీకరిస్తే పాశ్చాత్య నాగరికతంతా తలవంపులవుతుందా!'

ఓ బంజారీ తండా నాయకుడు ప్రపంచంలో ముప్పాతికవంతు జయించి మూడు శతాబ్దాల పర్యంతం స్వర్ణయుంగా నిలిచిన ఒక మహా సామ్రాజ్యాన్ని ఎలా స్థాపించగలిగాడు? ఇదంతా సైనిక శక్తి వల్లనే సాధ్యమైతే ఆ మహత్తర శక్తి అతనికెలా వశమైంది? ఆ శక్తిని హస్తగతం చేసుకోవడానికి అతనిలో ఉన్న బలమైన గుణసంపత్తి ఏంటి? వంటి విషయాలతో పాటు మరో ఆసక్తికర అంశాన్ని స్పృశించారు రచయిత.

'కఠోరమైన సైనిక శాసనాలను అమలు జరిపి, రాక్షసుడిలా వ్యవహరిస్తే ఏ వ్యక్తి అయినా చెంఘిజ్ ఖాన్‌లా ప్రపంచాన్ని జయించవచ్చనే తప్పుడు భావాన్ని వ్యాపింపజేశారు జర్మన్ చరిత్రకారులు. ఈ తత్త్వం తలకెక్కిన హిట్లర్ 'నాజీ యిజం' అనే క్రూర సైనికతత్త్వాన్ని అభివృద్ధి చేసి రాక్షసుడిగా మారాడు తప్ప చెంఘిజ్ ఖాన్ వంటి మానవుడు కాలేకపోయాడు'

ఈ నవలకు చారిత్రక ఆధారం హెన్రీ హెచ్. హోవర్త్, ఎఫ్.ఎస్.ఎ దంపతుల మంగోల్ హిస్టరీ. నిష్పాక్షికంగా నిజానిజాలను గ్రంథస్థం చెయ్యటానికి ఆ దంపతులు తమ జీవిత సర్వస్వాన్ని త్యాగం చేశారంటారు సూరి. తెన్నేటి సూరిగారి కృషి కూడా సామాన్యమైంది కాదు. నరరూపరాక్షసుడని, లక్షలకొద్దీ జనాన్ని బలి తీసుకున్నాడని పేరుపొందిన చెంఘిజ్ ఖాన్‌కు తన జాతి పట్ల అమితమైన ప్రేమ ఉందని, తన వారి దురవస్థ చూడలేకే అంతగా తెగబడ్డాడని, అతనిలోనూ మానవత వుందని చెప్పే ప్రయ

త్వం విలక్షణమైందేకాక ఎంతో సాహసం కూడా.

చంఘిజ్ ఖాన్ తల్లి యూలన్. ఆమె పెళ్ళి తతంగంతో నవల ఆరంభమైంది. ఆమె మెర్కిట్ జాతి తండా ఆడపడుచు. అదే జాతికి చెందిన అర్ఘన్‌తో ఆమె వివాహం. అదే సమయంలో యెక్కామంగోల్ తండా నాయకుడు యాసుకై సైన్యంతో వచ్చి మెర్కిట్ తండావాళ్లని ఊచకోత కోసి యూలన్‌ని ఎత్తుకుపోయాడు. అందుకు రోదిస్తున్న యూలన్‌తో 'ఎందుకు ఏడుస్తావు? ఊరుకో- అందమైన ఆడది బలవంతుని ఆస్తి- ఇది గోబీ ఎడారి ధర్మం...' అన్నాడతను.

గోబీ ఎడారిలో అప్పటి ధర్మం అదే! బలవంతుడు బలహీనుణ్ణి కబళించటం.. పచ్చి మాంసం తినటం, జంతుచర్మాలు ధరించటం.. నిత్యం ఎవరు మీద పడతారోన్న యుద్ధ భయం. పరస్పర యుద్ధాలతో వైషమ్యాలు పెరిగి, జాతుల మధ్య పగ, ద్వేషం!

యూలన్‌కి యాసుకై అంటే తీవ్ర ద్వేషం. బందీగా వుంది. ఇష్టంగా అతనికి వశం కాలేదు. యూలన్ అన్న కరాచర్. అతనికి చెల్లెలంటే ప్రాణం. ఆమెను అతనే పెంచాడు. తెలివితేటలతో పాటు, సర్దుబాటు తెలిసినవాడు. యాసుకైకి అనుకూలంగా మెలుగుతూ, చెల్లెలికి అతని మీద ప్రేమ కలిగేలా చేస్తానన్నాడు. యూలన్ గర్భవతి. శత్రువు సంతానాన్ని మోస్తున్నందుకు తన మీద తనకే అసహ్యం. ఆ రోజు మతగురువు షామాన్ పెద్దపూజ చేస్తున్నాడు. దేవతలతో మాట్లాడి పుట్టబోయే సంతానానికి రక్ష తేనున్నాడు. ఆ పూజకి యూలన్ సిద్ధమవ్వాలి. భర్తతో కొరడా దెబ్బలు తింది కానీ తయారవటానికి సిద్ధపడలేదు. అప్పుడు కరాచర్ నచ్చజెప్పాడామెకు. 'వేరే దారి లేదు. యాసుకైని ఇష్టపడితే నువ్వు, నీతో పాటు నేను బతుకుతాం, లేదా చచ్చిపోతాం. నీ మొండితనంతో ఈ హింసని, నైచ్యాన్ని భరించటం మూర్ఖత్వం'




యూలన్ మనసు మార్చుకుంది. యాసుకై ప్రాణప్రియంగా మారింది. షామాన్ పూజ చేశాడు. రక్ష లభించిందన్నాడు. ఆకాశదేవుడు యెక్కా మంగోల్ జాతికి వీర పురుషుణ్ణి ప్రసాదించబోతున్నాడని అన్నాడు. యూలన్ ప్రసవానికి ముందే యాసుకై తార్‌తార్ తండానీ జయించి తమ తండాలో విలీనం చేసుకున్నాడు.

యూలన్ ప్రసవించింది. బిడ్డను చూడగానే యాసుకై 'టెమూజిన్' అని పెద్దకేక పెట్టాడు. టెమూజిన్ అంటే ఉక్కుమనిషి. శారీరకంగానే కాదు, సంకల్పంలో కూడా. దానికితోడు శిశువు ఎడమ గుప్పిట మూసుకునే వుంది. తెరచి చూస్తే అరచేతికి మధ్యగా ఎద్దు మూపురంలా ఒక మాంసఖండం(కకుద్రేఖ) ఉబ్బెత్తుగా ఉంది. అలా ఉంటే జగజ్జేత అవుతాడని విశ్వాసం. యాసుకై సంతోషంతో 'జగజ్జేత' అని అరిచాడు. చంఘిజ్ ఖాన్ జననం అంత విచిత్రంగా. జరిగింది. ఆ బిడ్డ మహావీరుడవుతాడు, అతడి నాయకత్వంలో మంగోలు జాతి ప్రపంచాన్ని జయిస్తుంది. తమకు శత్రు భయముండదు. తమ ఆడవాళ్లను ఎవ్వరూ ఎత్తుకుపోరు.. ఇలాంటి నమ్మకాల మధ్య పెరిగాడు టెమూజిన్. దీనికితోడు తమ స్వార్థం కోసం షామానులాంటివాళ్లు మరిన్ని జోడించారు.. దేవతా జోస్యాలు చెప్పించారు. ప్రపంచం మొత్తం దుర్మార్గం ప్రబలిపోయింది. రాజులు, చక్రవర్తులూ విలాసాల్లో మునిగి దేవుణ్ని మరిచిపోయారు. వాళ్లందర్నీ నాశనం చేయడానికి టెమూజిన్‌ని భూలోకానికి పంపారు.. ఈ భావజాలం, పొగడ్తల మధ్య చిరుత పులులతో ఆడుకుంటూ పెరిగాడు టెమూజిన్. అతను తన జాతిని ఉద్ధరించాలి. చిన్నతనం నుంచీ అదే అతని ధ్యేయం. అతనికి భయమంటే తెలియదు. ఎటువంటి క్లిష్టపరిస్థితులనైనా అధిగమించడమే. దిగులు, ఏడుపు అతనికి తెలియని పదాలు.

తుఘ్రల్ ఖాన్ కేరట్ నాయకుడు. కేరట్ తురుష్కులు బంజార జీవితాన్ని వదిలేసి చైనా గోడపక్కనే ఓ సారవంతమైన భూఖండాన్ని ఆక్రమించి నగర నిర్మాణం చేసుకున్నారు. వ్యవసాయం, వృత్తి వ్యాపారాలతో నాగరీక స్థాయికి చేరారు. తుఘ్రల్ ఖాన్ పేరు ప్రఖ్యాతులు దేశదేశాలకి తెలుసు. అంతటి మనిషి యాసుకై సైనిక సాయంకోరి వచ్చాడు. యాసుకై సంబరపడిపోయాడు. కరాచర్ వారిద్దరికీ స్నేహం కుదిర్చాడు. కత్తులు కలిపి స్నేహ ప్రమాణాలు చేశారు.

## చరిత్ర సాహిత్యాల సమ్మేళనం!



'చంఘిజ్ ఖాన్' నవలా రచయితగా సుప్రసిద్ధులు తెన్నేటి సూరి(1911-1958). అభ్యుదయ కవి, కథా రచయిత, నాటక కర్త అయిన ఆయన భారతి, ఆంధ్రపత్రికల్లో పనిచేశారు. ఆయన కృష్ణా జిల్లాలోని తెన్నేరులో జన్మించారు. చంఘిజ్ ఖాన్ నవల 1950వ దశకంలో ఆంధ్రపత్రిక సారస్వతానుబంధంలో సీరియల్‌గా ప్రచురితమైంది. ఆసియా ఖండ చరిత్రలో గర్వకారకుడైన మహాపురుషుడు చంఘిజ్ ఖాన్‌ను విదేశీ చరిత్రకారులు ఓ సైతానుగా, అధికార దుర్మదాంధుడుగా, నియంతగా, నరరూప రాక్షసునిగా చిత్రించారు. తెన్నేటి సూరి ఎన్నో శ్రమలకోర్చి యథార్థ చరిత్రను వెలికితీసి, ప్రాచ్య, పాశ్చాత్య గ్రంథాలను ఔపోసన పట్టి ఎంతో దక్షతతో 'చంఘిజ్ ఖాన్' నవలను తీర్చిదిద్దారు. చంఘిజ్ ఖాన్‌కు గల పరిపాలనా దక్షతను, శక్తి సామర్థ్యాలను, అధికారుల పట్ల చూపిన ప్రేమాదరాలను చక్కగా వివరించారు. 'విప్లవరేఖలు, సుబ్బలక్ష్మి' ఆయన కథా సంపుటాలు. 'అరుణరేఖలు, మహోదయం' ఆయన కథా సంకలనాలు.

ఫ్రెంచి విప్లవాన్ని నేపథ్యంగా చార్లెస్ డికెన్స్ రాసిన 'ఏ టేల్ ఆఫ్ టు సిటీస్'ను 'రెండు మహానగరాలు' పేరిట తెలుగులోకి అనువదించారు తెన్నేటి సూరి.

బాల్యచేష్టే అయినా టెమూజిన్ కూడా కత్తి కలిపి ప్రమాణం చేశాడు. యాసుకై సాయంతో తిరిగి అధికారంలోకి వచ్చాడు తుఘ్రల్ ఖాన్. ఫలితంగా యెక్కామంగోలు తండా సైన్యం పెరిగింది. అపార ఆయుధ సంపత్తి చేజిక్కింది.

టెమూజిన్‌కి నూనూగు మీసాల వయసు! కొడుకు పెళ్ళి సంబంధానికి వెళ్ళి వస్తుండగా దాయాది టర్గుటాయ్ పాత పగతో యాసుకైపై విషప్రయోగం చేశాడు. అతని మరణంతో తండా కలవరపడింది. పరస్పర విభేదాలతో అయినవాళ్ళే అధికారం కోసం కుతంత్రాలు పన్నారు. వాటిని అణిచేసి చంఘిజ్ ఖాన్ తన అధికారం తిరుగులేనిదనిపించాడు. తర్వాత అతని జీవితమంతా యుద్ధ తంత్రమైంది. నిత్యం తనవాళ్ళ రక్షణ, శత్రువుల ఎత్తుల మీద నిఘా. కృతజ్ఞత లేని తుఘ్రల్ ఖాన్ మోసం చెయ్యాలని చూసినా చంఘిజ్ ఖాన్ సాగనివ్వలేదు.

తుఘ్రల్ ఖాన్.. చైనా చక్రవర్తి, తురుష్క చక్రవర్తి, మహమ్మద్‌షాలతో చేతులు కలిపాడు. వారికి ఎదురుపడి జయించలేడు చంఘిజ్ ఖాన్. తన వాళ్ళలో చీలిక వచ్చిందన్న పుకారు పుట్టించాడు. ఒక్కొక్క శాఖ మంతనాలు జరిపి తుఘ్రల్ ఖాన్‌ని చేరింది. తన సైన్యం పెరిగిందని సంతోషపడ్డాడు తుఘ్రల్ ఖాన్. కానీ ఓ రాత్రి పథకం ప్రకారం నిద్రలో ఉన్న తుఘ్రల్ ఖాన్ సైన్యాన్ని చంఘిజ్ ఖాన్ సేన తుదముట్టించింది. చంఘిజ్ ఖాన్ తుఘ్రల్ ఖాన్‌ని చంపేశాడు.

విజయం తర్వాత చంఘిజ్ ఖాన్ 'గోబీ ప్రజలందరిదీ ఒకే జాతి. మానవత్వమే మన మతం. ఈనాటి నుంచి మనం మానవులుగా ప్రపంచ చరిత్రలో అవతరించనున్నాం. ఇకపై గోబీ ప్రజానీకాన్ని కన్నెత్తి చూడటానికి జగత్తులో ఎంతటి వాడికైనా గుండెలుండవు. పాతికేళ్ల క్రితం ఏ ఒక్కరి మానప్రాణాలకూ రక్షణ లేదు. బతుకుతెరువు తెలీక ఒకరినొకరు పీక్కుతింటూ, ఖూనీలు చేసుకుంటూ నానా అవస్థలూ పడుతుండేవాళ్ళం. ఆ దీనావస్థను చూసి నా హృదయం ఎంత రంపపు కోత పడిందో మీరు ఊహించలేరు. గోబీ జాతులన్నింటినీ సంఘటితం చేస్తేకానీ విముక్తి లేదని గ్రహించాను. ఆ లక్ష్యంతో అహోరాత్రులు కృషి చేశాను. ఎన్నో అకార్యాలు చేశాను. జాతులకి జాతులని తుడిచేశాను. ఎందర్నో బలి తీసుకున్నాను. ఇందులో నాకేదో స్వార్థముందని చాలా మంది అపోహ. క్షమించి నన్ను వదిలేయండి. గోబీ సమాఖ్యను పరిరక్షించగలిగిన విజ్ఞానవేత్తను అన్వేషించండి' అంటూ అందరికీ నమస్కరించాడు. ప్రజలు ముక్తకంఠంతో చంఘిజ్ ఖాన్‌కి జేజేలు పలికి, అతనే తమ సర్వస్వం అన్నారు. ఇక్కడితో నవల ముగుస్తుంది.

దుర్భరమైన ప్రజాపీడనలో అవతరించిన జ్వాలారేఖ చంఘిజ్ ఖాన్ అన్నారు రచయిత. నవలలో చాలా క్లిష్టమైన సంఘటనలు, వాదాలు, వర్ణనలు, వ్యక్తీకరణలు ఉన్నాయి. అవి తెలియాలంటే నవలని ఆసాంతం చదవాల్సిందే! ©

# చతుర ప్ర.జ.



**పాఠకుల ప్రశ్నలకు ఉపన్యాసశిరోమణి, అభినవ వ్యాస డా. కె. రామానుజాచార్య సమాధానాలు**

ప్ర. ఆత్మ అవ్యక్తం, ఏ వికారం లేనిదని గీతలో కృష్ణుడు చెప్పారు. మరి ఆత్మలు కనిపిస్తాయని, మాట్లాడుతాయని.. యోగా, పిరమిడ్స్ వంటివి చేసేవారికి వశంలో ఉంటాయనడం ఎంతవరకు నిజం?

– ఎన్. లీలాప్రసూనాదేవి, సికింద్రాబాద్

**జ.** ఆత్మలు కనపడటం అనేది అసంగతం. ఆత్మకు ఏ రూపమూ లేదు. ఏ భేదమూ లేదు. మనసుకూ లేదు. బుద్ధికీ లేదు. ఇవి నివసించడానికి ఒక ఇల్లు కావాలి. అదే శరీరం. ఆ శరీరం కనపడుతుంది. ఆత్మ ఆ శరీరాన్ని ఆధారం చేసుకొని ఉంటుంది. వస్తుంది.. పోతుంది. యోగాలో, ధ్యానంలో భగవంతుడు లేదా భక్తుల రూపాలను ధ్యానిస్తాం. వారే కనపడతారు. దెయ్యాలు, భూతాలు, గ్రహాలు అనేవి కూడా ఆయా ఆత్మల పాప రూపాలు. ఆత్మ ఎవరికీ వశం కాదు. అది ధరించిన జన్మలు మాత్రమే వశంలో ఉంటాయి.

ప్ర. ప్రతిమనిషి జీవితానికి ప్రాముఖ్యం ఉంటుందని చెబుతారు. కానీ చాలామంది ఏమీ సాధించకుండానే రోగాలతో మంచాన పడి మరణిస్తున్నారు. ఏమిటి ఇందులోని ఆంతర్యం?

– ఎన్.వి. రమణి, బంజారాహిల్స్, హైదరాబాద్

**జ.** ప్రాముఖ్యం దేనికుంటుందో చెప్పేది మనిషి కాదు.. భగవంతుడు. ఒక్క మాటతో చెప్పాలంటే జీవితాన్ని ఇచ్చినవాడు జీవిత ప్రాముఖ్యాన్ని నిర్దేశిస్తాడు. మనం పూర్వజన్మలో ఆచరించిన పాపపుణ్య ఫలమును అనుభవించటానికి భగవంతుడు జీవితాన్ని ఇస్తాడు. పాపాలు బాగా చేసినవాడు పాప ఫలితాలు అనుభవించటానికి కదా జీవితాన్ని ఇచ్చింది. పాప ఫలితం దుఃఖాలు. పుణ్య ఫలితం సుఖభోగాలు. మరి రోగాలు రొష్టులు, దుఃఖాలు పాప ఫలితం కదా! పూర్తి పాపాలు ఆచరించినవారు తాము సంపాదించిన పాపాన్ని ఖర్చుపెట్టటానికి వస్తారు. ఖర్చుపెట్టినవి పోను మరికొంత పాపమో, పుణ్యమో సంపాదించుకొని ఆ మూటతో నరకానికో, స్వర్గానికో వెళ్తారు. అలా వారు దేన్ని సాధించటానికి వచ్చారో దాన్ని సాధిస్తారు. సాధించే వెళ్తారు. సాధించకుండా ఎవరూ వెళ్లరు. అయితే మనమనుకునేది కాదు. భగవంతుడు నిర్దేశించినది సాధించి వెళ్తారు.

ప్ర. కాశీకి వెళ్లినప్పుడు తనకు ఇష్టమైన ఏదేని కాయగూరగానీ, ఫలముగానీ, ఏదైనా పదార్థంగానీ వదిలేయమనడానికి కారణమేమిటి?

– నోరి శివప్రకాశం, దర్గామిట్ట, నెల్లూరు

**జ.** ఈ శరీరాలు, ఇంద్రియాలు, అవయవాలు, బుద్ధి, మనసు.. ఇలా అన్నీ పరమాత్మ ఇచ్చినవే. ఆయన ఇచ్చిన వానితో ఆయన సేవే చేయాలి. నాలుకతో నామకీర్తన చేయాలి. మనసుతో ధ్యానం, చేతులతో పూజ చేయాలి. చెవులతో ఆయన కథలనే వినాలి. కన్నులు ఆ స్వామిని, స్వామి భక్తులనే చూడాలి. కాళ్లు దేవాలయాలకు, భక్తుల ఇళ్లకు వెళ్లాలి. నాసిక స్వామి పాదాలపై ఉంచిన తులసిని వాసన చూడాలి. ప్రతి నాలుగు మాటలలో ఒక మాట భగవానునిది కావాలి. ఇలా చేస్తే సంసారంలో ఉన్నా సన్యాసంలో ఉన్నా ఒకటే! కానీ కన్ను, ముక్కు, చెవులు, నాలుకకు ప్రకృతిలో లభించేవే ఇష్టం. మన ఇష్టాల కోసం భగవంతుని వదులుకుంటున్నాం. ఇలా చేస్తే మన ఇష్టాలన్నీ కష్టాలనే కలిగిస్తాయి. బాగా తింటే అజీర్ణం, బాగా అనుభవిస్తే అంటువ్యాధులు.. ఇలా కలుగుతాయి.




# చతుర ప్ర.జ.11



ఆచార వ్యవహారాలు.. పురాణాలు, ఇతిహాసాలు.. శ్రుతులు.. స్మృతుల పరంగా కలిగే మీ సందేహాలను క్లుప్తంగా రాసి పంపండి. మీ పేరు, చిరునామా, ఫోన్ నంబరు కూడా ప్రశ్నతో రాసి పంపండి. ఉప న్యాసశిరోమణి, అభినవవ్యాస **డా. కె. రామానుజాచార్య** ఈ ప్రశ్నలకు సమాధానాలు ఇస్తారు. ప్రతి ప్రశ్నకు ఈ కూపన్ తప్పనిసరిగా జతపరచాలి. కూపన్ జతపరచని ప్రశ్నలు పరిగణన లోకి తీసుకోబోమని గ్రహించ మనవి.

చిరునామా : **చతుర ప్ర.జ.** చతుర, ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్ - 082

భగవంతుని వదలి ఇష్టాలను పట్టుకొని కష్టాల పాలు కాకుండా భగవంతుని కోసం మన శరీరా నికిష్టమయ్యే వాటిని వదలితే మనసు, బుద్ధి, శరీరం ప్రసన్నంగా, ఆరోగ్యంగా ఉంటాయి. ఇలా ఒక్కసారే అన్నీ వదలటం కష్టం కాబట్టి ఒక్కొక్క క్షేత్రంలో ఒక్కొక్క ఇష్టాన్ని విడుస్తూ పోతే కోరికలు తగ్గుతాయి. ఇష్టం కోసం భగవం తుని విడిస్తే సంసారం. భగవంతుని కోసం ఇష్టాన్ని విడిస్తే ప్రసన్నత, సంతృప్తి, సంతోషం లభిస్తాయి! అందుకే కాశీలో కొన్ని, గయలో కొన్ని, ప్రయాగలో కొన్ని, గంగలో కొన్ని.. ఇలా విడుచుకుంటూ పోతే చివరికి ఆశ లేకుండా పోతుంది. ఇదీ ఇందులోని అంతరార్థం. కోరిక లకు దాసుడివి కాకు! కోరికలను దాసులను చేసుకో! ఇదీ బోధ!

*ప్ర. గాయత్రీ మంత్ర ద్రష్ట విశ్వామిత్రుడు అంటారు గదా! మరి ఆయనకు ముందు బ్రాహ్మ ణులు సంధ్యావందనం చేసేవారు కాదా? లేక సూర్యమంత్రాలతో చేసేవారా?*

– హెచ్.ఎ.ఆర్. సూర్యనారాయణ

**జ.** పాల సముద్రంలో లక్ష్మి పుట్టింది అంటే అంతకు మునుపు అంటే సముద్రం చిలుకక ముందు నారాయణునికి లక్ష్మి లేదా? భృగుమ హర్షికి లక్ష్మి పుట్టింది అంటే అంతకుముందు లేదా? అని అర్థం కాదు. ఉన్న లక్ష్మీదేవే కొన్ని ప్రయోజనాల కోసం అంతర్ధానం అయి మళ్ళీ ఆవిర్భవిస్తుంది. దేవతలు కొన్ని కొన్ని ప్రయోజ నాల కోసం వెళ్ళిపోతుంటారు.. మళ్ళీ వస్తుం టారు. ఇవన్నీ అవతారాలు. అసలు మూలస్వ రూపం ఎక్కడికీ పోదు. అలాగే విశ్వామిత్రమహ ర్షికి ఒక గొప్పతనం కట్టబెట్టటానికి ఆ మంత్రం ఆ ప్రాంతంలో తాత్కాలికంగా అంతర్ధానం అయిందని, విశ్వామిత్రుడు ప్రార్థిస్తే అతనికి సాక్షాత్కరించింది. అంతర్ధానం అంటే మూలస్వ రూపం అదృశ్యం కావటం కాదు. అక్షరాలు ఒక సారి మన ముందుకొచ్చిన తరువాత ఇంక ఎలా పోతాయి? అక్షరాలు పోవు. అవి మన బుద్ధిలో నుండి పోతాయి. రెండోది ఆ మంత్రానికున్న శక్తి అంతర్ధానమైపోతుంది. శక్తి అంతర్ధానం అయితే మంత్రం జపించినా ఫలితం శూన్యం. విధాన పూర్వకంగా ఉపదేశం పొంది విధిని అనుసరించి ఉపాసించినపుడే మంత్రం శక్తి గలదై సిద్ధిస్తుంది. శాస్త్రవిధిని తప్పితే మంత్రం చదువుకోవటానికి తప్ప జపానికి పనికిరాదు.

*ప్ర. మరణించిన తరువాత జీవాత్మ తన గమ్యస్థానం ఏదో ఎలా తెలుసుకుంటుంది? అక్కడికి ఎలా చేరుకుంటుంది?*

– డా.సి. జనార్దనసింగ్,
నల్లకుంట, హైదరాబాద్

**జ.** గమ్యస్థానం జీవాత్మ తెలుసుకోవటం కాదు. జీవాత్మ ఆచరించిన కర్మల ఫలం అనుభ వించటానికి తగిన ప్రదేశానికి, తగిన శరీరంతో వెళ్తుంది. శరీరం లేకుండా ఆత్మ ఎపుడూ ఉండ దు. నరకానికి వెళ్ళాలంటే యాతనా శరీరంతో వెళుతుంది. స్వర్గానికి భోగ శరీరంతో, పాతాళా నికి లీలా శరీరంతో, వైకుంఠానికి పంచోపనిష న్మయ శరీరంతో వెళ్తుంది. ఐ.ఎ.ఎస్. అయితే కలెక్టరాఫీస్‌కు, ఐ.పి.ఎస్. అయితే పోలీసాఫీ సుకు ఆ యూనిఫామ్‌లతో వెళ్ళాలి. ఇదీ అంతే! చనిపోవడమంటే ఈ శరీరాన్ని విడిచిపెట్టడం. ఇదివరకు చేసిన కర్మ ఫలాన్ని అనుభవించటా నికి ఈ శరీరంతో ఇక్కడికి వచ్చాం. ఆ కర్మ

## రూ.116/- బహుమతి పొందిన ఉత్తమ ప్రశ్న

ప్ర. రావణుని పది తలలకి కారణం ఏదైనా వరమా? శాపమా?

– రామకూరు లక్ష్మీ, శ్రీకాకుళం

జ. వేదాంత శాస్త్రంలో రావణుడు అంటే మనసు. రావణుడు అంటే అరిచేవాడు, అరిపించేవాడు. నేనే ప్రభువును, నేనే శ్రీమంతుడిని, ధీమంతుడిని, బలవంతుడిని.. అంటూ నిరంతరం అరిచి గీ పెడుతుంది. ఆ మనసు ఐదు జ్ఞానేంద్రియాలను, ఐదు కర్మేంద్రియాలను.. అంటే పదింటిని శాసిస్తుంది. ఆ పది ఇంద్రియాలే పది తలలు. లంక శరీరం. సీత జీవుడు. జీవుని మనసు ఆశ జూపి శరీరంలో బంధిస్తుంది. రావణుడే సీతకు బంగారు లేడిని ఆశను చూపి లంకలో బంధించాడు. అన్ని కథలలోనూ అంతరార్థం అద్భుతమైన సందేశాలు దాగి ఉంటాయి. ఇలా సందేశాలను, ఉపదేశాలను ఇచ్చి సమాజాన్ని సరియైన దారిలో పెట్టడమే పురాణ ఇతిహాసాల పరమార్థం.

అయిపోగానే అంటే కొద్దిగా మిగిలి ఉండగా ఈ శరీరంతో చేసిన పాపపుణ్యాలను అనుభవించటానికి తగిన శరీరాన్ని తీసుకొని తగిన లోకాలకు వెళ్తుంది. దానికి పన్నెండు రోజులు మొదటి మజిలి, ఇరవై తొమ్మిది రోజులు రెండో మజిలి, ఎనభై తొమ్మిది రోజులు మూడో మజిలి. అందుకే మొదటి పన్నెండు రోజులు పుత్రులు శాస్త్రోక్తంగా కర్మకాండను, అందులో చెప్పిన దాన ధర్మాలను ఆచరిస్తే ఆ కర్మలలో కొన్ని క్షీణించి దుర్గతి తొలగి సద్గతి లభిస్తుంది. ఆ కర్మకాండను ఆచరించటానికి పుత్రులు కావాలి. పుత్రులు లేకుంటే సద్గతి లేదు.. అనటానికి కారణం ఇదే!

ప్ర. భగవంతుని ఏమీ కోరకూడదంటారు. అదెలా సాధ్యం? మన కష్టాన్ని చెప్పి సహాయం చేయమని కోరడం, కష్టం తీరినప్పుడు ధన్యవాదాలు చెప్పడంలో తప్పేముంది?

– తటవర్తి రామకృష్ణ,
తాళ్లగడ్డ, హైదరాబాద్

జ. మనం చేసిన పాపాన్ని నశింప చేయటానికి కష్టాలనిస్తారు. కష్టాలు ఇవ్వొద్దు అంటే పాపాలు నశింపచేయకూ అని! పాపపుణ్యాలు అంటే మనం తీసుకున్న బ్యాంక్ లోన్. లోన్ తీసుకున్నపుడు వడ్డీతో కట్టి లోను తీర్చుకోవాలి. పాపానికి వడ్డీ కష్టాలు. పుణ్యానికి వడ్డీ సుఖాలు. కష్టాలు వద్దు అంటే వడ్డి ఇపుడు కట్టను, అడుగకూ అనే కదా! అపుడు వడ్డీకి చక్ర వడ్డి కట్టాలి. ఇపుడు వద్దన్న కష్టాలు ఇంకో జన్మలో దీనికి రెట్టింపుగా వస్తాయి. అపుడు ఇవీ అవీ అనుభవించాలి. అందుకే ఆ భగవంతుడు ఇచ్చినవి తీసుకొని, తీసుకొన్నవి ఇస్తే మన లోన్ తీరుతుంది. ఋణం తీరితే అకౌంట్ నిల్ బాలెన్స్ అవుతుంది. అపుడు మోక్షం వస్తుంది. అందుకే ఇవి తెలిసినవారు భగవంతుని యేదీ అడగొద్దు అంటారు. ఇదీ ఇందులో పరమార్థం.

ప్ర. బ్రహ్మరాత, బ్రహ్మముడి, బ్రహ్మరథం, బ్రహ్మచెముడు, బ్రహ్మచారి, బ్రహ్మరాక్షసి, బ్రహ్మశౌచం, బ్రహ్మపుత్ర - ఈ పదాలలో 'బ్రహ్మ' శబ్దం ఉపయోగించడానికి కారణముందా?

– కె. సుబ్రహ్మణ్యకుమార్, కర్నూలు

జ. బ్రహ్మ అంటే పెద్దది. పెద్దదిగా చేసేది. అంతటా వ్యాపించి ఉండేది. అంతటా వ్యాపించి ఉన్నా ఎంత చిన్నగా కావాలంటే అంత చిన్నగా ఉంటుంది. ఎంత పెద్దగా కావాలంటే అంత పెద్దగాను ఉంటుంది. మన సంప్రదాయం, ఆచారం కూడా అంతటా వ్యాపించి ఉంటుంది. అన్నివేళలా అందరికీ రక్షణ కలిగిస్తుందని బోధించటమే బ్రహ్మశబ్ద ప్రయోగంలో అంతరార్థం. బ్రహ్మరాత జీవితాంతం, జీవనాలున్నంత వరకు ఉంటుంది కదా! ఇక బ్రహ్మముడి దంపతుల దాంపత్య బంధం. వారి జీవితాంతం ఉంటుంది. బ్రహ్మరథం అనేది మహానుభావులకు బ్రాహ్మణులు చేసే సత్కారం. ఆ అనుభూతి జీవితాంతం ఉటుంది. దాని ఫలితం జన్మాంతరంలోనూ ఉంటుంది. బ్రహ్మచెముడు.. ఎంత పెద్దగా అరచినా వినరాదు. బ్రహ్మచర్యోపాసనే బ్రహ్మచారికి తరువాత జీవితమంతా ఫలిస్తుంది. లోకమంతా పూజిస్తుంది. బ్రహ్మరాక్షసి చాలా పెద్దదిగా గెలువజాలనిది. బ్రహ్మశౌచం దీర్ఘకాల శౌచం. బ్రహ్మ పుత్రులు సనకాదులు. మహాజ్ఞానులు. విశాలం, ఉన్నతం అనే విషయాన్ని తెలుపటానికి అలా వాడతారు. మీరు బ్రహ్మ విద్యను మరిచారు. అదే ముక్తిని ప్రసాదిస్తుంది. ముక్తి పొందినవాడు బ్రహ్మ అంతటి వాడవుతాడు. అందుకే బ్రహ్మవిద్య బ్రహ్మపదం. ©

భామనే.. సత్యభామనే..!

# 38

## సొగసు చూడతరమా...



**భారతీయురాలే అయినప్పటికీ హాలీవుడ్ ప్రేక్షకులకే ఎక్కువగా పరిచయం ఆ సౌందర్యరాశి! స్లమ్ డాగ్ మిలియనీర్ చిత్రంతో సినీ రంగంలోకి అడుగు పెట్టింది. డిజర్ట్ డ్యాన్సర్, తృష్ణ వంటి ఎన్నో నాటకాలు ప్రదర్శించి విమర్శకుల ప్రశంసలు పొందింది. మోడల్‌గా, టీవీ వ్యాఖ్యాతగానూ పనిచేసింది. ప్రపంచ ప్రేక్షకులను ఆకట్టుకుంటున్న ఆ అందాల తార ఫ్రీదా పింటో! మరి ఆమె సౌందర్య రహస్యమేంటో ఆమె మాటల్లోనే..**

షూటింగ్ లేకపోతే మేకప్ జోలికి వెళ్లను. వాతావరణంలోని తేమను బట్టి మాయిశ్చరైజర్ వాడతా. రోజులో మూడునాలుగు సార్లు ముఖం కడుక్కుంటా. ముఖంపై పేరుకుపోయిన మురికి, జిడ్డు వదిలి పగుళ్లు రాకుండా ఉంటుంది. వీలైనపుడు పెరుగుతో ముఖాన్ని మసాజ్ చేసుకుంటా. చర్మం మృదువుగా ఉంటుంది. గోరువెచ్చని కొబ్బరినూనెతో తలకు మసాజ్ చేయించుకుంటా. జుట్టు చిట్లిపోకుండా ఆరోగ్యంగా పెరుగుతుంది.

నిద్ర లేవగానే గోరువెచ్చని నీళ్లు మూడు గ్లాసులు తాగుతా. శరీరంలోని మలినాలు పూర్తిగా బయటికి పోవడానికి ఇది చక్కని మార్గం.

ప్రతిరోజూ గంటన్నరపాటు వ్యాయామానికి కేటాయిస్తా. ముఖ్యంగా యోగా, పిలేట్స్, కార్డియో, స్ట్రెచింగ్ ఉంటాయి. బాగా ఒత్తిడిగా అనిపించినపుడు అర్ధగంట పాటు యోగా చేస్తా. చాలా ప్రశాంతంగా అనిపిస్తుంది.

ఆహారం తక్కువ మొత్తంలో ఎక్కువసార్లు తీసుకుంటా. శరీరానికి అవసరమైన కార్బోహైడ్రేట్లు, ప్రోటీన్లు, విటమిన్లు, ఖనిజాలు, పీచుపదార్థాలు సమపాళ్లలో ఉండేట్లు చూసుకుంటా. తాజా పండ్లరసం, ఆకుపచ్చని కూరగాయలు తప్పనిసరి. రోజువారీ కార్యక్రమాలు ఉత్సాహంగా చేసుకోవడానికి తోడ్పడుతుంది. సహజమైన యాంటీఆక్సిడెంట్స్ లభించి చర్మాన్ని ఇన్ఫెక్షన్ల నుంచి కాపాడుతుంది.

ఓట్ మీల్, ఉడకబెట్టిన కోడిగుడ్డు లేదా ఆమ్లెట్, పండ్లు నా అల్పాహారం. ఆవిరిపై ఉడకబెట్టిన కూరగాయలు, ఆలు, సలాడ్ మధ్యాహ్న భోజనం. సాయంత్రం సమయంలో సాండ్ విచ్ తీసుకుంటా. ఓ గిన్నె నిండా కూరగాయల సూప్, చేపల ఫ్రై రాత్రి భోజనం. చికెన్, మటన్‌లకు దూరంగా ఉంటా. కాఫీ, టీ, కూల్ డ్రింక్స్ అస్సలు తీసుకోను. బీట్‌రూట్, క్యారెట్, కొత్తిమీర వంటి రసాలు తాగడం వల్ల శరీరంలోని విషపదార్థాలు పోయి ఆరోగ్యంగా ఉండేందుకు దోహదపడతాయి.

చర్మం తాజాగా, కాంతిమంతంగా కనపడాలంటే సరిపడ నిద్ర తప్పనిసరి!

సేకరణ : సంధ్యారాణి



# వేసవిలో ఇలా చేస్తే సరి!

వేసవి అనేక చర్మసమస్యలను మోసుకొస్తుంది. జిడ్డు చర్మం కలవారిలో నూనె గ్రంధులు మరింత చురుకుగా పనిచేస్తాయి. వాతావరణంలో తేమ లోపం వల్ల పొడి చర్మం కలవారూ ఇబ్బందికి గురవుతారు. చెమటపొక్కులు, చెమట, ఫంగల్ ఇన్‌ఫెక్షన్లు, డీహైడ్రేషన్.. వంటి సమస్యలు దాడిచేస్తాయి. సరైన ఆహారం తీసుకుంటూ తగు జాగ్రత్తలు పాటిస్తే వేసవిలోనూ చల్లచల్లగా ఉండొచ్చు.

- ముఖ్యంగా నీళ్లు ఎక్కువగా తాగాలి. ఆహారంలో ఎక్కువగా పండ్ల రసాలు, కొబ్బరినీళ్లు, నిమ్మరసం, మజ్జిగ, కూరగాయల సూపులు వంటి ద్రవపదార్థాలు ఉండేట్లు చూసుకోవాలి. నీరు పుష్కలంగా ఉండే పుచ్చకాయ, కర్బూజ, దోస వంటివి తీసుకోవడం ఉత్తమం. సరిపడ నీరు లభించి శరీరం చల్లగా ఉంటుంది.
- ఎండకు ఎక్కువసేపు ఉండడం వల్ల చెమట పొక్కులు, చర్మం పొడిబారడం, మంట వంటి సమస్యలు వస్తాయి. పదకొండు నుంచి మూడు గంటల మధ్యలో బయటికి వెళ్లకపోవడమే మంచిది. తప్పనిసరైతే వెళ్లడానికి ఇరవై నిమిషాల ముందు సన్‌స్క్రీన్ లోషన్ రాసుకోవాలి. గొడుగు, సన్ గ్లాసెస్ ధరించడం మేలు.
- వేసవిలో అతిగా మేకప్ వేసుకోకపోవడం మంచిది. తేలికపాటి మేకప్ చేసుకోవాలి. నీటి శాతం ఎక్కువగా ఉండే ఉత్పత్తులెంచుకోవాలి.
- రోజ్‌వాటర్‌లో దూది తడిపి చర్మం తుడుచుకోవాలి. చర్మాన్ని చల్లబరచడమే కాకుండా మంచి టోనర్‌గా కూడా పనిచేస్తుంది.

### కాంతిమంతమైన ముఖం కోసం..

- చల్లని దోస, పుచ్చకాయ రసాలను సమపాళ్లలో కలిపి ముఖానికి రాసుకోవాలి.
- పుచ్చకాయ, కర్బూజ గుజ్జును ముఖానికి రాసుకుని ఇరవై నిమిషాల తర్వాత కడిగేసుకోవాలి.
- దోస గుజ్జును పెరుగులో కలిపి ముఖానికి రాసుకుంటే టాన్ పోవడమే కాక చర్మం తాజాగా కనిపిస్తుంది.
- పెరుగులో కొద్దిగా శనగపిండి కలిపి ముఖానికి రాసుకోవాలి. ఇరవై నిమిషాల తర్వాత చల్లని నీటితో కడిగేయాలి.

### చెమటపొక్కుల నివారణ

వేసవిలో విపరీతమైన చెమట కారణంగా చర్మ రంధ్రాలు, స్వేద గ్రంధులు మూసుకుపోయి చెమట పొక్కులు ఏర్పడతాయి. వాటిని నివారించడానికి..

- చెమట పొక్కులున్న చోట కొబ్బరి నీళ్లు, తాటి ముంజ నీళ్లు రాయాలి.
- ముల్తానీ మట్టిలో రోజ్ వాటర్ కలిపి వారం పాటు పొక్కులపై రాస్తే తగ్గిపోతాయి.
- లేత తాటి ముంజ గుజ్జు వారం పాటు రాస్తే మంచి ఫలితం కనిపిస్తుంది.
- నోటి పొక్కుల నివారణకు క్యాబేజి ఉడకబెట్టిన నీళ్లు రోజుకు ఒకసారి తాగాలి.

### చర్మం ఇన్‌ఫెక్షన్ బారిన పడకుండా ఉండాలంటే..

- ఉదయం, సాయంత్రం చల్లని నీటితో స్నానం చేయాలి. తడి పూర్తిగా తుడుచుకోవాలి.
- వేసవిలో షూస్ వేసుకోకపోవడమే మంచిది. సాండిల్స్ వంటివి వేసుకోవడం వల్ల గాలి తగిలి పాదాలలో రక్తప్రసరణ బాగా జరుగుతుంది.
- వదులైన కాటన్ దుస్తులు వేసుకోవాలి. బిగుతుగా ఉండే జీన్స్, లెగ్గింగ్స్‌ను వాడకూడదు.
- ఇన్‌ఫెక్షన్ మరీ ఎక్కువగా ఉంటే వైద్యుని సంప్రదించడం మంచిది.



# టెక్ గురూ!

వేసవిలో ఒత్తిడి ప్రభావం అధికమే. రోజు వారీ పనులు సాఫీగా సాగాలంటే ఒత్తిడి తగ్గించుకోవడం తప్పనిసరి. ఆటలు అందుకు బాగా తోడ్పడతాయి. సరదా సరదా, ఆసక్తికర ఆటలెన్నో నెట్ బజార్లో లభిస్తున్నాయిపుడు. వాటిని గూగుల్ ప్లే నుండి డౌన్‌లోడ్ చేసుకోవచ్చు.

## బాటిల్ షూట్ త్రీడి




ఇది బాటిల్స్‌ను షూట్ చేసే ఆట. ఈ ఆటలో చాలా స్థాయిలుంటాయి. మొదట్లో తేలికగానే ఉంటుంది. స్థాయి పెరుగుతుంటే క్లిష్టత పెరుగుతుంది. నిర్ణీత సమయంలో అన్ని బాటిల్స్ షూట్ చేస్తూ ఉంటే స్కోరు పెరుగుతుంది. షూట్ చేసిన, బాటిల్ పేలిపోయిన శబ్దం వినిపించి నిజంగా షూట్ చేస్తున్న భావన కలుగుతుంది.

## స్టంట్ మాస్టర్ బైక్ రేసింగ్

బైక్ రేసింగ్ చూడ్డానికి ఇష్టపడని పిల్లలుండరు. మరి వారికే ఆ అవకాశమొస్తే..! స్టంట్ మాస్టర్ బైక్ రేసింగ్ ఆట ద్వారా ఆ కోరికను తీర్చుకోవచ్చు. రకరకాల స్టంట్‌లతో ఈ రేసింగ్ సాగుతుంది.




ఒక్కో స్థాయిని పూర్తి చేస్తూ కాయిన్స్ గెలుచుకోవచ్చు. అన్ని స్థాయిలను నిర్ణీత సమయంలో పూర్తిచేస్తే మూడు నక్షత్రాలు పొందొచ్చు. ప్రత్యర్థి బైకులను, కార్లను ఢీకొట్టొచ్చు. వాటిపై మంటనూ వదలొచ్చు. ప్రత్యర్థి బైకులను షూట్ చేసి డబ్బు పొందొచ్చు. త్రీడి ప్రభావం వల్ల సహజంగా బైక్ రేసింగ్‌లో పాల్గొన్న అనుభూతి కలుగుతుంది.

## రోల్‌కోస్ట్ అమేజింగ్ సిమ్

రోలర్ కోస్టర్ ఎక్కడానికి కొందరు భయపడతారు. అత్యంత వేగంగా తలకిందులు అయి మళ్లీ అంతే వేగంతో కోస్టర్ సాగుతుంటే ఎక్కడ పడిపోతామోనన్న ఆందోళన. మరి ఆటలోనైతే ఆ భయమే అక్కర్లేదు. ఎన్ని భయంకరమైన



స్టంట్స్ అయినా చేయొచ్చు. 15 స్థాయిలుగా ఉండే ఈ ఆట పూర్తిగా డిస్నీ వరల్డ్‌లో సాగుతుంది. స్టాపింగ్ పాయింట్స్ దగ్గర రోలర్ వేగం తగ్గించకపోతే యంత్రం మొరాయిస్తుంది మరి! ఆయా ప్రదేశాల్లో వేగాన్ని రెట్టింపు చేసి స్కోరును బాగా పెంచుకోవచ్చు కూడా. చూడదగిన ప్రదేశాల దగ్గర రోలర్ కోస్టర్ వేగాన్ని తగ్గించి ఆ వాతావరణాన్ని ఆస్వాదించొచ్చు. చక్కని గ్రాఫిక్స్, ఆకర్షణీయమైన శబ్దాలతో థ్రిల్లింగా ఉంటుంది ఆట!

## థీఫ్ కింగ్



చుట్టూ కాపలా ఉన్న ప్రదేశానికి వెళ్లి దొంగిలించడమంటే మీకు సరదానా? అయితే థీఫ్ కింగ్ ఆటను ప్రయత్నించండి. రాజు రకరకాల ఎత్తులతో పందెం కాస్తాడు. వాటిని చిత్తు చేస్తూ పజిల్స్ ఛేదిస్తూ సాగిపోవడమే ఈ ఆట.

## క్రొకొడాయిల్ ఎటాక్ 2017




ఈ ప్రపంచాన్ని మర్చిపోయి కాసేపు మొసలిలా నీటిలో ఈదుతూ.. కనిపించిన మనిషి, జంతువులపై దాడి చేయాలని సరదా పడుతున్నారా? క్రొకొడాయిల్ ఎటాక్ 2017 ఆటను డౌన్‌లోడ్ చేసుకోండి. సరదాగా బీచ్‌కు వచ్చిన వారిని ఆట పట్టించొచ్చు. ఈతగాళ్లు, సర్ఫింగ్ చేసేవాళ్లపై ఉన్నఫళంగా దాడి చేయొచ్చు!

అన్నీ సరైన సమాధానాలు రాసిన వారిలో డ్రా ద్వారా ఎంపికైన ఈ విజేతకు రూ.150/- త్వరలోనే అందుతాయి.

**కాకర్లమూడి కృష్ణప్రసాదు**

డో.నెం. 12-50-15,
శ్రీదత్త నిలయం, ఎ.పి.హెచ్.బి కాలనీ,
ఎల్ఐజి-215
తణుకు, ప.గో.జిల్లా పిన్ : 534 211

## చతురంగం - 72 జవాబులు

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 01 సు | ధే | 2 ష్ణ | | 3 భ్ర | 4 మ | 5 ర | | 6 భా | 7 మ |
| మ | | 8 కృ | 9 పి | | 10 స | వ | లా | మ | ణి |
| | 11 సో | | 12 నా | గా | వ | ళి | | నే | |
| 13 వి | నా | 14 య | కి | | రా | | 15 నె | | 16 స్త్రీ |
| దు | | 17 జ | ని | | 18 లు | 19 మే | ల | అ | |
| 20 షి | 21 హి | మ | | 22 న్య | | 23 స | త | | 24 య |
| | మ | | 25 తా | క | 26 స | క | | 27 వే | ద |
| | 28 జ | 29 ని | ర | | మి | | 30 శ్రీ | | |
| 31 మా | | ర్మ | | 32 సు | త | | 33 ము | ది | 34 త |
| 35 త | శ | ల | కుం | | | 36 స | ఖి | | న్వి |

## సరైన సమాధానాలు రాసిన వారు

1. ఎస్.రాజు, కర్నూలు, 2. గోశికే లింగయ్యగారి వేంకటేశం, చిక్కడపల్లి, 3. కె.వి.దుర్గామోహనరావు, వనస్థలి పురం, 4. కోలా గణేశ్‌కుమార్, విశాఖ, 5. పాలకుర్తి సుధీర్‌కుమార్, మాదాపూర్, 6. ఆంద్ర రామ లక్ష్మి, తణుకు, 7. గన్ని సుశీల, సజ్జాపురం, 8. మద్దూరి లక్ష్మీరాజ్యం, ఎర్రగడ్డ, హైదరాబాద్, 9. రామరపు చంద్రశేఖర్, మలక్‌పేట్, 10. సి.జి.శంకరరావు, ఎ.ఎస్.రావ్ నగర్, 11. టి.రాంకి షన్, కొత్తపేట, 12. పేర్వేల సత్యవతి, మణికొండ, 13. కొత్తపల్లి సుధాదేవి, చీరాల, 14. టి.పద్మ లత, మెదక్, 15. యు.నారప్ప రాధా, మద్దికెర, కర్నూలు, 16. ఎం.వసంత వీరేశ్, మద్దికెర, కర్నూలు, 17. కోకా శైలజ, ఇ.సి.ఐ.ఎల్, 18. అడపా సత్యనారాయణ బాబ్జీ, కూకట్‌పల్లి, 19. ఉడాలి భాస్కరయ్య, చెన్నై, 20. ఆర్.భారతి, ఎమ్మిగనూరు, 21. సముద్రాల సంతోష్ కుమారా చార్య, జగిత్యాల, 22. జె.జయశ్రీ, ట్రూప్ బజార్, 23. ఎన్.సుదర్శనరావు, హైదరాబాద్, 24. వి.వి.సత్యనారాయణశెట్టి, తిరుపతి, 25. పి. శుభ, బంజారాహిల్స్, 26. కొల్లూరి నాయుడమ్మ, ఇంకొల్లు, ప్రకాశం జిల్లా, 27. తోటపల్లి శశికళ, గుంతకల్లు, అనంతపురం, 28. ఎం.వసంత, బోర బండ, 29. ఎన్.విజయ, కాకినాడ. 30. యు.యు.యు. ఎమ్మిగనూరు, 31. చిల్లర సీతారామా రావు, వనస్థలిపురం, 32. చింతలపాటి శివశంకరశాస్త్రి, బి.హెచ్.ఇ.ఎల్, 33. పి.వి.ఎల్.సుజాత, సైనిక్‌పురి, 34. సి.రాజేశ్వరి, ఎ.ఎస్.రావ్ నగర్, 35. బోడపాటి కృష్ణవేణి, చెన్నై, 36. వి.ఆర్.కె.అల్లమరాజు, కాత్రేనికోన, 37. పాలగుమ్మి విశ్వనాథం, ఒంగోలు, 38. యు.ఎన్.ఎమ్., లాలా పేట్, 39. తోకల విష్ణువర్ధన్, ఇంకొల్లు, ప్రకాశం జిల్లా, 40. జి.శ్రీహరి, పాకాల, చిత్తూరు, 41. కన్నేపల్లి నారాయణమూర్తి, జీడిమెట్ల, 42. పప్పు కామేశ్వరరావు, అమలాపురం, 43. చింతపల్లి నాగేశ్వరరావు, ప్రసాదంపాడు, విజయవాడ, 44. జి.ముత్తుమారన్, చర్లపల్లి, 45. ఎస్.ఆర్.కె. మూర్తి, సత్యనారాయణపురం, విజయవాడ, 46. కరణం శివానందరావు, కర్నూలు, 47. ఎస్.శివ నారాయణ, నెల్లూరు, 48. వి.శ్రీలక్ష్మి, నల్లకుంట, 49. బత్తుల యాదగిరి, ఉప్పల్, 50. య.విజ యశేఖరరెడ్డి, కూకట్‌పల్లి, 51. వేమూరి భవాని, వరంగల్, 52. కె.వి.యస్.ఎన్.మూర్తి, విశాఖ, 53. దేవరాజు వెంకట నరసింహారావు, చైతన్యపురి, 54. సి.భారతి, హైదరాబాద్, 55. పి.శైలజా జానకి, మంగళగిరి, 56. మల్లవరపు శ్రీనివాసరావు, నెల్లూరు, 57. కస్తూరి వెంకుబాబు, గుంటూరు, 58. పొన్నపల్లి వెంకటప్పయ్య, నూజివీడు, 59. జి.వి.మురళీమోహన్, ముచ్చుమిల్లి, తూ.గో.జిల్లా, 60. జి.లక్ష్మీనరుసు, ముచ్చుమిల్లి, 61. మల్లిడి విజయభాస్కర్‌రెడ్డి, కుతుకులూరు, తూ.గో.జిల్లా, 62. కె.సుబ్రహ్మణ్యం, అనంతపురం, 63. సి.హెచ్.ఎ.నరసింహం, బెంగళూరు, 64. బిక్కునూరి రాజేశ్వర్, నిర్మల్, 65. వారణాసి విజయలక్ష్మి, పొడగట్లపల్లి, తూ.గో.జిల్లా, 66. పి.బి.సీతాదేవి, నరసాపురం, 67. ఎ.పూర్ణచంద్రరావు, నెల్లూరు, 68. యస్.టి.పి. కృష్ణమాచార్యులు, నాగోల్.

చిటికెలో రుచిగా..!

# హనీ లెమనేడ్

### కావలసిన పదార్థాలు

- ★ నిమ్మరసం - 1 కప్పు
- ★ నీళ్లు - 5 కప్పులు
- ★ పంచదార - 2/3 కప్పు
- ★ తేనె - 2 టేబుల్ స్పూన్లు

### తయారుచేసే విధానం

జార్‌లో నిమ్మరసం, నీళ్లు, తేనె కలిపి అందులో పంచదార కూడా వేసి కరిగేవరకు కలపాలి. తర్వాత దాన్ని ఫ్రిజ్‌లో పెట్టాలి. చల్లని హనీ లెమనేడ్ రెడీ! ఇక గ్లాసులో పోసి సర్వ్ చేయడమే!



# రాగి ఆల్మండ్ డ్రింక్

### కావలసిన పదార్థాలు

- ★ రాగిపిండి - 2 టేబుల్ స్పూన్లు
- ★ వేయించిన బాదం పొడి - 1 1/2 టేబుల్ స్పూన్లు
- ★ నీళ్లు - 5 కప్పులు
- ★ తరిగిన బెల్లం/ఖర్జూరం సిరప్ - 3 టేబుల్ స్పూన్లు

## తయారుచేసే విధానం

ముందుగా అరకప్పు నీళ్లలో రాగిపిండి, బాదం పొడి ఉండలు లేకుండా కలిపి పెట్టుకోవాలి. తర్వాత మిగిలిన నీళ్లలో తరిగిన బెల్లం లేదా ఖర్జూరం సిరప్ వేసి స్టవ్‌పై పెట్టాలి. నీళ్లు మరిగాక మంటను తగ్గించి దానిలో రాగిపిండి, బాదం పొడి కలిపిన నీళ్లు నెమ్మదిగా పోస్తూ ద్రవం చిక్కబడే వరకు కలపాలి. అలా రెండు నుంచి మూడు నిమిషాల సేపు ఉడకనిచ్చి మంట తీసేయాలి. గది ఉష్ణోగ్రతకు వచ్చాక లేదా పూర్తిగా చల్లబరిచాక తాగొచ్చు. మరీ గట్టిపడితే చల్లని పాలు, మజ్జిగ లేదా కొబ్బరినీళ్లు కలుపుకోవచ్చు.




# గంగ జమున జూస్

## కావలసిన పదార్థాలు

- ★ పెద్ద నారింజ - 3
- ★ పెద్ద నిమ్మకాయలు - 3
- ★ పంచదార - 3 టేబుల్ స్పూన్లు
- ★ నల్ల ఉప్పు - చిటికెడు
- ★ ఐస్ క్యూబ్స్

## తయారుచేసే విధానం

పెద్ద బౌల్‌లో నారింజ, నిమ్మ రసాలు తీసుకోవాలి. తర్వాత దానిలో పంచదార, నల్ల ఉప్పు వేసి కరిగేంత వరకు కలపాలి. గ్లాసులో పోసుకుని ఐస్ క్యూబ్స్ వేసి వెంటనే సర్వ్ చేయాలి. లేదంటే జూస్ చేదుగా మారుతుంది.

# చతురంగం - 73

## అడ్డం

1. సీతమ్మవారే మరోలా (3)
3. తెలుగు కథకుల్లో ఒకరు (3)
5. అశ్వం (2)
6. సల్మాన్‌ఖాన్ ఒకప్పటి మరదలు, 'కెవ్వుకేక' నృత్యకారిణి (3)
7. విచారం (3)
9. ముక్క, భూగోళంలో ఒక పెద్ద భాగం (3)
11. దేవనర్తకి, ఒకప్పటి హీరోయిన్ (2)
15. త్రిగుణాల్లో ఒకటి (2)
16. అడవి, తోట (2)
18. నగ (4)
20. పర్వతం, కొండ (2)
21. ఏడుకొండలవాడికి ఇష్టమైన వారం తడబడింది (5)
23. నిలువు 14 మరోలా (4)
25. బొడ్డు (2)
26. విశ్వనాథుడు కొలువైన పట్టణం తడబడింది (4)
28. అరిషడ్వర్గాల్లో ఒకటి (2)
30. 'ర' గుణింతం మొదటి రెండు (2)
31. కోట్ల ఖర్చుతో కూతురు పెళ్లిచేసిన బళ్లారి నేత ఇంటి పేరు (2)
32. అడ్డం 5 మరోలా (4)
34. అబ్బో! ఇది చేస్తే మత్తే మత్తు! అందుకే తోక తెగింది (3)
35. సముద్రం (3)
36. హనుమంతుడు (4)

## నిలువు

1. తెలుగు నెలల్లో రెండోది (3)
2. మంచు (3)
3. ప్రారంభించడాన్ని ఇలా అంటారు (3)
4. రాక్షసుల తల్లి శీర్షాసనం వేసింది (2)
5. వృశ్చికం (2)
8. దేవాలయం (2)
10. దీనికి లోకమంతా దాసోహం (2)
12. మనోవర్తి (3)
13. చేప, ద్వాదశ రాశుల్లో ఒకటి (2)
14. పంచభూతాల్లో ఒకటి (3)
16. బతుకు తెరువు కోసం ఇతర ప్రాంతాలకు వెళ్లడం (3)
17. బతుకుపై ప్రతివారికి - - ఉంటుంది (2)
18. సంగీతంలో ఒక రాగం (3)
19. సరుకును, మనుషులను ఒకచోటు నుంచి మరోచోటుకు చేర్చడం (3)
20. సంక్రాంతి ఈ మాసంలో వస్తుంది (3)
22. 'స్లోగన్'కు తెలుగు (3)
23. రాజ్‌కపూర్ అలనాటి అద్భుత సినిమా (3)
24. కునికిపాటు (5)
27. తల (3)
28. చీరలు దీనిపై నేస్తారు (3)
29. సుమతీశతకకారుడు ఏవి ఉన్న ఊళ్లో ఉండమన్నాడో వాటిలో ఒకటి (2)
31. పిల్లలు దీనివల్లే చెడిపోతారు (3)
32. 'వీరు' కాదు - - (2)
33. ప్రభాస్ హిట్ సినిమా (2)
34. యాంకర్లలో సుప్రసిద్ధురాలు (2)

విజయపథంలో ఆరేళ్ళు పూర్తి.. అదే పాఠకాదరణతో మరో ఏడాదిలోకి...

# చతురంగం - 73

రూ.150/- బహుమతి

గడువు తేది : ఏప్రిల్ 17

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | ■ | 3 | | 4 | ■ | 5 | |
| | ■ | 6 | | | ■ | 7 | 8 | | ■ |
| 9 | 10 | | ■ | 11 | 12 | ■ | | ■ | 13 |
| ■ | | ■ | 14 | ■ | 15 | జో | ■ | 16 | |
| 17 | ■ | 18 ఆ | | 19 | | ■ | 20 | | ■ |
| 21 | 22 | | | | ■ | 23 | | | 24 |
| ■ | 25 | | ■ | 26 | 27 | | | ■ | చ్చి |
| 28 | | ■ | 29 | ■ | 30 | | ■ | 31 | |
| | ■ | 32 | | 33 | | ■ | 34 | | |
| 35 | న్నీ | | ■ | | ■ | 36 | | | |

పంపినవారి పేరు: ------------------------------------------------

వయసు (      ) చిరునామా : ----------------------------------------

----------------------------------------------------------------

-------------------- పిన్ : -------------- ఫోన్ : --------------------

**నిబంధనలు**

✦ చతురంగాన్ని ఇదేపేజీలో పూర్తిచేసి పంపాలి. ✦ తుడుపులు, కొట్టివేతలు ఉండరాదు. ✦ మా 'కీ'తో సరిపోలిన పూరణలనే పరిగణనలోకి తీసుకుంటాం. ✦ గడువు తర్వాత అందిన పూరణలు పరిశీలించం. ✦ ఎక్కువ మంది సరైన జవాబులు రాస్తే డ్రా తీసి విజేతను ఎంపిక చేస్తాం. ✦ ఒక్కొక్కరు ఎన్ని కూపన్‌లైనా పంపవచ్చు. ✦ ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు. ✦ చతురంగంతోపాటు చతుర, విపుల కూపన్లు అన్నీ ఒకే కవరులో పంపవచ్చు

చిరునామా : చతురంగం **చతుర**, ఈనాడు కాంప్లెక్స్, సోమాజీగూడ, హైదరాబాద్- 82

ఫోన్ : 040 - 23318181,
Ext : 6658, 6532

# ఆ వృద్ధుడ్ని ఆకట్టుకున్న ఆ పిలుపు ఎవరిది?

**ఆ**యన ఆ ఫ్లాట్‌లో ఒంటరి!. ఇటీవలే భార్యపోయింది. పిల్లలు విదేశాల్లో ఉంటున్నారు. ఆయనో గొప్ప పెయింటర్, చదరంగంలో దిట్ట కూడా! దానికి గుర్తుగా ఇంటినిండా చెల్లాచెదురుగా పెయింటింగులు.. చదరంగం పాన్‌లు! ఏదో ఆలోచించినవాడిలా ఓ రోజు ఆయన మెల్లగా వాకింగ్ స్టిక్ అందుకుని ఆపసోపాలు పడుతూ ఆరోఫ్లోర్ చేరుకున్నాడు. ఆ తర్వాత టెర్రస్ మీదకెళ్లి పిట్ట గోడనెక్కి కిందికి దూకబోయాడు.. అంతలో చిన్నగా ఎవరిదో పిలుపు! క్షణకాలం ఆలోచనలో పడ్డాడు. ఆ తర్వాతేమైంది? ఇంతకీ ఎవరిదా పిలుపు? ఆద్యంతం ఆర్ద్రంగా చదివించే పంజాబీ కథ **జీవనధార కాంప్లెక్స్** మీకోసం!

**అ**తని ప్రబల శత్రువు వేరెక్కడో కాకుండా అతని ముక్కుకొస మీదనే తిష్ట వేశాడు. ఆ శత్రువంటే అతనికి పరమద్వేషం, అసహ్యం. ఎలాగైనా పగ సాధించాలనుకున్నాడు. చివరికోరోజు శత్రువును నాశనం చేశాడు. కానీ ఆ తర్వాత అతను తీవ్రంగా కృంగి కృశించిపోయాడు. ఇంతకీ శత్రువు నాశనమైనా అతడెందుకు సంతోషించలేకపోయాడు? యుగోస్లేవియా కథ **శత్రువు** చదవండి!




* సమాజంలో పొరలు పొరలుగా పెనవేసుకున్న అసమానతలను ఒలిచి చూపిస్తూ వ్యవస్థ గతిని కళ్లకు కట్టిన **రెంటాల నాగేశ్వరరావు** కథ **తిలదానం** **కథకుల ఫైల్**‌లో..

* కథలే కాక **సీరియల్ కిల్లర్స్**, **పేరడీ బీరెడీ**, **రింగరింగారే**.. మరెన్నో ఏప్రిల్ విపులలో!


Printed, Published, Edited & Owned, by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Colorama Printers Private Limited., 15/A/1, S.V. Co.Op Industrial Estate, Jeedimetla, Medchal District, 500 055 Telengana. Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 9959021802; Rajahmundry: 2468992; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 241101; Kurnool: 252813; Kadapa: 270011; Tadepalligudem: 228881; Warangal: 9959021804; Khammam: 9959021806; Nizamabad: 245661; Mahabubnagar: 8008706125; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982498; Chennai: 28242036; Bangalore: 25599686. Toll Free Help line No. 18004258888 (Hyd.), www.eenadu.net.








# కొంపలంటుకున్నాయ్..!

రాజేశ్వరికి ఆమె అన్న విష్ణు ఫోన్‌చేసి అర్జంటుగా రమ్మన్నాడు.
'అమోఘ వస్తానంది.. ఎదురుచూస్తున్నాను' అందామె.
'ఆ పిల్లని పంపేసి త్వరగా రా.. ఇక్కడ కొంపలంటుకున్నాయ్..' అన్నాడతను.
అంత వర్షంలో అన్నయ్య ఎందుకు రమ్మన్నాడో, ఏం ప్రమాదంలో పడ్డాడో అర్థంగాక అయోమయంలో పడిందావిడ.
ఇంతకీ విష్ణు ఎలాంటి ఆపదలో చిక్కుకున్నాడు?
రాజేశ్వరి అతనికి సాయపడిందా?
మారుతున్న కాలానికి తగ్గట్లు మారే పరిణామాలను
మనసుకు హత్తుకునేలా అక్షరబద్ధం చేసిన
సీనియర్ రచయిత **మాచిరాజు కామేశ్వరరావు** నవల **పరిణామం**

## బోనస్‌గా...

* *నవలావలోకనంలో..*

మూడు దశాబ్దాల క్రితం 'చతుర' నవలల పోటీలో అత్యుత్తమ నవలగా ఎంపికయింది **'స్వేచ్ఛ'!** తరతరాల కట్టుబాట్లు, సంప్రదాయాల చట్రంలో నలిగిపోతున్న స్త్రీకి తన స్వేచ్ఛను గురించి తెలియచెప్పిందీ నవల. కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు గ్రహీత, సుప్రసిద్ధ రచయిత్రి **ఓల్గా** కలం నుంచి జాలువారిన 'స్వేచ్ఛ'పై సమీక్ష మే నెలలో!

**CHATURA** Telugu Monthly, Dt. of publication : April 1, 2017.
Postal Regd No. HD/ 965/2015-2017 RNI No. 32186/1978

